


సంసారపు పాలకడలిని చిలకడములో చిందిన తుంపురులు

# దాంపత్యోపనిషత్తు

మునిమాణిక్యం నరసింహారావు

DAMPATHYOPANISHATTU
*By*
MUNI MANIKYAM NARASIMHA RAO

*Publisherrs :*
M. Seshachalam & Co;

*First Edition :*
December, 1971.

*Printers :*
WELDUN PRESS
MADRAS-21

*Cover Design :*
**BAPU**

*Distributors :*
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
Rashtrapathi Road, Secunderabad.

**Price Rs. 2-50**




183

# ముని మాట

హరిణీప్రేక్షణా యత్ర గృహిణీ న విలోక్యతే,
సేవితం సర్వసంపద్భి రపి తద్భవనం వనమ్.

ఏ భవనములో కురంగీనయన అయిన గృహిణి కనబడదో, ఆ భవనము సకల సంపత్తుల కూడుకొన్నప్పటికీ వనమే అవుతున్నది. కాని భవనము కావడము లేదు. గృహానికి గృహలక్ష్మి ఉండాలె—అన్నాడు పండితరాజు.

దాంపత్య జీవితాన్ని రమ్యంగా చిత్రించాలని నా అభిలాష. మంజులములయిన మధురవాక్కులలో కథాకథనం చెయ్యాలనీ, గార్హస్థ్య జీవిత సౌందర్యమును మనోహరంగా ఆవిష్కరణ చేయాలనీ ముప్పది సంవత్సరాలనుంచీ ప్రయత్నం చేస్తున్నాను. ఏదో కొంత వరకు నా కోరిక నెరవేరిందనే నేను అనుకొంటున్నాను.

రంభలు, నలకూబరులు, హంసలు, చిలుకలు, రాయబారాలు లేకుండానే వాస్తవ జీవితములోని మధురతమమైన ఘట్టాలను తీసుకొని చిత్రంలో కళా రూపము పొందేలాగున చెయ్యడానికి నా శక్తులన్నీ ధారపోసినాను.

జీవిత రామణీయకము మహారాజుల ఉన్నత సౌధాలలోనూ, ఉద్యానవనాలలోనూ మాత్రమే కాక రసవిహీన మనుకొన్న సామాన్య గృహస్థజీవితంలో కూడా ఉన్నదని చూపడానికి నేను నా జీవితం అంతా ప్రయత్నించాను.

ఈ పుస్తకం కూడా అట్టి ప్రయత్నానికి ఫలితమే; సంసారపు పాలకడలిని చిలకడములో చిందిన తుంపురులను పోగుచేయగా ఈ గ్రంథము తయారు అయింది.

ఉత్తమమైన కావ్యము లోకోత్తరాహ్లాద జనకముగా ఉండాలని అలంకారికులు అంటారు. ఈ పుస్తకం చదివిన మీదట అంత పెద్ద మాట రాకపోయినా ఆనందం కలుగక మానదు. కాబట్టి దీనిని కావ్యం అని పండితులు అంగీకరిస్తారని నాకు ధైర్యంగా ఉన్నది.

అయితే ఒకటి, నా బిడ్డ నాకు ముద్దు. ఈ పుస్తకం బాగా వ్రాశానని నేను అనుకొంటున్నాను. దీనికి కావ్యగుణాలన్నీ పట్టినవి—అనే నా ఉద్దేశ్యం.

ఏం, ఎందుకు పట్టలేదు? ఏమి లోపం ఉంది? ఇందులో అశ్లీలాలు ఏమీ లేవు. శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు ఉన్నవి. ఇక ధ్వని అంటారా, కావలసినంత ఉన్నది. ప్రతి వాక్యము ధ్వని వ్యంజకంగానే ఉన్నది. ఆనందవర్ధనుడికే హడలు పుట్టించేటంత ధ్వని పౌష్కల్యం ఉన్నది ఈ గ్రంథంలో. ఆనందవర్ధనుడి మహా ప్రాసాదమునకు సోపానపంక్తిగా విలువ దగిన వాక్యాలు ఉన్నవి నా రచనలలో—అని నేను చెప్పుకుని సంతోషిస్తున్నాను. ఆ వాక్యాలు ఇవి—అని నేను చూపడము అనవసరము. పుస్తకము మీ ముందు పెట్టాను. ముఖమున్నది, అద్దమున్నది. చూడగల అంతశ్చక్షువు ఉన్నది, చూడండి.

నేను అలంకార సమన్వితంగానూ, ధ్వనివ్యంజకంగానూ వ్రాశాను. చూడండి కావలిస్తే—అని చెప్పడం క్రొత్తగానూ, గర్వంతో వ్రాసిన వాక్యంగాను మీరు అనుకో కూడదు. పూర్వ కవులలో ప్రతి వాడూ, నే నంతవాణ్ణి, ఇంతవాణ్ణి, జాగ్రత్త—అని చెప్పుకో లేదూ! ఇది ఆనుపూర్వీక విద్వత్సంప్రదాయమే.

నా రచనలో ధ్వని ఉంది, ఔచిత్యముంది, ఉదాత్తత ఉన్నది. శ్రవణ సుభగత్వము ఉన్నది చూసు కోండి అనీ: ఉపమానాలు, ఉత్ప్రేక్షలు లేకపోతేనేమి, ఊపులున్నవి; వక్రోక్తులు లేకపోయినా వంపులున్నవి; నేను హాస్యవిష్ణువును. (బ్రహ్మ వేరే ఉన్నారు) శతాధిక గ్రంథకర్తను: హాస్యరసహస్య విదిత యశోభూషణుడను అని చెప్పుకోవలెనని సరదాగా ఉంది—చెప్పుకొంటాను.

నేను ప్రబంధ పరమేశ్వరుడను అని ఒకరూ, శతలేఖినీ పద్యసంధాన ధౌరేయుడనని ఒకరూ, ఆంధ్రకవితా పితామహుడనని ఒకరూ చెప్పుకొన్నట్లే నేనూ ఏదో చెప్పుకుంటాను.

ఇందు అలంకారాలు ఉన్నయ్యా, ధ్వని ఉందా, రమణీయత్వం ఉన్నదా—అని పండితులు చూస్తారు. సానుభూతితో చూస్తే అన్నీ కనబడుతవి. ఇందులో ఏది ఉన్నా, ఏది లేకపోయినా 'అది' ఉన్నదని నాకు ధైర్యమే. ఏమిటి 'అది?' పాఠకుణి పుస్తకం చివరదాకా లాక్కుని వెళ్ళే గుణము 'అది' ఉన్నది. దానిని రసము అన్నా, రమణీయత్వమన్నా ఒకటే!

స్త్రీకి సర్వాంగ సౌష్ఠవాదులున్నా వాటి నన్నిటిని మించినది, వాటికి భిన్నమైనదీ అయిన లావణ్యం ఉండాలె. అల్లాగే పుస్తకంలో భాష నిర్దుష్టముగా ఉండి, భావములు పరిశుద్ధమైనవిగా ఉన్నా 'అది' లేకపోతే అది వ్యర్థకావ్యమే అవుతుంది.

ఈ కావ్యంలోని రసము హాస్యము. హాస్యరసప్రధానమైన కావ్యాన్ని ఉత్తమకావ్యంగా పరిగణించే ఆచారం మనకు లేదు. కరుణకూ, శృంగారానికీ ఇచ్చిన గౌరవం దీనికి ఎప్పుడూ లేదు. కాని హాస్యరసం కూడా రమణీయమైనదే. దీనికీ గౌరవమూ, ఆదరణా ఇవ్వవలసి ఉంది.

హాస్యం తేలిక అయినదనీ బరువులేనిదనీ అంటారు. బరువు లేకపోతే నేమి? బంగారంలాంటి సరుకు ఇది. జీవితానికి ఆనందాన్ని ఇస్తుంది. అంతకంటే ఏంకావాలి? హాస్యసృష్టికి కూడా ఒక విశిష్టమైన దృష్టి. ఒక రకమైన ప్రతిభ కావాలె. దీనికి తేలికతనం ఎందుకు వచ్చిందీ అంటే, ఇది అందరికీ అర్థము అవుతుంది కాబట్టే. కావ్యాలు అర్థము కాకపోయినా బాగానే ఉంటవి. పద్యం అర్థం కాకపోయిన కొద్దీ దానికి గౌరవం ఎక్కువ అవుతుంది. దాని కావ్యగుణం కూడా పెరుగుతుంది. దాని సంగతి అల్లా ఉంచండి. అర్థం అయినంతమాత్రాన హాస్యం ఏమీ తక్కువది కాదు.

హాస్యం అర్థమైనట్లు ఉంటుంది. కాని నిజానికి బాగా అర్థము కాదు. దాని లోతులు తెలియడమూ కొంచెము కష్టమే. కవిత్వం ఎట్లా అర్థం చేసుకొంటారో, హాస్యాన్నీ అట్లాగే అర్థం చేసుకోవాలె. లోతుపాతులు వెదకి కనుక్కోవాలె. మెరుగుల లోపల ఉన్న చమత్కారపు లోతు తెలిసికొని ఆనందిస్తే ఇంక కావలసింది ఏమున్నది?

ఈ పుస్తకం బాగా వ్రాశాను. అందులో కావ్యగుణము ఉంది, చమత్కారము ఉంది—అని నేను అనడం గర్వంతో కాదు. మీరు పుస్తకాన్ని సావధానంగా చదివి ఆనందిస్తారన్న ఆశతో. అంతకంటే మరేమీ లేదు.

నిజంగా నేను గర్వపడటానికి కారణం ఏమీ కనపడటంలేదు. బిరుదులా లేవు; ప్రభువుల ఆదరణ ఎవ్వరికీ లేదు కదా! ప్రజాదరణ అంతంత మాత్రంగా ఉన్నది. విద్వత్కవి సమ్మానము ఇంత వరకూ లేదు. అయితే నా గొప్పతనము ఒక్క విషయంలో ఉన్నది. ప్రసిద్ధులైన కవులు, పండితులు అయిన వారి స్నేహమే నాకు గల మహా భాగ్యం. దాన్ని చూచుకొనే నేను గర్వపడుతున్నాను. శివశంకర స్వామివారు, కాటూరువారు, విశ్వనాథ, మొక్కపాటి భమిడిపాటి మొదలైన మహా కవులు నాకు గురువులూ, మిత్రులూనూ, ఆ ఐశ్వర్యం చూచుకొనే నేను గర్వపడుతున్నాను.

ఈ పుస్తకాన్ని ఎల్లాగ చదవాలె—అన్న విషయాన్ని గురించి రెండు మాటలు వ్రాస్తున్నాను.

ఇది హాస్యగ్రంథము. ఆ విషయము గుర్తించి చదవండి. అంటే కాసేపు నవ్వుకొనడానికి సిద్ధపడి మరీ పుస్తకం తెరవండి. విసుకుగా ఉన్నపుడు ఈ పుస్తకం చదవకండి.

అసలు మంచి పద్ధతి ఇది: వెన్నెలరాత్రి, ఆరు బయట రెండు పక్కలు వేసుకోవాలి. తెల్లని దుప్పట్లు వాటిపై పరవాలి. కాసిని మల్లెపూలు పక్కలపై పోసుకోవాలి. ఆ తరువాత భోజనాలు చేసి తాంబూలచర్వణం కూడా పూర్తి చేసి, దీపం కనపడేటట్లు పెట్టుకొని పరుపుపైన పడుకొని మీ ఆవిడను వినమని ఈ పుస్తకం చదవాలె. ఇద్దరూ కలసి నవ్వుకొంటారు. అదీ నా అభీష్టము.

ఈ పుస్తకం ప్రధానంగా వినోదానికే వ్రాసినా, పఠనంవల్ల కొంత విజ్ఞానం కూడా ఉంటుందని నా నమ్మకం. గ్రంథోపగతమైన ఉపదేశాలు అనుష్ఠిస్తే ఇల్లు స్వర్గం అవుతుందనే నా ఉద్దేశ్యం.

సాహితీ సమితి
1-8-1954

ఇట్లు
మునిమాణిక్యం.

# గ్రంథావతరణ ప్రశంస

మా యింట్లో ఆవిడకు, నాకూ మధ్య తగువులేని రోజు లేదు. మా ఇంట్లోనే ఇట్లా ఉంటూ ఉన్నదా, అందరి ఇళ్ళల్లోనూ ఇంతేనా? అందరి ఇళ్ళల్లోనూ యింతే అయితే వాళ్ళు ఎల్లా నెట్టుకొస్తున్నారు? ఈ సందేహం నన్ను చాలాకాలంనుంచీ బాధిస్తూ ఉన్నది.

ఎవ్వరి ఇళ్ళల్లోనూ పోట్లాటలు ఉన్నట్లు లేదు. ఉన్నా పైకి పొక్కటం లేదు. నేనూ, మాఆవిడా పోట్లాడుకొంటున్నామని నాకు చెప్పిన స్నేహితుడు ఒక్కడూ లేదు. మా యింట్లోనే పోట్లాటలు ఉండటం ఏమి: ఎవ్వరి ఇళ్ళల్లోనూ లేకపోవటం ఏమి? ఇందులో ఏదో రహస్యం ఉంది. కనుక్కోవలెనని నేను నిశ్చయించుకొని కృషిచేయగా, నా కృషి కొంత ఫలించింది.

మహా కవులూ, కథకులూ, విమర్శకులూ అయినవారు, జీవితమును రమణీయము, కాంతిమంతమూ చేయటానికి అవలంబించిన మార్గాలు ముందు చెప్పి, ఆ తరువాత నాకు తోచిన హితవు చెప్పదలచినాను. ఈ గ్రంథము అవతరించిన విధ మిది.



# 1

ప్రసా. మీ భార్యకూ అభిప్రాయభేదాలు రావా? వస్తే పోట్లాటలు లేకుండా ఏవిధంగా జరుపుకొని వస్తున్నారు? అని నా స్నేహితులైన [illegible]గంటివారిని అడిగానుు. ఆయన మంచి పండితుడు; సాహితీ [illegible]టుడు. మన స్తత్వ శాస్త్రము బాగా తెలిసినవాడు. ఆయన చెప్పింది ఇది :

[illegible]. నా భార్యకూ అభిప్రాయ భేదాలు రాకుండా ఉండవు - [illegible]నే ఉంటవి. ఆవిడ అభిప్రాయానికి భిన్నమైన అభిప్రాయం [illegible]లిగి ఉన్నప్పుడే మేము భిన్నాభిప్రాయులము అవుతాము. భిన్న [illegible]ప్రాయాలు గల అభిమతాలకు సంఘర్షణ ఏర్పడి తగవుగా పరిణ[illegible]మిస్తుంది. కాబట్టి అభిప్రాయభేదం వచ్చినపుడు నా అభిప్రాయం నేను ఆవిడతో చస్తే చెప్పను. ఇంక ఆవిడ ఏంచేస్తుంది? నోరు మూసుకొని ఊరుకొంటుంది. ఇదే నేను అవలంబిస్తూ ఉన్న మార్గం పోట్లాటలు లేకుండా ఉండటానికి" అన్నారు. "అభిప్రాయ భేదాలు వచ్చినపుడు నేనే నోరుమూసుకొని ఊరుకొంటాను" అని చాలా [illegible]త్కారంగా చెప్పినారు గదా అని సంతోషించాను.

[illegible] తరువాత కాటూరువారిని అడిగాను. "ఏమండీ అన్నగారూ! మీ యింట్లో పోట్లాటలు లేవా?" అని. ఆయన "లేవు. మేము ఎప్పుడూ పోట్లాడుకోలేదు" అన్నారు. నాకు వళ్ళు మండింది. "అది ఎట్లాగ సంభవము అయిందండీ? మీ ఆవిడ అంత సుగుణవంతు రాలా? వినయసంప త్తిగలదా? మీరు చెప్పినట్లు వింటుందా?" అని అడిగాను. ఆయన ముఖం చిట్లించి విసుగుతో, "నేను చెప్పినట్లు ఆవిడ వింటుందని ఎవరన్నారయ్యా! ఆవిడ చెప్పినట్లే నేను

వింటాను. ఏదైనా మాటామాటా వచ్చి ఆవిడకు కోపంవస్తే నేను వెంటనే 'దోషముగల్గె సేవలన, దోపిలియొగ్గితి నేలుకొమ్ము నీ దాసుడ' అని 'ముట్టెద తత్పదద్వయిన్' అని గబగబా నడచి వెళ్ళి పోయినారు.

నేను నిర్ఘాంతపోయినాను. ఇంకా నయం. మా యింట్లో వ్యవహారం. ఇంకా అందాకా రాలేదుకదా! అనుకొన్నాను.

దేవులపల్లివారిని అడిగాను. ''ఏమండీ! మీ యింట్లో సంగతి ఏమిటీ?'' అని. ''మీ ఆలుమగలు మధ్య పొరుపుగాని. పోట్లాటగాని ఉంటుందా లేదా'' అని.

“అమ్మో! నా ప్రియురాలితో పోట్లాట నేను భరించలేను: ఒకవేళ వచ్చిందో నాకు దుఃఖంవస్తుంది. ఆ దుస్సహ గాఢ దుఃఖం ఆపుకో లేను. ఏడుపు వస్తుంది. నా సంగతి నీకు ఈమాత్రం తెలియదేం! మృదుల కరుణామధురము నా హృదయము. ఈ సంగతి ఎవ్వరికీ తెలియకపోయె! ఎవ్వ రెరుగజాలరు ఏమని ఏడ్తునెపుడు” అని చీత్కారముచేసి వెళ్ళిపోయినాడు.

వేదులవారిని అడిగాను. ''నీ సంగతి ఏమిటయ్యా? నీకూ, మీ ఆవిడకూ పోట్లాటలు ఏమన్నా ఉన్నాయా? ఉంటే ఏమి చేస్తున్నావు?” అని.

''పోట్లాటలు లేకేమయ్యా! నే నెంత బాధ పడుతున్నానో నీ కేమి తెలుస్తుంది! నా బాధ ఎవ్వరికీ చెప్పను. నేనే నాలోన మూల్గుకొందు. కనికరపు జూపు చిఱునవ్వు తునకయై కంటికి కలవయ్యె పాడులోకాన నాకు!” అన్నాడు.

“దేవులపల్లివారు భార్యతో పోట్లాటవస్తే రోదనము చేస్తారట! మరి నీకు ఏడ్పురాదా?'' అని అడిగాను.

“రాకేమయ్యా. చచ్చేట్లు వస్తుంది. కాని కనుల రానీ, నొక బాష్ప కణమునైన'' అన్నాడు. జాలివేసింది - పాపం ఇట్లాంటి బాధలు ఆయనకూ ఉన్నాయి కదా అని!

...ముద్రమే, మహాసాగరాగాధ హృదయ బడబానలజ్వాల యెవ్వరికి తెలియును? అని గోలపెట్టాడు కదా అని అనుకొన్నాను.

ఈ తగవులతో లాభంలేదని మా గురువుగారైన శివశంకరస్వామిని కలిసి అడిగాను. "స్వామీ! భార్యా భర్తల మధ్య పోట్లాటలు లేకుండా వుండే మార్గం ఏదీ?" అని.

"భార్యా భర్తల మధ్య పోట్లాటలు లేకుండా ఉండటం అనేది అసంభవం. ఇది అనాదినుంచీ వస్తూ ఉన్న సదాచారము. అనుకూలవతి అంటే కొద్దిగా, తేలికగా, సరసంగా, ఏదో సంసారపక్షంగా కలహించేది అని అర్థం. కాని బొత్తిగా ఏమన్నా నోరుమూసుకొని పడివుండేది అనికాదు. అది అసలు రహస్యం. ఈ పరమ రహస్యం తెలుసుకొని నీ జీవితగమనాన్ని దిద్దుకో. కాదంటావా? సన్యాసం పుచ్చుకో. ఎవ్వరికి చెప్పకుండా! అప్పుడు తప్పకుండా ...వచ్చి నీ కాళ్ళపైన పడుతుంది" అన్నారు.

ఓహో ఇంతేనా! దాంపత్యజీవితం ప్రశాంతం కావాలంటే రెండే మార్గాలు. ఒకటి భార్యా విధేయత్వము, రెండోది ఆశ్రమ స్వీకరణ అనుకున్నాను.

...లు తమ భార్యలతో ఏవిధంగా ప్రవర్తిస్తున్నారో చెప్పాను. కవులు ఒకవిధంగా ఉన్మత్తులు. వాళ్ళ మాటలు మనకు ప్రయోజనకరాలు కావు: నమ్మదగినవీ కావు. శుభ్రమైన వచనరచన చేసే వాళ్ళ ఉద్దేశాలు ఎల్లాగు ఉన్నవో తెలుసుకొందామని అనుకొన్నాను. అందుకు మా మొక్కపాటివారిని అడిగినాను. "ఏమండీ: మీరూ, మీ ఆవిడా ఎప్పుడైనా పోట్లాడుకొన్నారా?" అని.

ఆయన ఒక నిమిషం ఆలోచించి "చిన్నతనంలో సంగతి బాగా జ్ఞాపకంలేదు. కాని ప్రస్తుతం ఏమీ పోట్లాటలు లేవు. శాంతంగా వెళ్ళిపోతున్నవి రోజులు" అన్నాడు. నేను ఆశ్చర్యపడి "ఎలా సాధించారు? ఎప్పటినుంచీ ఈ పోట్లాటలు లేకపోవటం?" అన్నాను.

ఆయన చిరునవ్వు నవ్వి "ఏమీలేదు. నేను ఇప్పుడు మద్రాసులో ఉంటున్నాను; మా ఆవిడ రాజమండ్రిలో ఉంటున్నది. ఎప్పుడైనా టెలిఫోన్‌లో మాట్లాడుకొంటున్నాము. టెలిఫోన్‌మీద పోట్లాడు కోటానికి తగిన వ్యవధి దొరకటంలేదు. అదీగాక చాలా డబ్బు ఖర్చుపెడితేగాని ఆ సరదా తీరదు. టెలిఫోన్‌వారికి వ్రాసి కనుక్కో వాలి. ఏమైన తక్కువ రేట్లకు అలాంటి అవకాశం యిస్తారేమో" అన్నాడు.

గిడుగువారిని అడిగాను, 'మీ సంగతి ఏమిటండీ?' అని. ఆయన ఇంట్లోనూ పోట్లాటలు లేవట। పోట్లాటలే కాదు, అసలు మాట్లాటలే లేవు. ఎందుకంటే, ఆయన ఒక ప్రతిజ్ఞ చేశారు. ఇంట్లో సవర భాషలో మాత్రమే మాట్లాడతానని. బైట సవరభాషను గురించి మాత్రమే మాట్లాడతానని. ఈ ఏర్పాటువల్ల ఆయన ఏమంటున్నదీ ఆమెకు తెలియదు. అందుకని భార్యాభర్తల మధ్య పోట్లాటలు లేకుండా పోయినవి.

ఇక మిగతావాళ్ళ విషయము: ఒక్కొక్కరు ఈ విషయంలో ఏమి చెప్పిందీ వ్రాస్తున్నాను.

వేలూరివారు: "ఇంటావిడకు మన మాటలు ఏవీ వినపడనంతటి దూరంలో ఒక కుటీరం నిర్మించుకొని, ప్రొద్దస్తమానమూ అక్కడే కాలంగడపటంవల్ల చాలావరకు భార్యాభర్తల మధ్య పోట్లాటలు వుండవు."

గిడుగు పంతులుగారు: "మా యింట్లో పోట్లాటలు లేవు. ఆవిడ అరచి చచ్చినా నాకు వినపడదు."

ధనికొండవారు: "నన్ను వేపబెత్తంతో వీపు చిట్లగొడితే మళ్ళీ మాట్లాడదు. ఒకటిరెండు సార్లు ఇల్లాగ జరిగినతరువాత మా ఆవి డకూ నాకూ అభిప్రాయ భేదాలంటూ లేకుండా పోయినాయి."

బుచ్చిబాబుగారు: 'తెలిసినవాళ్ళ మాట తెలియనివాళ్ళు వినడం ధర్మము. మా ఆవిడ ఎప్పుడూ 'మీకేమీ తెలియదండీ, మీ కీమాత్రం తెలియదేమండీ!' అంటూ వుంటుంది. ఇల్లాగ ప్రతి

[illegible] [illegible]లో సూరిపోయటం మూలాన నాకు ఏమీ తెలియదు - [illegible] సంస్కారం బాగా కుదిరింది. అన్నీ తెలిసిన విజ్ఞానసర్వస్వము [illegible] ఆవిడ. ఆవిడమాట మెదలకుండా వినడమే నా పని. ఇక పోట్లాటలు ఎల్లాగుంటవి?''

బుద్ధులపుడకవారు: ''భార్యా భర్తల మధ్య పోట్లాటలు లేకుండా ఉండాలంటే భర్త సంస్కృతం నేర్చుకోవాలె. నీవు సంస్కృతంలో మాట్లాడు—ఆవిడకు అర్థంకాదు. దాంతో గప్‌చిప్‌గా ఊరుకొం టుంది ఆవిడ. నేను అలాగే చేస్తున్నాను.''

అభ్యుదయకవి: ''అభ్యుదయమార్గాన నడచి నేను ముందుకు వచ్చేశాను. ఆవిడ అక్కడే ఉండిపోయింది. మా యిద్దరి మధ్య దూరం ఎక్కువ అయింది. ఆవిడ మాటలు నాకు వినపడవు; నా మాటలు ఆవిడకు వినపడవు.''

నారాయణబాబు: ''భార్య అంటే ఏమిటో నాకు తెలియదు. నా అభి ప్రాయం కావాలని మీకు గట్టికోరిక ఉంటే, నాకొక పెళ్ళికూతురును చూడండి. పెళ్ళి చేసుకొని కొన్నాళ్ళు ఆ జీవితం ఎల్లాంటిదో చవి చూచి తరువాత అభిప్రాయం చెబుతాను.''

దాంపత్య జీవితం శాంతంగా గడచిపోవాలంటే ఏమి చెయ్యవలెనో, కవులూ, కథకులూ చెప్పగా విన్నావు. ఇప్పుడు నా అనుభవాన్ని బట్టి నేను చెప్పే హితవాక్యాలు విను.

## 2

అసలు గృహము అంటే ఏమిటో తెలుసుకో బాబూ! నాలుగు గోడలూ, కప్పూ ఉన్నంతమాత్రాన, ఆ ఆవరణ గృహంకాదు. గృహము అంటే ఏమిటో పండితరాజు చెప్పినాడు. పండితరాజు మాటల కేమిగాని, మా కాంతం ఏమన్నదో తెలుసునా? _ కిలకిల

లాడుతూ ఉండే పిల్లలూ, కిచకిచలాడుతూ ఉండే పిచ్చికలు లేని యిల్లు ఇల్లేకాదు - అన్నది కాంతం. గృహిణి అంటే ఇల్లాగ ఉండాలె - అని తెలుసుకో. చల్లగా చక్కగా ఇల్లు సర్దుకుపోయే నేర్పూ, పిల్లలనుకనేశక్తీ ఎవరికి ఉంటుందో:

ఎవరికి గృహాన్ని స్వర్గసీమగా చేయగల శక్తిసామర్థ్యాలు ఉంటాయో:

ఎవరికి రసవిహీనమైన శోకపరితప్తమైన ఈ జీవితాన్ని సౌఖ్యావహమూ, సౌందర్యమయమూ చేయగల రాగహృదయం ఉంటుందో: ఎవరికి తనపిల్లల ఆటలలో శ్రీకృష్ణుని శైశవలీలలను చూడగల అనురక్తి ఉంటుందో:

చమత్కార సంభాషణలచేతనూ, వినోద కలాపాల చేతనూ, కామ క్రీడలచేతనూ ఎవరు భర్తను సంతోష పెట్టగలరో:

ఎవరు గృహానికి కాంతిని, శాంతిని ప్రసాదించి, ఈ గృహాన్ని శ్రీరంగధామము చెయ్యగలరో, ఆమెయే సత్ గృహిణి.

# 3

ఎప్పుడూ మీ ఆవిడఅందాన్ని గురించి సూటిగా మాట్లాడకు. నీవు పొగడుతున్నావని ఆవిడ ఇట్టె పట్టేస్తుంది.

'జానకి అందమైన పిల్లేనంది' అంటుంది మీ ఆవిడ ఎప్పుడో మాటల సందర్భంలో. నీవు ఏమి అనవలెనో తెలుసునా? 'ఆఁ, నా తలకాయ అందం, ఎట్టగా బుట్టగా ఉండగానే సరా! ముక్కూ, ముఖమూ చక్కగా ఉండవద్దూ? కోటేరు పోసినట్లు ముక్కూ, దీర్ఘమైన కేశపాశమూ, మృదు మధురమైన వాక్కూ ఉండవలెనే గాని రంగు ఒక్కటి ఉంటే సరా!' అను. అంటూ మీ ఆవిడవంక తృప్తితో చూడు.

...న్ని మీ ఆవిడకు ఉన్నయ్యి అని నీకూ తెలుసు. మీ ఆవిడకూ తెలుసు.

...విధంగా మీ ఆవిడే చక్కనిది - రంగులేకపోయినా అనే స్ఫురణ ... కలుగజెయ్యి. దీనినే ధ్వని అంటారు ఆలంకారికులు. కావ్యా ...కే కాదు. వాక్యానికికూడా ధ్వని అందమే. అటువంటివాక్యమే ...వ్యము అన్నారు. ధ్వనించటములోనే వుంది సౌందర్యమంతా.
"...యింట్లో నీవు ధ్వనిస్తూవుంటావా బాబాయి!" అని నన్ను ...గుతున్నావుకదూ!

...యింట్లో ధ్వని ఉందికాని, ఆ ధ్వని వేరు. నేను ధ్వనించను ...గా ఆవిడే ధ్వనిస్తూ వుంటుంది. ప్రొద్దుగూకులూను! ఆవిడే ధ్వని ...కరురాలు.

...నితత్వము మా కాంతానికి తెలిసినంతగా ఆనందవర్ధనుడికీ, ...నపగు ప్తుడికీ తెలియదనే నా అభిప్రాయము.

# 4

...వాహికజీవితం సుఖస్వప్నంలాగ గడచిపోతుందని ఎప్పుడూ ...నుకోవద్దు. అసలు ఎందుకు పెళ్ళిచేసుకొన్నానా, అని అనుకొనే ...గియలూ ఉంటవి ఈ జీవితంలో.

...ఒక దుఃఖస్వప్నమూకాదు. అల్లాగ యెప్పుడైనా అనిపిస్తే, ...ఉన్న మెలకువ తెచ్చుకుంటే ఆ దుఃఖస్వప్నం అదృశ్య మవు...ంది.

## 5

దాంపత్య జీవితపరిణామ సౌఖ్యజనిత శాంతిసాధనకు ఒకటే మార్గము. ఏమిటాఅంటే, కొంపలో పీమాట సాగాలని కలలోనైనా అనుకోపోవటమే। ఆమెగారిదే హైకమాండు. ఇది అందరికీ తెలిపిన విషయమే. గృహసామ్రాజ్యానికి ఆమె పట్టమహిషి.

## 6

అప్పుడప్పుడు భార్యా భర్తలమధ్య చిన్న చిన్న పోటాటలు ఉన్నంతమాత్రాన గార్హస్థ్యజీవిత మాధుర్యానికి లోటు ఏమీ రాతేదు. ఈ చిట్టితగవులే మధురిమలను చిలుకుతవి. మృదువూ, మనోహరమూ అయిన గులాబిపువ్వు ముండ్లపొదలో పెరుగుతున్నదా, లేదా।

## 7

ప్రథమం రోజుకు మూడుసార్లుఅయినా భార్యను ముద్దుపెట్టుకొని' ఆవిడ చాలా చక్కనిది - అని నీవు అనుకొంటూ ఉన్నట్లు ఆమెకు అభిప్రాయం కలుగజెయ్యి. ఈ విషయం ధ్వనింపచేయి. అది ఎట్లాగో తెలిసికోవలెనంటె, ధ్వన్యాలోకమును తెలుగుచేసిన తిరు వెంగళాచారిగారిని అడుగు.

## 8

సాయంత్రము వెందలాడే రమ్మని ఆ పిల్ల ఎందుకు అంటున్నదో నువు కాస్త అయినా ఆలోచించావా? లేకపోతే యెప్పుడూ యింట్లోనే ఉండమంటుంది కాసేపు స్నేహితులతో కాలం గడిపితే ఈవిడ [illegible]ంమ్మ ఏమిపోయింది? అని విసుక్కొని ఊరుకొన్నావా?

పిచ్చివాడా! ఆ పిల్ల నీ నిరంతర సామీప్య సంజనిత సంతృప్తిని అభిలషిస్తున్నది. అందుకనే నిన్ను తొందరగా ఇంటికి రమ్మనటం! హృదయగతమైన ప్రేమను అంతకంటే విస్పష్టంగా, విశదంగా, సభ్యంగా మన దేశములో పుట్టిన ఏ యిల్లాలూ చెప్పదు.

నిన్ను విడిచి ఒక్క నిమిషమైనా ఉండలేను ప్రియుడా! - అని పాశ్చాత్యస్త్రీ పతితో అన్నమాటకు ఎంత విలువవున్నదో, దీనికీ అంత విలువ వున్నది.

## 9

బాబూ! కావ్యములోనైనా, కాపురములోనైనా ధ్వని ఉండాలె. ఆ విషయం కాస్త విపులంగా చెపుతాను విను.

శబ్దముల అర్థం ఒకవిధంగా కనబడుతూ, మరియొక అలౌకికార్థ స్ఫురణ కలిగివుంటే దానిని ధ్వని అంటారు.

ఈ ధ్వని ఉత్తమకావ్యలక్షణము. అదే కావ్యానికి రమణీయత్వాన్ని చేకూరుస్తూ ఉన్నది. కావ్యంలో రసప్రతీతి కలగటానికి ఈ వ్యంజన వ్యాపారమే ప్రధానంగా ఉపకరిస్తూ ఉన్నది.

కావ్యానికి ధ్వని యెల్లాగయితే లోకోత్తర రమణీయత్వాన్ని చేకూరుస్తూ ఉన్నదో, అలాగే గృహానికి కూడా ధ్వని అలంకార మనిన్నీ. గృహస్థజీవితాన్ని పరిపుష్టంచేసి రసమయంగా చేయటానికి తోడ్పడు తుందనీ నా సిద్ధాంతము. ధ్వని గృహానికి సౌభాగ్యసంపత్కరము.

ఇప్పుడు ధ్వనిఅంటే ఏమిటో కొంచెం విపులంగా చెప్పటం అవసరం ఈ ధ్వని రెండు రకములుగా ఉంటూ వున్నది. వస్తుధ్వనిఅనీ, రసధ్వని అని.

వస్తుధ్వని అంటే ఏమిటో వివరిస్తాను : ప్రాచీనులు జడజగత్తుకు చెందినవాటినే వస్తువులు అన్నారు. కాబట్టి జడమైనటువంటి చెంబులూ, తప్పాలాలు, గిన్నెలూ, గ్లాసులూ మొదలైన సామగ్రి ఇటూ, అటూ పడటంవల్ల జనించేధ్వని వస్తుధ్వని అయింది.
అయితే కుక్కలూ, పిల్లులూ, కోళ్ళూ ఆవులూ మొదలైన జంతువుల మూలంగా ఉత్పన్నం అయ్యేధ్వనీ, పిల్లల అరుపులూ, ఏడుపులూ మొదలైనవాటివలన కలిగేధ్వనీ వస్తుధ్వనిక్రిందకే వస్తుందా అని ప్రశ్న. ఆనందవర్ధనుడు అంగీకరించినా, అంగీకరించకపోయినా ఇదంతా వస్తుధ్వనే.

ఇక ధ్వనిప్రాశస్త్యాన్ని గురించి ఒకమాట చెప్పవలసి ఉన్నది. ఈ వస్తుధ్వని ఎక్కడైతే ఉన్నదో, ఆ స్థానము పిల్లలుగల ఇల్లు - అని సహృదయుల కందరికీ ప్రతీయమానము అవుతుంది.

ఇక్కడ పాత్రసామగ్రి ఉన్నది, ఇక్కడ శునక మార్జాలాది జంతు సముదాయము ఉన్నది అని మాత్రమే కాక ఇది రమణీయమైన గృహము అని ఎప్పుడయితే సహృదయానికి ద్యోతకంఅవుతుందో అప్పుడే ధ్వనికారంకు జరిగిన దన్నమాట. కావ్యములోనైనా, కావ్[illegible]లో[illegible]ని సాఫల్యాపౌష్కల్యం సౌందర్యనిర్మాణానికీ, సమ[illegible]ప్రతీ[illegible]గాదము అవుతూవున్నదని నా మతము.

వస్తు[illegible]ో. దాని స్వరూప ప్రయోజనములు ఎట్టివో స్పష్టీకరించ[illegible]ధ్యాని మహాకావ్యాలలోనే కాక గృహస్థ

జీవితములో ఎలాగు గమ్యమానము అవుతున్నదో ఇంతకుముందు చెప్పినాను. ఇక రసధ్వని విషయం చెప్పవలసి ఉంది.

ఈ రసధ్వనికూడా భార్యాభర్తలమధ్య జరిగే సంభాషణలలోనూ, పోటీ మాటలలోనూ, ఎత్తిపొడుపులలోనూ, వేళాకోళాల్లోనూ, వెక్కిరింతలలోనూ అభివ్యక్తం అవుతూవుంటుంది. దీనికోసం పెద్ద కావ్యాలు వెతకనక్కరలేదు.

ఇంకొక మాటకూడా అంటాను. ఒక్క రసధ్వనేకాదు, అన్ని ధ్వనులుకూడా మన ఇళ్ళలోనే సహృదయులకు ఉదాహరణలు గోచరిస్తవి.

మన ఇళ్ళలో జరిగే సంఘటనలూ, సంభవాలూ, సరసాలూ, విరసాలూ పట్టి వచనసామాగ్రి మాత్రమే అవుతున్నది. వాటిలో సమగ్రరసప్రతీతికి దోహదం ఇచ్చే రమణీయ ఘట్టాలు ఏమున్నవీ - అని అనేవారు లేకపోలేదు.

రసమంటే ఏమనుకున్నావు? విభావ అనుభావ సంచారీ భావములు సమ్మిళితములై, పరిపుష్టములై రమ్యమానం కావలెను. మన కొంపలో జరిగే విషయాలలో ఇన్ని భావాలు ఎక్కడున్నవి? - అని కూడా అంటారు.

కాని మనఇళ్ళలో ఇవన్నీ ఉన్నాయి. ఇంకా ఉన్నవి. భార్యాభర్తలు ఒక్కొక్కప్పుడు పోట్లాడుకుంటూ ఉంటే, బీభత్స, భయానక రసాలు తాండవిస్తవి. వారి మామూలు సంభాషణలలో రసాభివ్యక్తి కలుగుతూ ఉంటుంది.

ఆయన ఆఫీసులో ఉద్యోగి. భార్య ముగ్ధ. ఏ సమయంలో ప్రసన్నతతో ఉండవలయునో, ఏ సమయంలో కుపిత కావలయునో తెలియదు. నాథుడు ఆమెను విడనాడి సకాలమునకు కారి సమ్ముఖాన ఉండవలయుననెడి తొందరపాటులో ఉన్నాడు.

ఆమె ప్రియుణ్ణి సమీపించి ఆలింగనం చేసికొని పదే వరికి రావలె, ప్రొద్దుగూకితే నాకు భయం" అంట

విజావికి ఆమె కేమీ భయంలేదు. అంతగా భయం అయితే ఆయన వచ్చినదాక ప్రక్కభాగంలో అద్దెకున్నవాళ్ళదగ్గర కూర్చోవచ్చు. అదికాదు విషయం. 'నేను మిమ్ములను విడిచి వుండలేను' అని వ్యంగ్యంగా చెబుతున్నది.

ఈ సంఘటనలో రసాభివ్యక్తి పుష్కలంగా ఉంది. విప్రలంభ శృంగారం ప్రధానంగా ధ్వనిస్తున్నది.

ఇంకొక ఉదాహరణ ఇస్తాను; కాంతం భర్త కాంతాన్ని సమీపించినాడు. ఆమె అతనిని చూడలేదు. పూలమాల కడుతూ ఉన్నది. అతడు ఆమె రెండు కళ్ళనూ తన రెండు చేతులతో గట్టిగా మూసినాడు. ఆ పిల్ల, ఎవరా కళ్ళుమూసినదీ - అని విస్మయాన్ని పొందినది. అప్పుడు ఆయన "నేను యెవరినో చెప్పుకోవాలె. లేకపోతే నిన్ను ముద్దుపెట్టుకోక మానను'' అన్నాడు.

పాపం ఆ పిల్లకు ఏమీ తోచలేదట: చేతులను తొలగించటానికి ప్రయత్నంచేసింది కాని సాధ్యంకాలేదు. ఎవరా అనీ, ఏమి పేరు చెబుదామా అని ఆలోచించింది. కాని ఏపేరూ తోచలేదు. ఆ అమ్మాయి చిరాకుతో, 'ఏమిటామాటలు! చాల్లే, ఊరుకోండి' అన్నది.

ఈ సన్నివేశం సాధారణమైనదే. నిత్యజీవితంలో దృశ్యమానమయ్యే రమణీయమైన సంఘటన. తన కళ్ళు మూసిన దెవరో ఆ పిల్లకు తెలియకపోలేదు. లోలోపల ఆనందిస్తూనే ఉన్నది. ఎవరో తెలియనట్లు నటించటంలో చమత్కార మున్నది. 'ఆమె చాల్లెండి ఊరుకోండి' అని చీదరించటం కుహనారూపకమైన అనురాగ ప్రకటన. 'ఏమిటా మాటలు?' అని అనటంలో అనురాగం ఉభయత్రా ఉన్నపుడు ఆలస్యం ఎందుకూ అని: ఇదికూడా రసధ్వనికే ఉదాహరణ.

ఇల్లాగ దాంపత్యజీవితంలో రసమయ ఘట్టాలు ఎన్నో ఉన్నవి. ఒక్కొక్క సంఘటనలో, ఒక్కొక్క సన్నివేశములో ఒక్కొక్క రసము పుష్కలంగా ఉంటుంది.

లన్ని రసములూ ఆస్వాదయోగ్యమే అగుటవలన గృహస్థ జీవనం. నవరసగంగాధరం అని భావించవలసి ఉంటుంది. అన్ని ఘట్టాలూ సామరస్యంగా నడిపిస్తే దాంపత్య జీవితము ఒక మహాకావ్యం అనుటలో సందేహం ఏమాత్రమూ లేదు.

# 10

ఎప్పుడు ఇంటికి ఆలస్యంగా వచ్చినపుడు ఎందుకు ఆలస్యంగా వచ్చావో నిజం చెప్పు మీ ఆవిడతో.

ఇవ్వాళ చీట్లపేక ఆడుతూ కూర్చున్నాను. రాలేకపోయినాను. ఈ ఊరి మిత్రులతో కలసి కృష్ణానది వైపునకు షికారు వెళ్ళాను. అని ఇలాగ జరిగింది జరిగినట్టూ, ఉన్నది ఉన్నట్టూ చెప్పు.

ఎందుకు నేను ఇలాగ 'నిజం చెప్పు బాబూ' అని కోరుతున్నానో తెలుసా? అబద్ధం ఆడటం మహాపాపమని ఋషులు చెప్పారనీ కాదు; 'సత్యంవద' అని వేదంలో వున్నదనీకాదు।

అల్లాగ అబద్ధం ఆడితే చాలా చిక్కులు వస్తవి. ఈ విషయంలో ఎంతో అనుభవంగల నాబోటివాళ్ళే. కళ్లు తేలేసి చతికిలబడ్డ రోజు లున్నవి.

నీవు కృష్ణఒడ్డుకు షికారు వెళ్ళావు. ఆ మాట చెపితే 'ఇంటిసంగతి చూడుకోరుటండీ? ఈ విధంగా. యిల్లుపట్టకుండా తిరిగితే ఎవరు చూస్తారు ఈ వ్యవహారంఅంతా?' అని ఆవిడ అంటుందని నీవు ఏదో అబద్ధం కల్పిస్తావు. అదే ఈ అబద్ధాల జన్మరహస్యం।

ఆ చెప్పే అసత్యం ఆమెకు ఇష్టమైనదిగా ఉండవలెననీ, ఆమెకు వివి సంతోషించేదిగా ఉండాలని ఆలోచించి చివరకు 'గుంటూరునుంచి ఎవరో వస్తే ఆయనతో మాట్లాడుతూ కూర్చున్నాను. మీ

అన్నయ్యా. ఆయనా ఒక బ్యాంకిలోనే పనిచేస్తున్నారు' అంటావు నీవు.

బాగానే వుంది ఈ కల్పన. ఆమె అన్నగారి స్నేహితుడితో నీవు మాట్లాడుతూ కూర్చున్నావని విని ఆమె సంతోషిస్తుందని ఊహించావు. కాని దానితరువాత ఆమె వేసే ప్రశ్నలకు నీవు తట్టుకోగలవా?

'మా అన్నయ్య బ్రాడీపేటలో ఉన్నాడటనా? ఇంకో ఊరు బదలాయిస్తారనుకొన్నారట; ఆ సంగతి ఏమైంది? ప్రొమోషన్ ఈ నెలలోనే రావాలట. వచ్చిందేమో కనుక్కున్నారా?' అని ఇలాగ లక్ష ప్రశ్నలు అడుగుతుంది మీ ఆవిడ

ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పటంలో ఎక్కడో పప్పులో కాలేస్తావు.

ఒకప్పుడు ఆ అమ్మాయి తెలిసే అడుగుతుంది. ఈ సంగతి చూడరాదూ. ఆయన యిల్లు మార్చాడని నీ పెళ్ళానికి ఇదివరకే తెలుసు. అయినా అడుగుతుంది. నీవు ఆలోచించి, ఆలోచించి ఇంకా మార్చ లేదు, మారుద్దామని అనుకొంటున్నాడు - అంటావు తెలివిగా. ఆ రత్తమ్మ చెప్పింది మీ ఆవిడకు. 'నేను గుంటూరు వెళ్ళివచ్చాను వదినా! మీ అన్నయ్య ఇప్పుడు అరండల్‌పేటలో ఉంటున్నారే' అని! ఆ సంగతి నీ కెట్లా తెలుస్తుంది? కాబట్టి అబద్ధాలు ఆడితే లాభంలేదు.

ఇంకొక సంగతికూడా ఉన్నది. నీవు కృష్ణఒడ్డున షికారుచేస్తున్నావనీ, సిగరెట్లు తాగుతున్నావనీ అన్నీ తెలుసు ఆ అమ్మాయికి. ఏ కుఱ్ఱవాడో చెప్పి ఉంటాడు!

ఆ పిల్ల ఎంత టక్కరో నీవు గ్రహించలేవేం? ఆ అమ్మాయికి ఈ సంగతులు అన్నీ తెలిసినపుడు తెలిసినట్లు మాట్లాడక, నీవు చెప్పిందల్లా నమ్ముతున్నట్లు నటించి, చివరకు 'ఎందుకండీ, ఈ అబద్ధాలూ?' అని బాంబులాగ విసురుతుంది తనకు తెలిసిన విషయం. పైపెరి 'ఎవరైనా వింటే నవ్విపోరూ?' అని భయపెడుతుంది కూడా!

అప్పుడు ఏం చేయాలో తెలుసునా? తెల్లముఖం వెయ్యనూ వద్దు. నేను చెప్పేదంతా నిజమేనని దబాయించనూ వద్దు. నిజం ఒప్పుకో. ... అను : 'అవును. అబద్ధాలే ఆడుతున్నాను. నా పెళ్ళాంతో ... వచ్చినట్లు అబద్ధాలు ఆడు కొంటాను. ఒకరికి నవ్వ ... ఏముస్నది?' ఈ మాటలు విని ఆ పిల్ల నవ్వి ఊరు ...

... మొదటనే నిజంచెపితే ఏ చిక్కులూ ఉండవు. ఒక్క సంగతి ... నీవు బయట ఏం జేస్తున్నదీ. ఎక్కడికి వెళ్లిందీ అన్నీ ... వెయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తూనే ఉంటుందన్నవిషయం మాత్రం బాగా జ్ఞాపకం ఉంచుకో.

## 11

...ప్రాలవిడను నీ అభిప్రాయాలతో ఏకీభవింపచేయాలనీ. తన్మూ ...గా ఆమెను నీ యెడల సుముఖురాలునుగా చేసికొన వలయుననీ ...తూ ప్రయత్నించకు. మహామహావాళ్ళే ఈ విషయంలో ప్రయత్నంచేసి విఫలులైనారు. ప్రయత్నం వృథా. కాలం వృధా. ... ఆమె యెడల సుముఖుడవు కా.

... సీరు ముఖం చూపకపోతే. నీవే అటు తిరిగివెళ్ళి. ఆమెకు ...రుగా నుంచో!

## 12

...ర్యమీద కోపం తెచ్చుకోకు ఎప్పుడు. కాని ఒకవేళ కోపంవస్తే ... చెయ్యాలి?

... ఎగిరిపోయేలాగున అరచినా. పెద్దగా ఏడ్చినా ఏమీ లాభంలేదు. ... అసహ్యంకూడాను. అలాంటప్పుడు ఏం జెయ్యాలో నేను

నా కథలలో సూచనచేసినాను. శాస్త్రకారుడు కూడా స్పష్టంగా చెప్పాడు 'ఉపేక్ష' వహించాలని.

అంటే, స్థానత్రయమును నోరూ, కళ్ళూ, చెవులూ అరికట్టాలె. అంటే మూసుకోవాలె. ఆమెవైపు చూడ కూడదు. ఆమె మాటలకు జవాబు చెప్పకూడదు. అసలు ఆమె అంటూఉన్నమాటలు విన కూడదు. అప్పుడు ఆ రాధికా వల్లభుని అపార కృపామహిమచేత నీకు శాంతి లభిస్తుంది.

అంటే నోరు మూసుకొని ఊరుకోవలెనన్న మాట। ఆ ఊరుకోవటం ఎట్లాగుటా, గదిలో పరుపుపై పడుకొని తల దిండులో దూర్చవలె నట। ఒకవేళ దిండు తడిసినా ఫరవాలేదూ - అన్నాడు శాస్త్రకారుడు।

ఇలాగ ఉంటే మూడు రోజులకుగాని, అదృష్టంఉంటే అంతకు ముందుగాని, గృహము ప్రశాంతమూ అవుతుంది; గృహిణి ప్రసన్న వదనా అవుతుంది.

ఇదీ శాస్త్ర ప్రవచనము।

# 13

ఆవిడ చదువుకోలేదు. ఆవిడకేం తెలుసు - అని ఎప్పుడూ అను కోవద్దు. ఆవిడకు తెలిసినన్ని విషయాలు నాకూ నీకూకూడా తెలియవు.

ఒక ఆంగ్లేయకవివద్దకు పుస్తకాలు అమ్మే ఏజెంటు వెళ్లి, 'అయ్యా। యిది విజ్ఞానసర్వస్వం. ఒకటి కొనండి' అన్నాడట.

'ఎందుకయ్యా ఈ పుస్తకం?' అని అడిగాడు కవి.

ఏజెంటు అన్నాడూ, 'ఏ విషయాన్నిగురించి తెలుసు కోవలెనన్నా, ఈ పుస్తకం చెబుతుంది.'

కవిగారు నవ్వి, 'నా కెందుకయ్యా, నాకు పెళ్ళాము ఉంది' అని ఆ ఏజెంటును పంపివేశాడట.

ఈ కథవిని జ్ఞాపకం ఉంచుకో బాబూ! నీవూ అల్లాగ ప్రవర్తించ వలసి వస్తుందేమో యెప్పుడైనా !

రామారావుగారి భార్య గయ్యాళిగంప. మొగుణ్ణి ఎంతమాట పడితే అంతమాట అనేస్తుంది. కచేరీసావిట్లో ఆయన పెద్దమనుష్యులతో మాట్లాడు తున్నాడు. కాసేపు ఊరుకొందాము అని ఆమె అనుకోదు. ఒకరోజున ఆయన యెవరితోనో మాటా డుతున్నాడు. ఎదురుగా ఉన్న గది తలుపు బార్లాగా తెరచిపెట్టి ఉంచి అరిచి ఏడుస్తున్నది.

"పెళ్ళి అయినతరువాత ఒకసారి చెబితే తెలియాలె! నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకుంటూ ఉన్నా చీమకుట్టినట్లు అయినా లేకపోయె. ఇల్లా చచ్చేది! బావిలోపడి చద్దామంటే దొడ్లో బావి అయినా లేక పోయె వెధవ పంపులు వచ్చి పడ్డతరువాత!

ఏ పొరుగింటి బావిలోనైనా పడి చద్దామంటే వాళ్లు చావనిస్తారా! అయినా పొరుగింటి బావిలోపడి చచ్చినదాకా నాకేం కర్మం? ఒక స్వంతబావి తవ్వించుకొనే చస్తాను.

ఓరి భగవంతుడా! ఈ కొంపలో ఎందుకు పడేశావురా నాయనా! ఏదో బావి వున్న కొంపలోనైనా పడేయక!

మూడేండ్లనుంచి ఈ బాధ ఏమిటి! ఆయన మందు ఇప్పించకపోవ టం ఏమిటి: ఎక్కడైనా ఉన్నదా ఇంత అన్యాయం! నేను చస్తే మాత్రం ఆయనకు జాలి ఉందా! మనిషి అయితేగా! అదో నల్లరాయి. రాయి!" అని ఇల్లాగ ఎత్తిపోస్తున్నది.

రామారావుగారి స్నేహితులు ఈ మాటలు విన్నా. మర్యాదగా ఉండ [illegible] మాట్లాడలేదు. సంగతి గ్రహించి రామారావుగారే ఇల్లా అన్నారు.

"[illegible]చేసకండి. ఆవిడకు మతి సరిగ్గాలేదు బాబూ! తన కేదో బాధ ఉన్నట్లు మాట్లాడుతుంది. దానిపిచ్చి అటువంటిది. అదొకరకంపిచ్చి! పిచ్చిమందు లిప్పించినా లాభించటంలేదు.'

## 14

భార్య చెప్పినదల్లా ఓపికగా వినడం భర్త అయినవాడు అలవరచు కోవలసిన సుగుణాలలో మొదటిది. దాంపత్య సౌఖ్యసాధనకు ఇది ప్రథమసోపానం. భార్య కాపురానికివచ్చి, చాలా సంవత్సరాలనుంచి భార్యతో కాపురంచేస్తున్న వాళ్ళకు ఈ హితవాక్యం అనవసరం. వాళ్ళకు ఈపాటికి ఈ సుగుణం ఎముకల్లోకి పాకిఉంటుంది.

## 15

ఈ కథకూడా విను. నీవు దాంపత్యం నడపటానికి ఇందలినీతి యెంతఅయినా ప్రయోజనకారి.

ఒక యువకుడు నా వద్దకువచ్చి "మాష్టారూ! మా ఆవిడకు కోప మెక్కువండి. చీటికి మాటికి ఎగిరిపడుతుంది" అన్నాడు.

'ఎందుకు అల్లాగ చేస్తుంది. కారణం ఏమిటి?' అన్నాను.

'కారణం ఏముందండి! ఏదో స్వల్పవిషయము ఆమె కోపానికి కారణం అవుతుంది' అన్నాడు.

ఏదైనా విచారములో ఉన్నవాడికి విచారం పోగొట్టవలెనంటే, అతని కంటే యెక్కువ దుఃఖాలు అనుభవించిన వాళ్ళసంగతి చెప్పాలి. అందుకని నేను అన్నానూ, 'నీవింకా అదృష్టవంతుడవు. మీ ఆవిడ ఏదో కారణం ఉంటేనేగాని యెగిరిపడదంటున్నావు. నే నెవరితో చెప్పుకొనేది? మా ఆవిడ ఏమీ కారణం లేకుండానే యెగిరిపడు తుంది. ఒకప్పుడు పడకుండా, యెగిరింది యెగిరినట్టుగానే ఉండి పోతుంది. ఇంతకూ పిల్లలు పుట్టిందాకా అంతేరాబాబు! దాని తరు వాత అణగిపోవచ్చు' అన్నాను.

ఆ పిల్లవాడు బిక్కముఖంపెట్టి 'పిల్లలు పుట్టకేమండి! ఇద్దరుపిల్లలు నాకు!' అన్నాడు.

'అయితే కొంచెంఅయినా అణిగిందా ఎగిరిపడటం!'

'[illegible]. పైగా ఎక్కువ అయింది. ఇదివరలో నా ఒక్కదిమీదే [illegible]. ఇప్పుడు నాపైనా, పిల్లలపైనా కూడా యెగిరిపడు [illegible]. ఏం జేయమంటారు?'

'[illegible]యమంటానూ అంటే, అసలు ఏమిచెయ్యాలా అంటే, ఇది [illegible]లో మహామహావాళ్ళు ఏంజేశారో నువ్వూ అదే చేయాలి.'

[illegible]విని ఆ కుఱ్ఱవాడు గంపెడంత ఆశతో ముఖం ఇంత చేసు [illegible] అడిగాడు - 'ఏం జేశారు మాష్టారూ! చెప్పండి' అని.

'[illegible]శారా, మాట్లాడక ఊరుకొన్నారు. ఏమీ చేయలేదు. నీవూ [illegible]యి. దీనినే ఉపనిషద్వేదాంతంలో 'ఉపేక్ష' భావము [illegible]రు'.

'[illegible]పంలాంటిదాండి ఇది!'

'[illegible] అల్లాంటిదేమీకాదు, మాంచి శుభ్రమై నటువంటి, పవిత్రమై [illegible] భావం' అన్నాను.

## 16

[illegible] చేసిపెట్టినవంట బాగుండలేదని యెప్పుడూ అనబోకు. భార్య [illegible] వంట భర్తకు బాగుండక పోవటము అంటూ ఉండదు. [illegible] దివ్యంగా, అద్భుతంగా ఉంటుంది. మొదటి రోజులలో [illegible]లలో ఉండే సత్యం నీవు చటుక్కున గ్రహించలేక [illegible] నాలుగేండ్లు గడచిన తరువాత నీవే అనుకొంటావు, ఎంత [illegible]సత్యం చెప్పాడురా ఈ పెద్దమనిషి అని।

[illegible] ఆమెకూర్చుని కష్టపడి ఆ వంటచేసింది నీకు రుచిగా [illegible]! అలాంటప్పుడు బాగుండక పోవటం ఎలా జరుగు[illegible]?

ఒకవేళ కాస్త ఉప్పు ఎక్కువ అయినా, పాకం కుదరకపోయినా, ఆవిడ పడ్డకష్టం జ్ఞాపకం తెచ్చుకో. ఆ వస్తువుకు రుచి అధికం అవుతుంది.

ఆ తరువాత ఉప్పు ఎక్కువ అయినసంగతి కనుక్కొని, 'అదేమిటండీ! ఉప్పెక్కువ అయిందికదా. చెప్పలేక పోయినారు' అంటే, 'అరే, యెక్కువ అయిందా? నాకెక్కువ అయినట్టే లేదు. బాగుంది - తినేశాను' అను నవ్వుతూ. ఆ తరువాత యెంత తమాషా జరుగుతుందో చూడు.

మీ ఆవిడ ప్రక్కయింటి ఆవిడతో అంటుంది. 'మీ అన్నయ్యకు ఏమీ తెలియదు వదినా! కూరలో ఉప్పు ఎక్కువఅయినా కనుక్కోలేరు. వట్టి అమాయకులు.' ఈ మాటలు విని నీవు నవ్వుకుంటావు. ఆ అమ్మాయి లోపల ఏమి అనుకొంటుందీ అంటే, తాను బాంగా ఇంత అమాయకుణ్ణి పెట్టుకొని కాపరం చేయగలుగుతున్నదనీ. ఇంకొకరు అయితే చెయ్యలేక పొయ్యే వారేనని!

పోనీ, అలాగే అనుకోనీ. నీకు వచ్చిన నష్టం ఏముంది? అమాయకుడైన భర్తను తన రెక్కల క్రిందికి తీసికొని, తన చేలాంచలము కప్పి పోషిస్తున్నానని గర్వపడటం ప్రతి స్త్రీకి సహజము. పోనీ, అలాగే అనుకోనీయవయ్యా! ఆమె పరిష్వంగములో బహిఃప్రపంచమును మరచి సుఖించటానికి నీకు అభ్యంతరం ఎందుకూ!

# 17

నీకు ఎంత ఆదాయము వస్తున్నదీ, నీవు యింటికోసమని ఎంత ఖర్చు చేస్తున్నదీ ఆ పిల్లదగ్గర దాచబోకు. లేకపోతే నీ దగ్గర ఏమి ఉన్నదో తెలియక ఆ పిల్ల తనకు అవీ ఇవీ కావాలని వేధిస్తుంది. అనుభవంగల యట్టివారూ, ప్రాజ్ఞతగల యట్టివారూ, ఇదివరలో భర్తృభారం వహించినట్టివారూ చెప్పిన విషయము ఇది - 'నాయనా,

.. వచ్చే నాలుగురాళ్ళు ఆ పిల్ల చేతికేఇచ్చి వాడమను. ఇల్లు గడిపి నాలుగు రాళ్ళు వెనకేస్తుందీ. సరే మరీ మంచిది. వెయ్యలేదూ. పోనీ. ఇల్లు గడపడం ఎంత కష్టమో ఆ సంగతిఅయినా తెలిస్తుంది ఆ పిల్లకు!'

... నీ సిగరెట్లకూ వాటికీ కొంత కావాలి. దానికి ఎల్లాగనేగా నీ గోల! ఆవిడను ప్రతిమిలాడితే అణో, బేడో ఆవిడే ఇస్తుంది. ...టికీ నీ పై సంపాదన ఉండనే ఉందిగా. మనలో మాట.

... ఆవిడ నెందుకు ప్రతిమిలాడాలి. నాకేం ఖర్మం అంటావు. ... అలాగ అనబోకు బాబూ! ఒక అణా ఇయ్యమని అడిగి, ... ఆమెకొంగు పట్టుకు లాగటమూ. 'రోజూ బేడా పావలా కావాలంటే ఎక్కడినుంచి వస్తుందండీ నా దగ్గరలేదు' అని ఆ పిల్ల అనటం. నీవు వెంటబడి 'ఒక బేడా యిద్దూ. ఉ( ఉ( పోనీ ఒక అణా ... యియ్యి' అని పసిపిల్ల వాడిలాగ గునుస్తూ ఆమె వంట ఇంట్లోకి వెడితే వంట యింట్లోకి, దొడ్డిలోకి వెడితే దొడ్డిలోకీ ...టమూ. ఆమె విసుక్కుంటూనే డబ్బులు నీ చేతిలో పెట్టడమూ. ... తమాషాగా ఉంటుంది ఈ వ్యవహారం అంతా! ఇదంతా ఒక ...క్రీడ. వాత్స్యాయనుడికి కూడా తెలియదు ఈ కామాక్రీడా ...ంతము.

... జీవితం రమణీయంగా చేసుకోవాలె నంటే, ఇలాంటి కామ ... ఎంతఅయినా అవసరము.

# 18

... భార్య నిన్ను గౌరవించటం లేదని యెప్పుడూ అనుకోకు. ... అయిన మనిషి భర్తను ఎప్పుడూ గౌరవించదు.

... మాత్రం మగవాడు మీసాలు దువ్వి తనను తన భార్య గౌరవిస్తున్నదనీ. తనమాటకు ఎదురు చెప్పదనీ అంటాడు. ఒట్టిది.

అటువంటి తత్వం స్త్రీ స్వభావంలోనే లేదు. సింక్లర్ లేవీ అని అమెరికాలో రచయిత ఉన్నాడు. అతడు చాలా గొప్పవాడు. నోబుల్ బహుమానాన్ని పొందిన మహనీయుడు.

ఆ బహుమానం ఇరువై వేల పౌనులు. సామాన్యులకు వచ్చే బహుమానం కాదు అది. ఏ శాస్త్రంలోనైనా, ఈ ప్రపంచంలో ఎక్కువ కృషి ఎవరు చేస్తారో వారికి ఇస్తారు. లేవీ సాహిత్యంలో చేసిన సేవను గుర్తించి ఆ బహుమానం ఇచ్చారు.

ఆ బహుమానం తనకు వచ్చిందని, పాపం సింక్లర్ పరుగెత్తుకుంటూ వెళ్ళాడట. ఈ శుభవార్త పెళ్లాముతో చెపుదామని! ఆవిడ ఈ మాట విని చాలా ఆశ్చర్యాన్ని ప్రకటించి, 'అదేమిటండీ! అదేదో చాల గొప్పవాళ్ళకు ఇచ్చే బహుమానం గదా! మీ కెట్లా వచ్చిందండీ?' అని గోల పెట్టిందట!

దీనిని బట్టి తెలియటంలేదు బాబూ, పెళ్ళామన్న మనిషి మొగుణ్ణి గౌరవించదని? ఆడది భర్తను ప్రేమిస్తుంది; కాని గౌరవించదు.

# 19

ఒక్క సంగతి బాబూ, మీ ఇంటికి వస్తూ ఉంటుందే, ఆ పిల్ల సుందరమ్మ చక్కనిదని మీ ఆవిడచేత ఒప్పించ టానికి నీవు ఎప్పుడూ ప్రయత్నించకు. ఆవిడ చక్కనిదే. అందులో సందేహం ఏమీలేదు. అంతా ఒప్పు కొంటారు. కాని నీ భార్య ఒప్పుకోదు. ఎందుకు ఒప్పుకోదు? అని అడగబోకు. అంతే, ఆవిడ మటుకు ఒప్పుకోదు.

ఎందుచేతనూ అంటే, సుందరమ్మ చక్కనిపిల్ల అని నీవు అనుకోవటం మీ ఆవిడకు ఇష్టంలేదు. సుందరమ్మంటే, సుందరమ్మ అనే కాదు. రాజమ్మ, సీతమ్మ, కనకమ్మ, లక్ష్మమ్మ ఎవరైనాసరే అందమైనది అని ఒప్పుకోదు.

...ందరమ్మ చక్కనిది అని అంగీకరిస్తే తాను అంతకంటే తక్కు... ...ని అంగీకరించినట్లేగా? నేను చక్కనిదాన్ని గాను - అని ఏ ఆడది ...అయినా అంటుందా? లోకంలో లేని సంగతి అది.

... ... మరియొకణ్ణి. వాడు ఎంత గొప్పవాడు అయినాసరే, కవిగా ...అంగీకరించడు. ఒక గాయకుడు మరొక గాయకుణ్ణి మెచ్చుకోడు. ... చిత్రకారుడు మరొక చిత్రకారుని రచనలను చూచి సంతో... ... తల ఊపడు. మరి ఇంకేం: అల్లాంటప్పుడు నీ భార్య మరొక ... ...ందమ్ముగల దానినిగా ఎలాగ అంగీకరిస్తుంది?

...ట్టి మీ ఆవిడ సుందరమ్మ చక్కనిదీ అని ఒప్పుకోదు. సీతమ్మ ...క్కనిదీ అని ఒప్పుకోదు. అసలు మీరున్న ప్రదేశానికి యాభై ...మైళ్ళు అటూ, ఇటూ ఉన్న దేశంలో తన అంతటి చక్కనిది ... ఆ పిల్ల అనుకొని, నిన్నుకూడా అనుకోమంటుంది.

... ...నే చక్కనిదానినిగా భావించాలె ఇంకొకరి చక్కదనాన్ని ...ంచకూడదు. ఇంకొకరిని కన్నెత్తి చూడారాదు. తన చక్క... ... చూడాలి తననే నమ్ముకోవాలె. లోకంలోని సౌందర్యం ... ఆమెలోనే ఉందని నీవు అనుకోవాలె.

...న్ని ఉద్దేశాలు కడుపులో కదులుతూ ఉంటవి కాబట్టే ఆ అమ్మాయి ...ందరమ్మ చక్కనిది అని ఒప్పుకో లేదు.

# 20

...సంగతి ఏమీ పట్టించుకోరమ్మా ఆయన. ఆయనకు ఏమీ తెలి... ... అంటూ ఉంటుంది మీ ఆవిడ.

...అంటున్నదని నీవు కోపం తెచ్చుకోకు. స్త్రీకి ఇదొక సహజ ... తన భర్త ఏమీ తెలియని అమాయకుడని, తాను కాంగా ... ...పురం చేయగలుగు తున్నది గాని ఇంకొకరు చేయ... ...నుకొనటము, అలాగ చెప్పటమూ ఆమెకు ఇష్టం. కుటుంబ

నిర్వహణకు సంబంధించిన మధురభారం అంతా తానొక్కతే మోస్తున్నానని అనుకోవటం ఆమెకు ఇష్టం. అదొక తియ్యని తలంపు. అది స్త్రీ స్వభావ మని తెలుసుకో.

## 21

ఆరదరి అయిన మనిషి మొగుణ్ణి సాధించకుండా ఉండదు. ఏదో ఒక అసంతృప్తిని మనస్సులో పెట్టుకొని అసలుమాట బైటపెట్టక గునుపుగా అనె మాటల సముదాయమును సాధింపు అంటారు.

మా ఆవిడ నన్ను ఎట్లా సాధించిందో చూడు. ఒక రోజున నేను ఇంటికి ఆలస్యంగా వచ్చిన కారణాన జరిగినకథ ఇది.

'ఏమండీ! ఇప్పుడా రావటం? బాగానే ఉంది. ఎప్పుడనగా వెళ్ళారండి? ఎక్కడ తిరుగుతున్నారండి ఇంత ప్రొద్దుపోయిన దాకా!

అయ్యో! అయ్యో! మనకో ఇల్లు ఉంది, పెళ్ళాం బిడ్డలూ ఉన్నారన్న సంగతి జ్ఞాపకమే రాలేదన్నమాట? ఎందుకు జ్ఞాపకము వస్తుంది లెండి!

ఏం! ఆలస్యంగా వస్తేనేం అనేగా మీరనటం? అవును మీకు అలాగే అనిపిస్తుంది. అనిపించ కేం చేస్తుంది! ఆపేక్ష లుంటేగా! ఇంత ప్రొద్దుపోయినదాకా ఇలా బైట తిరుగుతూఉంటే కొంపలో ఒక్కదాన్ని ఎంత హడలి పోయానో మీకేం తెలుస్తుంది! అబ్బె, యెన్నాళ్లు చెప్పుకొంటే ఏం లాభం! మనిషికి గ్రహింపు లేక పోయిన తరువాత!

ఇదెక్కడి మనిషి అమ్మా! కాకపోయినా, కాస్త దయాదాక్షిణ్యాలు లేకపోయిన తరువాత ఎందుకూ అంటా!

పాపం, ఇంటివగ్గర ఆడ సన్యాసి ఒక్కతేఉంది, కాస్త పెందలాడే కొంపకు చేరుకుందాం - అని తోచలేదు కామాలు ఆ మనిషికి!

ఇంటిదగ్గరవాళ్ళు ఎంత ఏడిస్తే ఏం? తమరుమటుకు హాయిగా
ఏ స్నేహితుని ఇంటనో కూర్చుని కబుర్లు చెప్పుకొని వస్తారు.
ఇంటిదగ్గర ఆడది ఒంటరిగా బిక్కు-బిక్కు మంటూ కూర్చున్నపుడు
స్నేహితులతో నవ్వుతూ, ప్రేలుతూ ఉండటానికి ఎట్లా మనస్సు
ఒప్పుతుందో! దొంగలు వస్తారేమో, ఇల్లుదోచుకు పోతారేమోనన్న
దిగులు ఎందుకులేదూ అంట!

ఆ! అవునులెండి మీకు దిగులెందుకు ఉంటుంది? దొంగలు పడి
దోచుకెడితే మీదేంపోయింది? ఆ చంద్రహారం, నానుతాడూ, రెండూ
కూడా మా పుట్టింటివాళ్ళు చేయించినవే! ఈయనగారు చేయించినవి
ఏమీ కాదు. అయ్యో, అయ్యో ఈయన అంతమాత్రం కూడానా!
నేను తెలుసుకోలేక పోయినాను పిచ్చిదాన్ని! అంత ధైర్యంగా
ఎట్లా ఉన్నారో అనుకొనేదాన్ని: ఇదా సంగతి! పోతే దాని సొమ్మే
పోతుంది. ఏడిస్తే దానివాళ్ళే ఏడుస్తారు అనేగా ఆయనకు ధైర్యం!
నిమ్మాళంగా అంటారూ పైగా!

ఆ! వచ్చారు, రాత్రి పన్నెండు గంటలకు!

పన్నెండుకాలేదు, పదేగా అయింది అంటారూ! ఆ! ఇప్పుడు కాక
పోతే ఇంకా కాసేపటికి అవుతుంది: పన్నెండూ అవుతుంది, ఒంటి
గంటా అవుతుంది! కాక మానుతుందా ఏమిటి! అట్లాగే కూర్చుం
టుందా!

పన్నెండు కాలేదు, పన్నెండు కాలేదని ఒకటేమాట! పదిఅయితే
పన్నెండు అయినట్లుకాదా ఏమిటి? ఇంకా కావాలె కూడానూ!

ఇప్పటికైనా ఇల్లు కనపడ్డది. అందుకు సంతోషించాలె.

ఆద్దీ రాగులదాన్ని కాబట్టి యెక్కడి కక్కడికి సరి పెట్టుకొని సంతో
షిస్తుంటాను - ఇల్లు కనపడ్డదని!

ఆ! ఒకప్పుడు కనపడనే కనపడదు.

ఏంచేస్తాం? నోరు మూసుకొని ఊరుకోవలసిందేనా? ఇంకేమైనా
ఉందా!

నిద్ర వస్తున్నదీ, అబ్బ! అయ్యగారికి నిద్రవస్తున్నదట! ఊరంతా

బలాదూరు తిరిగివస్తే నిద్రరాక మానుతుందా! నిద్రేమిటి, ఏమైనా వస్తుంది.

ఇక పడుకోనియ్యి అని విసుక్కుంటారు పైగా! పడుకోండి యెవ రొద్దన్నారు!

గోల అంటారు! గోలటండీ!

అవును. నేను మాటాడితే గోలగానే ఉంటుంది మీకు. అంత గోల అయితే ఇక్కడికి ఎందుకొచ్చారు! ఎక్కడ అయినా పడుకోక పోయినారూ!

మీకేం అండి, కావలసినంతమంది స్నేహితులున్నారు: ఎక్కడ పడుకున్నా పడుకోవచ్చు.

నిద్ర పట్టదంటారూ. బాగానే పడుతుంది. పట్టకేం జేస్తుంది! అయినా ఇటువంటి మనుష్యులేముంది. ఎక్కడ బడితే అక్కడేపడి నిద్ర పోతారు. రైల్లో బెంచీలమీదపడి నిద్రపోయేవాళ్ళు, ఎక్కడ నిద్ర పోరూ! ఛీ, ఛీ. మనిషికీ. ఇక్కడ పడుకోవచ్చు. ఇక్కడ పడుకో కూడదు అని తెలియక పోయిన తరువాత!

మాట్లాడ రేమండీ?

ఎందుకు మాట్లాడుతారూ! నా నోరు బైటపడవద్దూ! అందరూ నేను నోరు పెట్టుకొని అరుస్తానని అనుకోవలెననేగా మీరు మాట్లాడకుండా ఊరుకోవటం! 'అయ్యో! ఎంత మంచివాడమ్మా ఆయన! పాపం. నోరెత్తడు. ఆవిడ అలాగ అరుస్తూ ఉన్నాకూడా' అని అనుకోవలె ననేగా ఈ మాట్లాడక పోవటం!

అబ్బ! ఎంత ఎత్తు ఎత్తారండి! ఎన్ని ఊహలున్నాయండి మీ కడుపులో! ఎన్ని ఊహలు లేకపోతే కవిత్వం కడతారు చెంపీ? నన్ను నలుగురి నోళ్ళలో పడేయటానికి ఎన్ని పనులు అయినా చేస్తారు మీరు. మీ యెత్తులు నాకు తెలుసు చెద్దురూ? సంగనాచిలాగ. బుంగ మూతి పెట్టంగానే సరా? ఎవరికి తెలియదు, మీ గడుసుతనము!

పాపం. - ఆయన మంచివాడు - నోట్లో నాలికలేదు. అని అందరూ అనుకోవలెననేగా ఈ టక్కరివేషం అంతా ! అవును. అవతల వాళ్ళ కేం తెలుస్తుంది. మీరు పెట్టేకోత? నిజమే కామాలు. ఈవిడే గడుసు మనిషి - అనుకొంటారు. అనుకోనీయండి. ఏం జేస్తాం ! అందరూ నానోరే నొక్కుతారు. మీకేం ? మీరు లోకానికి మంచి వారే అవుతారు !

ఎంత గడుసు మనిషో ? నెత్తిన నోరు పెట్టుకొని అరుస్తున్నా ఒక్క మాట అయినా మాట్లాడరు !

మిమ్మలనే ! మాట్లాడ రేమండీ! అరిచి అరిచి అదే ఊరుకొంటుంది గదా అనే మీ ఊహ! ఎంత కఠిన హృదయు లండీ! అయ్యో. పాపం అంటారేమో అనుకొంటా! ఆఁహ. ఎందు కంటారూ ! రాతి గుండె ఆయె!

ఏదీ. గుండెమీద చెయ్యివేసి చూడనియ్యండీ. "అబ్బ! ఎంత గట్టి గుండె అండీ! రాయి! పాషాణం!"

ఇలాగ ఆవిడ గంటలకొద్దీ సాధించినా. నేను నోరెత్తానేమో చూశావా! అది నీవు గమనించి గుర్తు ఉంచుకో వలసిన విషయం. ఇప్పుడు కాక పోయినా. ఎప్పుడో ఒకనాడు మీ ఆవిడ సాధిస్తుంది నిన్ను. దేవుడు మేలుచేస్తే ఇంతకంటే ఎక్కువగానే సాధించి సాగ దీస్తుంది. ఆవిడ యెంత కొట్టుకున్నా పెదవి విప్పి మాట్లాడకుండా ఉండాలనీ. తల దిండులో దూర్చి కళ్ళూ. చెవులూ మూసుకొని పడు కోవలెననీ గట్టిగా జ్ఞాపకం ఉంచుకో బాబూ!

## 22

భర్త ఏదో పనిమీద ఉన్నాడు. ఏదో వ్రాసుకొంటూ ఉన్నాడు ఇప్పుడు మనము మాట్లాడించరాదరు. మాట్లాడిస్తే కోపం వస్తుం దేమో అన్నజ్ఞానము సాధారణంగా ఏ ఆడదానికీ వుండదు.

వర్త కవి. ఏదో వ్రాసుకొంటున్నాడు. తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ఏదో మధురభావం అతని హృదయంలో సుళ్లు తిరుగుతూ ఉంది. బైట పడటంలేదు. నానా అవస్థా పడుతున్నా డాయన.

ఇంతలో వచ్చింది గృహిణి. 'ఏమండీ! పలకరే మండి!' అన్నది.

'ఎందుకూ?'

'పండుగకు ఏం చీరె కొంటారండి?'

'ఏదో ఒకటి కొంటాను. ఆ విషయం కొంచెంసేపు ఉన్నతరువాత మాట్లాడుకోవచ్చు. ఇప్పు డేం తొందర?' అన్నాడు.

ఆ అమ్మాయి తనభర్త ఏదో ఆలోచనలో ఉన్నాడని గ్రహించి అప్పటికి వెళ్ళిపోతే బాగుండేది. అట్లా వెళ్ళిపోక ఏమేమో మాట్లాడి. చివరకు ఆయన విసుక్కుంటే. సాధింపులోకి దిగి - 'ప్రేమలు లేక పోతేసరి! ప్రేమలుంటే ఇట్లా మాట్లాడుతారా ఏమిటి!' అని గుని సింది.

కవిగారికి ఒళ్లు మండిపోయి. ఇట్లా అన్నాడు: 'ఓదేవీ. ఓ చంచలాక్షీ. ధవళనయనా. విశాలనయనా. విశాలాక్షీ. కమలనయనా. నీరజాక్షీ. సారసనేత్రీ. చకిత ముగ్ధ మృగీతరళేక్షణా. నా ప్రాణహరీ. నీవు తొక్కినభూమి నాకు పవిత్రము. ఓ ప్రసన్నమందహాస సుందర వదనారవిందా. నీ కనుసన్న నాకు మీరరాని ఆజ్ఞ. ఓ సుందరీ. ముగ్ధ్రతపా. మధురవదన సరోజా. నీమీద ప్రేమతో చస్తున్నాను. నీవు ఏం చెయ్యమంటే అది చేస్తాను. సముద్రంలో దూకమన్నా దూకుతాను. బావిలో పడమంటే పడతాను. అయితే నన్ను ఒక్క అరగంట మాత్రము వ్రాసుకోనియ్యి' అన్నాడట.

నీ భార్య విన్నెప్పుడైనా వ్రాసుకోనీయకుండా విసికిస్తే ఇలాగ అనాలె. అందుకని పైనున్న నాలుగు వాక్యాలు కంఠతా వెయ్యి.

# 23

...విస్తారం మాట్లాడే మనిషి కాకపోతే మూగమొద్దు. ఏమీ ...మాట్లాడకు - అనబోకు. మాట్లాడక పోవటమూ మిత భాషిత్వమూ ... భార్యను పొందటము ఎన్ని జన్మల సుకృతానికి ఫలితమో! ...రు మాట్లాడటం నేర్పావా. ఇక కొండవీటిజలపాతంలాగ వచ్చే ...ఘోరణిని అరికట్టడం మానవ మాత్రుడికి సాధ్యంకాదు.

# 24

...ఆడవాళ్ళతో కూర్చుని పేకాట ఆడటం మంచిదే. ఏదో ...పము అవుతుంది. రెండోది. మనకు తెలియకుండా మనజేబు ...నుంచి వాళ్లు ఇదివరలో కాజేసిన డబ్బు మనం గెల్చుకోనూవచ్చు.

# 25

...ఖర్చులు తగ్గించుకోవలసిన అవసరాన్నిగూర్చి మీరు భార్యా ...తో కూర్చొని మాట్లాడుకొనేటప్పుడు నీవు ముందుగానే నీ సిగ ...లకూ, రైలు ప్రయాణాలకూ, పుస్తకాలకూ అయే ఖర్చులు ...తగ్గించుకొంటాను అను.

...అనుకుంటే, అదెట్లాగూ తప్పదు. ఆవిడ పౌడర్లకూ, స్నోలకూ, ...నూనెలకూ అయ్యే ఖర్చుల విషయమై ఎత్తినా ఏమీ లాభము ...దని జ్ఞాపకము ఉంచుకో.

ఇంట్లో నీదే పై చెయ్యి కావాలె అంటే ఒక ఉపాయం ఉంది. మీ ఆవిడ అభీష్టమేదో కనుక్కొని అదే నీ అభీష్టంగా స్వీకరించటం: ఒక ఉదాహరణ చెబితే బాగా తెలుస్తుంది.

మీ ఆవిడ అంటుంది : 'ఈ పండుగకు పాతిక రూపాయలుపెట్టి చీరకొనియ్యాలండీ' అని. అప్పుడు ఏం జెయ్యాలె నీవు ?

కొనిఇయ్యను, డబ్బులేదు - అంటివా, నీమాట సాగదు. ఆవిడ యెట్లాగూ కొంటుంది అప్పుచేసి అయినాసరే: ఆ అప్పు ఎప్పటికైనా నీవు తీర్చకా తప్పదు.

అందుకని ఏమి చెయ్యాలా అంటే, నీవే ఎక్కడైనా పాతిక రూపాయలు అప్పుతెచ్చి, అజ్ఞాపిస్తున్న గొంతుకతో దర్జాగా, 'ఏయ్: ఇదిగో చూడు, ఎప్పుడు చీర కొనుక్కోమన్నా ఏదో తక్కువరకం చీర కొంటూ వచ్చావు, పోనీ గదా అని ఊరుకొన్నా ! ఇహ ఊరుకోను. తెలిసిందా? పాతికరూపాయలు పెట్టి కాస్త మంచిది కొనుక్కో డబ్బు యింద ! కొనుక్కోకపోతే నాకు కోపం వస్తుంది. దాని తరువాత విచారపడ్డా లాభంలేదు' అను.

ఆ తరువాత మీ ఆవిడ చీర కొనుక్కొన్నా నీమాటవిని, నీకు విధేయురాలై కొనుక్కున్నదే అవుతుంది కాని, నిన్ను ఎదిరించి కొనుక్కున్నది కాదు.

'చచ్చినట్లు నా మాట విన్నది ! ఎవరికోసం వింటుంది ? పాతిక రూపాయలూ అవతలపారేసి చీర కొనుక్కో - అంటే నోరు ఎత్తకుండా కొనుక్కొని ఊరుకుంది. చెప్పినట్లు వినకపోతే యెరుగదూ!' అని నీవు దర్జాగా అనుకోవచ్చు. భార్యపైన అధికారం చెలాయించాలనేకాంక్ష ఈ విధంగా తృప్తి పొందినదీ అవుతుంది.

నీవు మీ ఆవిడతో అన్నమాటలు ప్రక్క భాగంలో అద్దెకు ఉన్న వాళ్ళకు వినపడేటట్లే అను. వాళ్ళు అనుకొంటారు. 'అబ్బో! ఈ అబ్బాయి అసాధ్యుడే. పెళ్ళాన్ని హడలు కొడతాడు' అని.

ఆ అమ్మాయికీ కీర్తి వస్తుంది. భర్తయెడల వినయ విధేయతలతో ప్రవర్తిస్తున్నదీ అని. వాళ్ళల్లోవాళ్లు అను కొంటారు. 'పాపం. మొగుడు ఎన్ని కేకలువేసినా ఆ పిల్ల నోరెత్త లేదమ్మోయ్!' అని. ఆ పిల్లా చెబుతుంది అందరితోనూ 'పాతిక యాభాయలు పడేసి చీర కొనుక్కోమని కోప్పడి వెళ్ళారు. ఆయనకు కోపంవస్తే అంతే వదినా! అలాగ కోప్పడుతుంటే ఏం జేసేదమ్మా! వచ్చినట్లు అయన చెప్పినట్లు చేశాను. భర్తమాట వినకపోవటము తప్పుకాదు వదినా!' ఇలాగ ఆమె తన సతీత్వాన్ని ప్రశంసించుకొంటుంది.

ఎన్నివిధాల లాభించిందో చూడు!

## 27

ఏదైనా వస్తువు కనపడకపోతే వెంటనే మీ ఆవిడను పిలిచి వెదికి ఇవ్వమనుసుగాని, నీవే వెదుక్కుంటూ కూర్చోకు. ఆవిడ అయితే ఇట్టే వెదికి ఇస్తుంది. సాధారణంగా పోయిన వస్తువు ఆడవాళ్ళకు కనపడ్డంత వేగంగా మొగవాళ్ళకు కనిపించదు.

ఒకరోజున నేను కళ్ళజోడు కనపడక వెదుక్కొని నానాఅవస్థ పడ్డాను.

నేను ఏదో వ్రాసుకొంటున్నాను. వ్రాసు కొనేప్పుడు జోడు అక్కర లేదు నాకు. బయటికి వెళ్లేటప్పుడు దూరం చూడటానికి జోడు కావాలె.

ఆ రోజు వ్రాసుకోవటం అయిపోయిన తరువాత బట్టలు వేసుకొని బయటకు వెళ్లుదామనుకొని ఇటు చూద్దును గదా, కళ్ళజోడు ఎక్కడున్నదో కనిపించలేదు.

మా ఆవిడ వంటయింట్లో ఎక్కడో పని చేసుకొంటున్నది. ఈ మాత్రము భాగ్యానికి పనివేళ, ఆమెను పిలవటం ఎందుకు? నేనే వెదుక్కుందాం - కనపడకపోతుందా! అను కొన్నాను.
అలాగ అనుకొని వెతికాను. పుస్తకాల వెనకాల, టేబిల్‌పైన, పరుపుక్రింద అన్నిచోట్లా వెదికాను. కనబడలేదు.
విసుగుపుట్టి చివరకు ఆవిడను కేక వేశాను. 'ఓయ్! ఒక్కసారి వద్దూ కళ్ళజోడు కనపడలేదు. వెతకలేక చస్తున్నాను!' అని.
వెంటనే వచ్చింది ఆవిడ. వచ్చినమనిషి నా వస్తువు యెక్కడుందో వెదకి యియ్యక, నడుముమీద చేతులుఆనించి, విలాసమైన ఒక నృత్యభంగిమలో నుంచుని, విరగబడి నవ్వటం సాగించింది. ఆ నవ్వుకు అంతూలేదు, పొంతూలేదు. ఒకటే నవ్వటం!
నాకు ఒళ్లు మండుకొచ్చింది. 'ఏమి టా నవ్వటం!' ఎందుకూ ఆ నవ్వు! కళ్ళజోడు కనబడక చస్తుంటే!' అన్నాను.
ఆవిడ నవ్వు ఆపకుండానే అన్నది 'ఇంత తెలివి తక్కువతనం అయితే ఎట్లాగండీ! ఎలాగ మిమ్ములను పెట్టుకొని కాపురం చెయ్యటం! అదేమిటండీ, జోడు చేతులోనే ఉందిగా!'
పెధవది చేతులోనే ఉంది. కళ్ళజోడు గుప్పెట్లో పెట్టుకొని దాని కోసం ఇల్లంతా వెతికాను! ముందుగానే ఆవిడను పిలిస్తే ఇంత అవస్థ లేకపొయ్యేది.
అందుకనే నేను ఇంతగా చెబుతున్నాను. ఏదైనా వస్తువు కను పించకపోతే, చటుక్కున మీ ఆవిడను పిలిచి వెదకి ఇయ్యమను.

# 28

ఎప్పుడైనా మీ ఆవిడ నవ్వులాటకు నీ మీద ఒక విసురు విసరినా నీవు నవ్వి ఊరుకొనటం నేర్చుకోవాలె.
మా పసిదానికి ఉబ్బసం వచ్చింది. ఎన్ని మందులు ఇచ్చినా నయం కాలేదు. గాడిదపాలు పోస్తే ఆ జబ్బు నయం అవుతుందని ఎవరో

చెప్పాడు. సరే వెంటనే తెప్పించి పోయమని నేను మా ఆవిడతో చెప్పి వెళ్ళిపోయినాను.

సాయంత్రం ఇంటికివచ్చి 'ఏం। గాడిదపాలు తెప్పించి పిల్లకు పోశావా?' అని అడిగాను.

ఆవిడ తెల్లపోయి నావంక జూచి, 'అయ్యో! నన్ను తగలెయ్య! నాకు గాడిదమాటే జ్ఞాపకంలేదు. మిమ్మలను చూస్తే ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది' అన్నది.

'నీవు అన్నమాటకు అర్థం ఎందాకా పోయిందో నీవు ఏమన్నా గ్రహించావా?' అని నిలువదీసి అడిగి పోట్లాట వేసుకోవచ్చు. కాని, ఛీ: ఆడదానితో ఎందుకని నవ్వుకొని ఊరు కొన్నాను.

మీ ఆవిడ ఎప్పుడైనా తెలిసో, తెలియకో ఏమన్నా నవ్వుతాలకు అన్నా నీవు నవ్విఊరుకోవాలె. తెలిసిందా, బాబూ।

## 29

ఎటువంటు కష్టాన్ని అయినా నవ్వేసే శక్తిని అలవర్చుకో. అంద వికారి అయినా భార్య లభిస్తే ఏడిస్తే ఏం లాభం। నవ్వేసి ఊరుకో। ఈ కథ విను :

ఒక మిత్రుడు ఒక స్త్రీతో నాకు వీధిలో కనిపించాడు. ఆమె నల్లగా ఉన్నది. కళ్ళు చీకికళ్ళు. ఒక కంట్లో పువ్వేసి వుంది. తలపైన కొంత భాగంలో జుట్టు ఊడిపోయి ఉన్నది. ఆవిడ ఎవరో అను కొన్నాను. అనుకొని వాణ్ణి పిలిచి, 'ఎవర్రా ఆ అందకత్తె?' అన్నాను వెకిలిగా నవ్వుతూ.

వాడు నవ్వుతూ, 'ఆ పిల్లేనా? నా భార్య' అన్నాడు. నేను నాలిక కొరుక్కొని 'క్షమించరా బాబూ। పొరపాటు చేశాను' అన్నాను.

వాడు మరీ నవ్వుతూ, 'నీవేమీ విచారపడకు. పొరపాటుపని చేసింది నేను' అన్నాడు పెద్దగా.

'పెద్దగా అనకురా ఆవిడ వింటుంది' అన్నాను. ఆ మాట మీద 'మరేమీ భయంలేదు. నీవుకూడా పెద్దగా మాట్లాడవచ్చు. ఆవిడకు పుట్టెడు చెముడు' అన్నాడు. 'మీ దాంపత్యం ఎట్లాగుంది బాబూ?' అంటే, 'ఓ చాలా సౌఖ్యంగా ఉంది' అన్నాడు.

నవ్వేశక్తి వుంటే ఏ విషయాన్ని అయినా నవ్వివేయవచ్చు. అనివార్యంగా వచ్చిన కష్టాలనుగురించి ఏడుస్తూ కూర్చునేకంటే, ఇలాగ నవ్వేయటం మంచిదికదూ !

# 30

ప్రబంధనాయకి ప్రణయకలహం పట్టడమూ ఆ సరదాలూ అవీ చదివి. ఆ విధంగానే మీ ఆవిడచేత ప్రణయకలహం పట్టించాలని యెప్పుడూ ప్రయత్నించబోకు.

ప్రణయకలహం అంటే ఏమను కొన్నావు? ఓరి బాబో, అది కలహంకాదు. ప్రణయకలహం పట్టాలే అంటే ఒక సత్యనారాయ.. వ్రతం చేసినంత పని జరగాలె.

ప్రణయకలహ విధానంలో. ముందు ప్రియురాలికి కోపం తెప్పించాలి. మామూలురకం కోపం అయితే తెప్పించవలసిన అవసరమే ఉండదు. కాని ఈ ప్రణయ కలహానికి సంబంధించిన శాస్త్రయుక్తమైన కోపం తెప్పించాలంటే. చాలా గొడవ జరగాలె.

ఈ ప్రణయకోపం లఘువు. మధ్యమము. గురువు అని మూడు రకాలు. అన్యస్త్రీ దర్శనాదులవలన పట్టినదీ, స్వల్ప ప్రయత్నముచే తొలగునదీ లఘుకోపము. గోత్రస్ఖలనాదుల వలన కలిగినదీ, కష్ట ప్రయత్నముచే తొలగునదీ మధ్యమ కోపము. పరస్త్రీ సంగమము వలన కలిగినదీ, కష్టతర ప్రయత్నముచే తొలగింపబడునదీ గురు కోపము.

ఈ మూడింటిలో గురుకోపం సంగతి వదిలేద్దాం. దానితో చాలా చావు ఉంది. పరస్త్రీ సంగమము ఎట్లా సాధ్యపడుతుందీ? అదీకాక ఆ కోపం పోగొట్టాలి అంటే భార్యకు నూతనవస్త్ర భూషణాదులు సమర్పించుకోవటమే కాకుండా ఆమెగారి చరణప్రహరణములకు కూడా సిద్ధపడాలె. ఎందుకొచ్చిన అవస్థ అదంతా! అది వదిలేద్దాం.

పోతే. మధ్యమకోపం తెప్పించాలంటే గోత్రస్ఖలనము చేయాలె. అంటే. భార్య యెదుట ప్రియురాలి పేరుగాని, సవతి పేరుగాని ఉచ్చరించాలె. ఇదికూడా కష్టమే. ఇంకోభార్య ఉంటేగదా సవతిపేరు పలకటం సాధ్యపడేది! మన కుటుంబాలలో బహుభార్యాత్వము ఎక్కడుంది? పూర్వపు రాజులంటే ఒక్కొక్కడికి ఏడుగురో, యెనమండుగురో భార్యలు ఉండేవారు. కాబట్టి అది సాధ్యమైంది. ఒక్క పెళ్ళాంతో దేవులాడుతున్న మనబోటివాళ్ళకు గోత్రస్ఖలన విధానము ఆచరణయోగ్యం కాదు.

పోనీ. ప్రియురాలిపేరు ఉచ్చరిద్దామా అంటే ప్రియురాలు ఎక్కడేడ్చింది మనకు? ఏదో పేరుచెప్పినా మీ ఆవిడ నమ్మదు. 'చాల్లెండి. మీ ముఖానికి ప్రియురాలుకూడానా!' అంటుంది.

ఇక చెపొచ్చే లఘుకోపం తెప్పించాలె. ఎట్లాగో అవస్థపడి ఆ కోపం తెప్పిస్తాననుకో-తెప్పించగానే అయిందీ? దానితరువాత లక్షగ్రంథం జరగాలె.

మీ ఆవిడ ఈ కోపాన్ని తెప్పించుకొని విరహాన్ని పొందాలె. నేనూ ఒకసారి మా ఆవిడచేత ప్రణయకలహం పట్టిద్దామని ప్రయత్నం చేసాను. కాని లాభంలేకపోయింది. ఎందుకంటే ప్రణయకోపం పట్టినతరువాత నాయిక విరహవేదన పొందాలె. మా ఆవిడ స్వాధీన పతిక కాబట్టి యెంత ప్రయత్నించినా విరహము కలుగలేదు.

పోనీ. విరహము పుడుతుందయ్యా మీఆవిడకు. దానితరువాత శాస్త్రయుక్తంగా ప్రణయకలహం నడపవలెను అంటే చంద్రదూషణ జరగవలె. ఆమెకు శైత్యోపచారాలు జరగవలె. గంధం పూసుకో

వాలె. పూలపాన్పుపైన పడుకోవాలె. అప్పటికీ ఆ వేదన తగ్గదు. అప్పుడు ఆమె మెడలోని హారాలు తెంపివోయాలె. ఇంతవుంది వ్యవహారం.

తెంపివోయటానికి మీ ఆవిడ మెడలో ముత్యాలహారా లున్నాయా ఏమన్నానా! ఉన్న ఆ ఒక్క గొలుసు మాటిమాటికి తెంపి పోస్తుంటే యెట్లా!

అంతటితో అయిందీ!

ఆమెకు కోపంవచ్చినతరువాత కోపగృహంలో హంసతూలికాతల్పం పైన పడుకోవాలె కణతలకు కస్తూరి పట్టువేసుకొని!

కస్తూరిలేకపోతే శొంఠిగంధం వేసుకొంటుంది. హంసతూలికాతల్పం లేకపోతే పోనీ, నులకమంచంపైనే పడుకొంటుంది. ఇవన్నీ యెలాగో సరిపెట్టుకొన్నా అసలు కోపగృహం ఏదీ!

అసలు సొంతకొంపఅంటూలేక అద్దెకొంపలో దేవుళ్ళాడుతున్నాము గదా. కోపగృహం ఎక్కడనుంచి వస్తుంది? పోనీ వంటయింట్లోనే నులకకుక్కిలోనో. లేకపోతే పమిటిచెంగు పరచుకొని నేలపైనో పడుకొంటుంది అనుకొందాం,

ప్రణయకలహం పట్టిన నాయికకు చెలికత్తెలుండాలె. తన విరహ బాధ అంతా వాళ్ళతో చెప్పుకోవాలె. ఇదొక పెద్ద ఇబ్బందే, పని చేసేదానినే కాసేపు చెలికత్తెగా ఉండవే, ప్రణయకలహం జరుపు తాము-అందాము అంటే అది యెంతఅదుగుతుందో కర్మం!

దాని తరువాత ఆవిడ పది మన్మథావస్థలు పొందాలె. చూచుట, సంకల్పము, జాగరము, కృశత, అరతి, లజ్జా, త్యాగము, ఉన్మాదము మొదలైన అవస్థలను ఆమె క్రమముగా పొందాలె.

మీ ఆవిడ ఇవన్నీ జరుపుతూ కూర్చుంటే అప్పికి అంట్లు ఎవరు వేస్తారు? పిల్లలకు చద్దిఅన్నాలు ఎవరు పెడతారు?

ఈ అవస్థలన్నీ పొందిన తరువాత నాయకుని ఆగమనమూ, అతడు ఆమెను దూతికలచే ప్రసన్నురాలిని చేసుకొనడమూ జరగాలె.

దూతిక యెక్కడనుంచి వస్తుంది?

అయితే సూత్రకారుడే చెప్పినాడు వటి, దాది, దాసి, పొరుగుఇంటి ఆవిడ, ఇంటిలోని చిన్నపిల్ల, చాకలిది, తాంబూలిక స్త్రీ, గాంధిక స్త్రీ, పాచక స్త్రీ, గాయక స్త్రీ మొదలైనవారు దూతికలుగా పనికి వస్తారని.

మన కొంపల్లో వీళ్ళంతా ఏరీ!

మనకూ పనిమనిషి, పాచకస్త్రీ, ప్రియురాలు ఒక్కరే ఆయెను.

పోనీ, చాకలిదాన్ని రమ్మందాము ఆ రోజుకు!

దాని ధర్మాన అదివచ్చి దూత్యము నడిపితే, ఆమె నీకు ప్రసన్నురాలు అవుతుంది. దానితరువాత ద్వారగమనము, శయ్యారచన - ఏవో ఇలాంటివి జరగాలె.

ఇవన్నీ జరుపుతూ ఉంటే, అన్నం వండిపెట్టే దెవరు? పిల్లలను చూచే దెవరు?

ఇదంతా జరిగితే, ఈ పూర్వరాగ విప్రలంభ శృంగారము ఏ ముద్దు లోనో పర్యవసించటం జరుగుతుంది. ఎందుకొచ్చిన అవస్థ ఇదంతా! నీవు ఆమెను ముద్దెట్టుకొంటానంటే వద్దంటుందా ఏమన్నానా!

అట్టి బాబూ! ప్రణయకలహంమాట తలపెట్టకు. నాటుకలహాలు ఎల్లాగూ ఉండనే ఉన్నవిగా!

# 31

భార్య గయ్యాళి అయినపుడు కాస్త వేదాంతధోరణి అలవర్చుకోవటం మంచిది. సోక్రటీసు కథ తెలుసునా!

సోక్రటీసు గ్రీసుదేశంలో ఉండేవాడు. గొప్ప వేదాంతి. ఆయన ఎంతో శాంతంగా ఉండేవాడు. ఆయన భార్య కోపదారి, గయ్యాళి.

ఒకరోజున ఆమెకు భర్తపైన పట్టరాని కోపంవచ్చింది. భర్తను ఇష్టమువచ్చినట్లు తిట్టిపోసింది. సోక్రటీసుమాత్రం బెల్లంకొట్టిన రాయిలాగ, తనను కాదన్నట్లు అరుగుమీద కూర్చొని. దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

చివరకు ఆమె. మాటలవల్ల లాభంలేదని కాబోలు, బిందెడు నీళ్ళు తెచ్చి ఆయనమీద పోసి కసితీర్చుకొన్నది.

ఇది చూచి వీధిన వెళ్ళేవాళ్ళంతా పకపకా నవ్వారు. సోక్రటీసుకూడా వారితోపాటు నవ్వి 'దీంట్లో ఏమీ ఆశ్చర్యం లేదే! ఉరుములూ. మెరుపులూ అట్టహాసంగా వచ్చిన తరువాత వాన పడటంలో వింత ఏమీలేదు! అన్నాడు.

అంత శాంతము ఉంటే, ఎంత గయ్యాళి అయితేమటుకు ఏంజేయ గలదు.

# 32

భార్యతో అసలు అబద్ధాలు చెప్పవద్దు అనే నా హితోపదేశం. ఒకవేళ చెప్పినా చాలా జాగ్రత్తగా చెప్పు. ఈ సంభాషణవలన నేర్చుకోదగిన నీతి నేర్చుకో.

"ఇంత ప్రొద్దుపోయిందాకా ఏం చేస్తున్నారండీ బజారులో?"

"బజారులో కాదు. కృష్ణాపత్రికాఆఫీసులో నేను ఉన్నది."

"ఏం జేస్తున్నారు?"

"మాట్లాడుతున్నాను."

"ఏం మాట్లాడుకున్నారండీ?"

"అనేక విషయాలు. సాంఘిక, రాజకీయ. సాంసారిక. ఆర్థిక విషయాలు!"

‘‘నానాంటు ఏమిటో పల్లిస్తారు. ఇంతకూ అరటియాకులు తెచ్చారా?’’

‘‘మరచిపోయాను.’’

‘‘పచ్చిమిరపకాయలూ?’’

‘‘అరటిఆకులకోసం వెడితే పచ్చిమెరపకాయల సంగతి జ్ఞాపకం వస్తుంది? అరటాకులకోసమే వెళ్ళక పోతిని. పచ్చిమెరపకాయలసంగతి ఎట్లా జ్ఞాపకంవస్తుంది?’’

‘‘అయితే అదీ మరచిపోయారన్నమాట? పోనీ మైసూరుసబ్బన్నా తెచ్చారా?’’

‘‘లేదు.’’

‘‘ఏమ్. యెందుకు తీసుకురాలేదూ?’’

‘‘అసలు తీసుకురావల్చుకోలేదు.’’

‘‘ఎందుకు తీసుకొని రాదల్చుకోలేదు. ఆ సంగతి కాస్త చెప్పండి వింటాను.’’

‘‘ఎందుకు తీసుకురాదల్చుకోలేదంటే అసలు తీసుకొని రాదల్చుకొన్నట్టయితే. యెట్లాగూ మరచిపోయేవాణ్ణి? దానినికూడా మరచిపోయినాను - అని కారణం చెప్పవలసివచ్చేది? అప్పుడేమైంది? అన్నిటికి ఒకే కారణం చెప్పినట్లు అయ్యేది? వెధవది ప్రతిదానికి ఒకే కారణం చెప్పటం నా దర్జాకూ. నా గౌరవానికి తగదని తోచి. అసలు కారణం అంటూ చెప్పవలసిన అవసరమే లేకుండా చేసికొనటానికీ, నాకూ. నీకూ మధ్యవుండే భక్తి. ప్రతిపత్తులకు ఎట్టి విఘాతమూ కించిత్ కూడా కలుగకుండా ఉండేందుకూ. ఆ భక్తి యథాతథంలో ఉండిపోయేందుకూ అల్లా చేశాను. అంటే ఆ వస్తువు అసలు తీసుకురాదల్చుకో లేదని చెప్పాలని అనుకొన్నాను.

‘‘నిజంచెప్పే మనిషి ఈయన’’ అని మా ఆవిడ అనుకోవాలెననే నేను ఇంత ఆలోచన చేశాను. నీవు ఈ విషయం గుర్తు ఉంచుకొని. నీ వాక్కుతోకూడా తెలివిగా ప్రవర్తించు. ‘చచ్చినా నా నోటివెంట అబద్ధం అనేది రాదు’ అంటూ ఉండు.

రంగులేనంత మాత్రాన మీ ఆవిడ చక్కనిది కాదు అని అనుకో బోకు. చక్కదనము అనేది ఒక్క రంగులోనే లేదు. ముక్కు ముఖమూ తీరులో, రూపులో, రేఖలో, వంపుల్లో - ఎన్నిటిలోనో ఉంది.

ఒక్కొక్కపిల్ల మనోహరమైన చిరునవ్వు చాలు - నీ జీవితాని కెంతో సంతోషాన్ని ఇయ్యటానికి।

ఒక్కొక్కరికి కేశసంపద రమణీయంగా ఉంటుంది. సుదీర్ఘమైన సుస్నిగ్ధమైన ఆ కేశసంపదను చూచి ఆనందిస్తూ కాలం గడిపి వేయవచ్చు.

ఒక్కొక్కరికి ఏ అందమూ లేకపోయినా అందమైన కళ్లు ఉంటవి. ఆ నేత్ర సౌందర్యాన్ని చూచి ఈ జన్మకు ఇది చాలు, అని అనుకో బాబూ:

ఒక్కొక్కపిల్ల మాట్లాడుతుంటే కిన్నెరలూ, అప్సరసలూ పాడు తున్నట్లు ఉంటుంది. ఆ మధురభాషణను విని ఆనందించు.
మనిషిలో సౌందర్యసీమలు చాలా ఉన్నవి. ఏదో ఒక సౌందర్యము, ఒక వింతలావణ్యము, తృప్తిని ఇచ్చే ఒక వాల్చూపు ఇందులో ఏ ఒక్కటి ఉన్నా చాలునయ్యా నీ జన్మకు. రంగే కావాలని గోల పెట్టకు.

ఒక్కొక్కపిల్ల సిగ్గుపడ్డప్పుడూ యెంత మనోహరంగా ఉంటుంది। ఆ సుందరి ముగ్ధత్రపా మధురవదనసరోజాన్ని చూచి, నిలుచున్న వాడవు నిలుచున్నట్లు ముగ్ధుడవై పోతావు. నిన్ను జన్మంతా అల్లాగే నిలవేసి ఉంచగలశక్తి, ఆ సౌందర్యంలో ఉంది. ఆ సంగతి గ్రహించు.

నీ గృహిణి ఒక్క విలాసాపాంగమును నీపై ప్రసరింప చేసినపుడు నీ ప్రాణమార్గమున అమృతము వర్షించినట్లై. నీ తనువుపై పులకలు ఉదయిస్తవి.

పాము కుబుసములాంటి తెల్లని సన్నని చీరగట్టి ఆనాడు మీ ఆవిడ నిలుచుకుంటున్నప్పుడు, శరజ్జ్యోత్స్న తరంగంవలె ఉందని నీ వనుకోలేదా? అదృశ్యాన్ని నీవు మరచిపోగలవా?

యౌవనంలో ఉన్న మీ ఆవిడ శరీరంపై నున్న నిగనిగలను, మిస మిసలను చూచి ఆనందించి, గుండెపై చేయివేసుకొని, కళ్లుమూసు కొని, ఆ భగవంతుడికి కృతజ్ఞతతో నమస్కరించవయ్యా బాబూ!

# 34

గార్హస్థ్యజీవిత సౌభాగ్యమును ఎరుగనివాడు, ఈ మానవ జీవిత సౌభాగ్యాన్నే యెరుగడనవచ్చును

ఆ జీవితములోని కష్టసుఖాలను అనుభవించినవాడే జీవితానంతర - ఆనందమయ జీవితానికి అర్హత సంపాదించినవాడు అవుతాడు.

పరిపూర్ణయౌవనంలోకి కాలుపెట్టి సంసార సౌందర్యమాధుర్యాలను అనుభవించలేకపోయిన స్త్రీ యెండినమోడు. సతీధర్మాన్ని నిర్వహించలేని ఆ స్త్రీయే కాదు. ఆమె బ్రతుకు బ్రతుకే కాదు.

# 35

గార్హస్థ్యజీవితంలో అందము చూడలేనివాడు ఈ సృష్టి సౌంద ర్యాన్ని ఏమి గ్రహించగలడు?

సర్వాభరణ శోభితయై తెల్లనిచీర కట్టుకొని ఆమె నీ ముందు నిల బడితే చూచి ఆనందముతో పరవశతను పొందలేని వాడవు నవ మల్లికాకుసుమ సౌభాగ్యమును చూచి ఏమి ఆనందింప గలవు?

మొగలిపూలవలె స్నిగ్ధములై వెన్నెలవలె తెల్లనైన ఆమె కపో లాలను జూచి సంతోషించ లేనివాడవు. వసంతసమయ సాయం వికసిత మల్లికాప్రసూన మృదుపత్రసౌందర్యమును జూచి సంతో షించ గలవా?

నీ బిడ్డ చిట్టిచేతులను బుగ్గలకు తాకించుకొని, ఆ మృదుత్వమునకు మురిసిపోలేక పోయినవాడవు శిరీష కుసుమకోమలత్వాన్ని గ్రహించ గలవా?

వచ్చీరాని నీ బిడ్డ ముద్దుపలుకులలో ఉండే స్వరమాధుర్యాన్ని, శ్రవణ సుఖాన్ని గ్రహించి ఆనందముతో గంతులు వేయాలిసిందిపోయి, మధుమాసవేళా మాకంద తరుశాఖికాకోకిలా ప్రథమ కూజిత మనో హరత్వాన్నిగురించి గేయాలు వ్రాస్తావూ? పిచ్చివాడా!

# 36

నీవు భోజన విషయంలో కాస్త అశ్రద్ధ చూపుతున్నట్లు తోస్తే, నీ భార్య ఎంత హడలిపోతుందో, ఆమె హృదయంలో ఎంత ప్రేమ ఉన్నదో గుర్తించు.

నా భార్య ఏం చేసిందో తెలుసునా? నేను భోజనం చేస్తూ వుంటే ఎదురుగా కూర్చున్నది. సంభాషణ ఇల్లా జరిగింది:

"అదేమిటండీ, ఒక్క దాంతోనూ తినరేం? అయ్యో కర్మమా! ప్రతీదీ, 'ఇది నా కొద్దు, ఇది నా కొద్దు,' అంటే ఎలాగండీ? మీకు ఏది ఇష్టమో కాస్త చెప్పండీ, అదే చేస్తాను."

"నాకు నీవు చేసిన వస్తువులు బాగానే ఉన్నవి. బాగానే తింటున్నాను. ఇంతకంటే ఏమి తినేది?"

"అదేమి తినటమండీ, నా ముఖం తినడం? ఈ వయస్సులోనే ఇంత తిండి తగ్గిస్తే బలం ఎట్లా వస్తుంది చెప్పండి?"

"నేను ఇంతకంటే ఎక్కువ తినలేను. తినను."

"తినకపోతే నేను ఊరుకోను."

"ఊరుకోక ఏం జేస్తావు?"

"ఏం చేస్తానా? మీరు చిన్నతనంలో నా చెవులు చాలా సార్లు సాగ దీశారు. మీరు సరిగ్గా భోజనం చెయ్యకపోతే, నేను మీ చెవులు సాగ దీస్తాను."

నీవు సరిగ్గా భోజనం చెయ్యకపోతే తహతహలాడేది తల్లి. తల్లి తరువాత భార్య. ఆ సంగతి జ్ఞాపకవుంచుకో.

## 37

పుత్రుడయినవాడు కాస్త హాస్యదృష్టి అలవరచుకొనటం చాలా మంచిది. అట్టి దృష్టే ఉంటే, పెద్ద పోట్లాట కావలసిన విషయం ఇట్టే తేలిపోతుంది.

ఒకసారి నేను ఏదో విషయమై తగాదా పెట్టుకొని ఆవిడను సాధిస్తున్నాను. ఆవిడా ఊరుకో లేదు. మాటకుమాట అంటూనే ఉన్నది. ఆ పోట్లాటకు అంతు కనిపించలేదు.

చాలా సేపు అయిన తరువాత ఆవిడకు విసుగెత్తి. "ఇక చాల్లెండి. ఊరుకోండి. టైము ఎంత అయిందో చూడండి" అన్నది ఆశ్చర్యాన్ని ప్రకటించే చూపులు చూస్తూ.

నేను ఇంకా కోపంగానే ఉండి. "నా దగ్గర గడియారం లేదు" అన్నాను పెద్దగా!

ఆ మాటమీద ఆవిడ. "పోనీ గడియారం లేకపోతే మానె. మీ వెనకాల క్యాలెండరు ఉన్నది. అదైనా చూడండి" అన్నది.

నాకు నవ్వు వచ్చింది. అంతటితో ఆ వ్యవహారం ఆగిపోయింది.

ఇలాగ భార్యా భర్తలలో ఎవరో ఒకరు ఏదో నవ్వుపచ్చేమాట అన గలిగితే, మాంచి పటులో ఉన్న పోట్లాట కూడా గాలికి ఎగిరి పోతుంది.

ఒక రోజున నేను ఇంటికి ఆలస్యంగా వచ్చాను. ఆమెకు చాలా కోపం వచ్చింది. నేను వచ్చి మాట్లాడించినా పలక లేదు. ఏదో గొణుక్కుంటున్నది. 'ఏమిటి అంటున్నావు?' అని నేనంటే ఆవిడ కోపంతో వ్యంగ్యంగా అన్నది. "నేను ఏమంటే ఎందుకు లెండి! గడియారం ఏమంటుందో చూడండి "

"ఇప్పుడా రావటం? రాత్రి పదకొండు అయింది! గడియారం చూడండి?" అని అనటం అది.

ఆవిడకోపం వెంటనే తగ్గించకపోతే నేనే అన్నం పెట్టుకు తినటమే కాకుండా మంచం వీదినసారాలోకి జరుపుకోవాలె. ఎవరు పడతారు ఈ శ్రమ అంతా? కాస్త ఆలోచించుకొన్నాను.

నేను వెంటనే గడియారం దగ్గరకు వెళ్ళి, ఒక చెవి అటు త్రిప్పి, "ఇదిగో, చూడు కాంతం! గడియారం ఏమంటుందో వినమన్నావు. విన్నాను. టిక్, టిక్ మంటున్నది" అన్నాను.

ఆవిడ విరగబడి నవ్వింది.

అంతే!

కోపం అంతా మాయమై పోయింది. ఆ తరువాత ఆవిడ 'సరే రండి భోజనం చేద్దురుగాని' అన్నది.

"నేను రాను. నాకు ఆకలిగా లేదు" అన్నాను.

"ఎందుకు ఆకలి లేకపోవాలె? ఏమన్నా తిన్నారా?"

"ఏమీ తినలేదు. అయినా నా కొద్దు. నేను ఏమీ తినను. చూడూ కాంతం! నేను తిననంటే తినను. బ్రతిమిలాడినా తినను. నన్ను ఎత్తుకొనిపోయి విస్తరిముందు కూర్చోబెట్టినా తినను."

ఆవిడ నా సంగతి గ్రహించి నెట్టుకుంటూ వంటయింట్లోకి తీసికెళ్ళి ప్రతిరోజులాగే భోజనం పెట్టింది.

కాబట్టి నాయనా! కాస్త హాస్యం ఆడటం నేర్చుకో. బరువైన వ్యవహారం తేలికగా వెళ్ళిపోతుంది.

# 38

భార్యతో అబద్ధాలు ఆడినా నేర్పుగా ఆడటం నేర్చి ఉండాలి.

నీవు క్లబ్బులో స్నేహితులతో కలిసి చీట్లపేక ఆడుతూ కూర్చోటం ఆవిడకు ఏ మాత్రం ఇష్టం లేదు. ఆ కాసేపూ నాతోనే మాట్లాడుతూ కూర్చో. నీ మధురవాక్కు విని నేనూ ఆనందిస్తాను అంటుందన్న మాట. నిన్ను పెందలాడే ఇంటికి రమ్మనడములో గల తాత్పర్యము అదే.

నీవు ఆ సంగతి గ్రహించవు. నీ స్నేహితులతోనే కాలం గడుపుతావు. చెప్పినా నీవు వినలేదని ఆవిడకు కోపం.

అందుకని క్లబ్బుకు వెళ్ళాలని చెప్పక, ఇంకో కారణం చెప్పాలె.

అట్టి సమయాలలోనే అబద్ధాలు ఆడవలసిన అగత్యం కలుగుతున్నది. అయితే. అబద్ధాలు చెప్పేటప్పుడు జాగ్రత్త. స్వవచన వ్యాఘాతం లేకుండా చూచుకో. రోజూ ఒకే కారణం చెప్పకు.

ఇంటికి ఆలస్యంగా రావడాన్ని గురించి అబద్ధాలు అల్లేటప్పుడు తగిన కారణం చెప్పకుండా ఉండగలగడము కాస్త నేర్పుతో కూడిన విషయము. అదీ కాక నిన్నా మొన్నా ఏం చెప్పావో జ్ఞాపకం ఉంచుకోవడము కూడా కష్టమే.

అందుకని ఈ రోజున ఈ కారణం చెపుదామని వ్రాసి పెట్టుకొని ఉంచుకొనడము మంచిది.

మొదటిరోజు. ఆఫీసులో పని ఎక్కువగా ఉన్న కారణమున పెంద లాడే రావటానికి వీలులేకపోయిం దంటావు. బాగానే ఉంది.
రెండో రోజున. ఊళ్ళో గొప్ప సభ జరుగుతోంది. పెద్దనాయకుడు వచ్చి ఉపన్యాసం ఇస్తున్నాడు. నీవు వెళ్ళకుండా ఎట్లా: అందుకని తప్పక వెళ్ళవలసి వచ్చింది.
ఆ సభలో జరిగిన ఏదైనా ఒక తమాషాను గురించి ఒక కథ అల్లి పెట్టుకొని సిద్ధంగా ఉంచుకో. ఆ కథ చెప్పి ఆ పిల్లను నవ్వించ వచ్చు.
ఒక ఆయన ఉపన్యాసం ఇస్తున్నాడు. ప్రేక్షకులకు విసుగెత్తింది కొంచెం అల్లరి చేయసాగారు. ఒకడు కోడి కూసినట్లు కేక వేశాడు అంటే తెల్లవార వొచ్చింది. ఇక తమ ఉపన్యాసం ఆపండి బాబూ అని దాని అర్థం. ఈ విషయం ఉపన్యాసకుడు గ్రహించి తన జేబు గడియారంతీసి చూచుకొని. ఇప్పుడు ఎనిమిదే అయింది. కోడి కూసే వేళ కానే కాదు. అయినా ఈ విషయంలో పక్షులకు ఉన్నజ్ఞానం మనుష్యులకు ఉండదు కాబట్టి నేను ఉపన్యాసం చాలిస్తున్నానని ఆపి వేశాడు. అల్లాగ కోడికూత కూసినవాళ్ళని పక్షి అన్నాడన్నమాట.
ఇల్లాంటి కథలు సంపాదించి ఉంచుకొని వారానికి ఒకటి చొప్పున ఆవిడకు చెప్పు. నీవు నిజంగా సభకు వెళ్ళావనే అనుకొంటుంది.
మూడో రోజు. బిక్కముఖంతో ఇంటికి వచ్చి దారిలో సైకిల్ చెడ పోయిందనడము సమంజసమైన కారణం. వారానికి ఒక రోజునైనా సైకిల్ చెడిపోక తప్పదు.
నాలుగో రోజు. మంచి గట్టి కారణం చెప్పాలన్న సంగతి జ్ఞాపకం ఉంచుకో. ఆ రోజున ఎదురుదెబ్బ తగలాలి. లేకపోతే. నీ సైకిల్ ఎదుటి సైకిలుతో డాష్ కావాలె.
అప్పుడు కాలి బొటనవ్రేలుకు కట్టు గట్టుకొని వస్తే మంచి పకడ్‌గా ఉంటుంది. అలాగ వచ్చి కుంటుతూ లోపలికి అడుగు పెట్టాలె. అధమం రెండు రోజులన్నా కుంటుతూ ఉండటము మంచిది.
ఒకసారి నేను ఇలాగే చేశాను. కుడికాలు బొటనవ్రేలికి కట్టుగట్టాను. మా ఆవిడకు ఎందుకో అనుమానం కలిగింది. నేను మంచి నిద్రలో ఉన్న సమయంలో కట్టువిప్పి చూచి సంగతి గ్రహించింది. గ్రహిం

చింపి ఊరుకోక, ఆ కట్టు విప్పి ఎడమకాలు బొటనవ్రేలుకు కట్టింది. నేను ఈ విషయం గుర్తించక మామూలుగా కుంటుతూ నడిచాను. ఆ ఆవిడ విరగబడి నవ్వి "ఏమండీ! ప్రొద్దున కుడికాలుకు కట్టు గడితిరి. నిద్రలేచి ఎడమకాలుకు కట్టు గడితిరి! కుడికాలుకు తగిలిన దెబ్బ, ఎడమకాలుకు మారిందేమండీ" అని వెక్కిరించి చంపింది. నేను ఈ మార్పు గుర్తించకపోవడమువల్ల ఆమెకు అలుసు అయిపోయినాను. ఇటువంటివి వస్తవేమో చూచుకో.

అయిపోరోజున, నిజంగా గడ్డురోజే. ఏం జెపుతాము!

ఆలస్యంగా ఇంటికి వస్తే చెప్పతగిన కారణాలజాబితా అంటూ ఒకటి గుండే భర్తలకు ఎంత ఉపయోగము! ఇంతవరకు అటువంటిది లేదు. నేనే ఒక పుస్తకం వ్రాయా లనుకొంటున్నాను. ఆరోజున కారణం అంటూ ఏదీ చెప్పక ఆవిడను కబుర్లలోకి దింపి ఈ విషయము మరచిపోయేలాగున చేస్తే కొంతవరకు బ్రతికి బైట పడతాము.

ఓ తమాషాకథ చెప్పాలె. ఒకడు ఒక స్నేహితుడిదగ్గర గొడుగు ఒకటి తీసుకొని పాడుచేసి మళ్ళా ఇచ్చాడు. ఆయన నా గొడుగు తీసుకొని పాడుచేసి ఇచ్చాడని కోర్టులో చెప్పుకొన్నాడు." ఏమయ్యా: తీసుకొన్న గొడుగు ఎందుకు పాడుచేసి ఇచ్చావూ!" అంటే ఈయన ఇలా అన్నాడు—"అసలు నేను ఆ పెద్దమనిషిదగ్గర గొడుగు ఎరువు తెచ్చుకోలేదు. తెచ్చుకొన్నా ఆయన ఇచ్చినపుడు గొడుగు చినిగి పోయే ఉంది. అదీగాక నేను మంచి క్రొత్తగొడుగే ఇచ్చాను"— అన్నాడట.

ఇలాంటి కథ చెప్పి నవ్వించి ఊరుకోవాలె.

పోతే ఆరవరోజు ఉంది. ఆ రోజు ఏమవాలె? నేను ఏంజేశానో చెపుతాను. చేతనైతే నీవూ అపనే చెయ్యి.

నేను ఇట్లా అన్నాను. చూడు కాంతం! నేను ఇవ్వాళ ఆఫీసునుంచి యిూయకిని పరుగెత్తుకుంటూ వచ్చాను నీతో మాట్లాడుతూ సరదాగా కాలంగడపాలని! నేను కాస్త ముందుగా వచ్చాను. నేను వచ్చేసరికి తమరు ఇంట్లోలేరు. ఇల్లు తాళంవేసి వుంది. ఏంజేసేది? వీధి

అరుగుపైన ఎంతసేపు కూర్చోగలనని? అటు బజారు వెళ్ళాను. అమ్మగారికి పూలన్నా కొనుక్కొద్దామని!

ఇలా దబాయించి చూడవచ్చు. ఆఫీసును వదిలే టైముకంటే ముందుగా వచ్చాను - అని చెప్పడములో ఉంది ఈ దబాయింపు ప్రాణము. ఎందుకంటే. ముందుగా వస్తావని ఆమె అనుకోక ప్రక్కయింటికి పోయిఉంటుంది. పదింట తొమ్మిదిపాళ్ళు ఈ ఊహ సరియైనది అయి. 'అయ్యయ్యో! ఎంతపని అయిందండీ!మీరు ఇంత వేగిరం రారుగదా, ఇంకా ఆఫీసు అయిపోయేవేళ కాలేదుగదా _ అని అప్పుడే మంగమ్మ అత్తయ్యగారింటికి వెళ్ళానండీ! పాపం మీరు రాకరాక రావడమున్నూ, నేను ఆ సమయానికే లేకపోవడమున్నూ జరిగిందండీ!'' అని ఆ పిల్ల వెయ్యివిధాల నొచ్చుకొంటుంది.
అప్పుడు నీవు ''పోనీలే, వెళ్ళితే వెళ్ళావు. వెళ్ళకపోతే ఏమి తోస్తుందిలే! మరేమీ ఫరవాలేదు. నువ్వు ఏమీ ఇదిగాక'' అని సాంత్వవచనాలు పలికి. ఆమె తప్పుచేసినట్లూ, నీవు ఉదారబుద్ధితో క్షమించినట్లూ నటించవచ్చు.
అయితే ఆ అమ్మాయి. ''అదేమిటండీ నేను ఇంట్లోనే ఉన్నానండి'' అంటే. ఎలాగ?
అలాగ అంటే ''నీవు లేవు. తలుపు తాళంవేసి వుంది'' అని దబాయించకూడదు. అలా దబాయిస్తే నీవు అబద్ధం ఆడుతున్నటు ఆ పిల్లకు తెలిసిపోతుంది. అందుకని ''ఇంట్లోనే ఉన్నావా? సరి పిలిస్తే పలకలేదేం?'' అంటే చాలావరకు వ్యవహారం కమ్మకు పోతుంది. ఆ సమయానికి ఆ అమ్మాయి ఏదో పనిలోవుంది. నీ కేక వినకపోయి ఉండవచ్చు. అనే సమర్థన చాల సమంజసంగా కన బడుతుంది.
ఇక ఆదివారం సంగతి. ఆ రోజు అబద్ధం ఆడవలసిన అగత్యమే లేదు. ప్రొద్దుగూకులూ ఇంట్లోనే ఉంటావు. సాయంత్రం ఎట్లాగూ మీ ఇద్దరూ కలసి సినిమాకు వెడతారాయె!
ఇలాగ రోజుకో అబద్ధం ఆడుతూ రోజుకో కథ కల్పిస్తూ రమణీయమైన పద్ధతిలో దాంపత్యం నడపాలె. కాశీమజిలీల కథలలో నడపాలె. దాంపత్యజీవితం.

# ఈ పుస్తకం ఎందుకు?

భార్యాభర్తల మధ్య పోట్లాటలు ఎందుకు వస్తవి? వాటి స్వరూప స్వభావాలు ఏమిటి? అవి రాకుండా చేసుకోవడము ఎట్లా? అనివార్యంగా వస్తే ఏంజెయ్యాలె - ఇవీ ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకు సమాధానం ఎవ్వరూ ఇంతవరకూ చెప్పలేదు. చెప్పడముకూడా కష్టము. మహాఋషులూ ద్రష్టలూ అయినవారు ఎంతో మంది ఈవిషయమై ఆలోచించి తలలు బ్రద్దలుకొట్టుకొని తెలుసుకోలేక వదిలేసి ఊరుకొన్నారు.

అటువంటి క్లిష్టమైన విషయాన్ని తీసికొని వ్రాయడానికి పూనుకొన్నాను. ఇది సాహసము అనండి. అవివేకము అనండి. ఏదైనా కావచ్చు।

వ్రాస్తే అటువంటి విషయాన్నే తీసికొని వ్రాయాలె. లేకపోతే నల్లమందు వేసుకొని మత్తుగా పడుకోవాలె. కాని మనపూర్వులు వ్రాసిన విషయాన్నే తీసుకొని మళ్లీ వ్రాయడము ఏమంత ప్రయోజనకరమైన సంగతి కాదూ అని నాకు తోచింది.

మిత్రులంతా అన్నారు. ''ఎందుకు లేనిపోని గొడవ పెట్టుకొంటావు. మొగుడూ పెళ్లాలు అయిన తరువాత పోట్లాడుకొంటూనూ ఉంటారు. కాట్లాడు కొంటూనూ ఉంటారు. దాన్నిగురించి ఒక పుస్తకం వ్రాసేందుకు ఏముంటుందయ్యా ఊరుకో'' అని.

''అంతగా ఏదో ఒకటి వ్రాయకుండ ఊరుకోలేకపోతే. అంటే మరీ ప్రాణంమీదికొస్తే. ఏ రామాయణమో వ్రాయి. ఇహం. పరం కూడా

కలిసొస్తుంది. మొగుడూ పెళ్లాల పోట్లాటలనుగురించి ఓ పెద్ద పుస్తకం వ్రాయ పూనుకోవడము ఎక్కడా కనీ వినీ ఎరుగము" అని కూడా హేళన చేశారు.

నిజమే. వాళ్లు చెప్పింది చాలా మంచిమాట. రామాయణము వ్రాయడము అంటే మెత్తని సుఖమైన మార్గాన నడచిపోవడము. దారి కనబడుతూ ఉంటుంది.

అయితే దాని కో ఇబ్బంది వచ్చింది. అసలు రామాయణం ఔత్తరాహులకథ. ఉత్తరదేశస్థులూ అంటే నాకు మంట! మన సంగతే మనం వ్రాసుకోవాలెగాని ఇంకొకరి సంగతి ఎందుకు వ్రాయాలా అని పట్టుదలకూడా ఉన్నది నాకు.

అదీగాక భారతం వ్రాయకుండా ముందుగానే రామాయణం వ్రాయడము ఏమిటీ అని!

అది సరే. భార్యాభర్తల మధ్య వచ్చే పోట్లాటలను గురించి వ్రాయడము ఏమిటి. వ్రాస్తే దాంపత్య జీవిత సౌందర్యాన్నిగురించీ, దాని ఔత్కృష్ట్యాన్ని గురించీ వ్రాయాలెగాని. వారి మధ్య అప్పుడప్పుడు పొడసూపే కలహాలనుగురించి వ్రాయడము ఏమిటయ్యా అనికూడా అంటే అనవచ్చు కొందరు.

దానికి ఒక ప్రత్యేకమైన కారణం లేకపోలేదు. ఈ కలహాలను చిన్న చూపు చూడడములోనే పెద్ద పొరబాట జరుగుతున్నది. ఈ కలహాలు చిన్నవైనా చాలా పెద్ద విషయాలు.

అవి అప్పుడప్పుడు వస్తూ వుంటవి అనుకోవడము మరో పొరపాటు. అవి ఎప్పుడూ ఉంటూ ఉన్నవి. ప్రతి ఇంటా, ప్రతి గంటా జరుగుతున్నవి. అక్రమము త్రికాలములయందూ జరుగని గృహము నేను చూడలేదు.

పండితరాజు, ఓ మాట అన్నాడు: "ఏ గృహము అయితే ఈ చిట్టి చిట్టి కలహాలతో ప్రతి ధ్వనింపదో, ఏ ఇల్లు ఇట్టి పోట్లాటలు లేని కారణాన ప్రశాంతంగా ఉంటుందో ఆ ప్రదేశము నీరవ, నిరస

మహారణ్యామే అవుతున్నది కాని సుందరమైన ఇల్లు ఎప్పటికీని కానే రదూ'' అని.

పక్షుల కిలకిలారవము ఉద్యానవనానికి ఏ విధంగా శోభాయమానమో అలాగే ఈ కలహముల మూలంగా ఉత్పన్నమయ్యే మధురధ్వని గృహానికి శోభాయమానము అవుతున్నది.

చూతపల్లముల మెక్కిన తరువాత పంచమస్వరమున పలుకని కోకిల ఎంత అరుదో సతీత్వమును స్వీకరించిన తరువాత కంఠమెత్తి కలహం నడుపని గృహిణీ అంతే అరుదు.

''ఇంటింట దీపంబు వెలుగుతుండాలె. కలహాలు ఇంటింట కలుగుతుండాలె. నట్టింట ఉయ్యాల కట్టి తీరాలె. కాంతతో కలహంబు పట్టి తీరాలె. పిల్లలూ లేనట్టి ఇల్లేమి యిల్లు. పోట్లాట లేనట్టి పొత్తేమి పొత్తు!'' ఇల్లాంటివి ఎన్నో లోకోక్తులు. చాటువులు ఈ కలహాల ప్రాముఖ్యాన్ని వేనోళ్ళచాటుతూ ఉన్నవి.

ఈ కలహాలు దాంపత్య జీవితాన్ని మనోహరము చేస్తున్నవి. జీవితానికి సుందరతను చేకూరుస్తూ ఉన్నవి. అంధకార బంధురమైన జీవితాకాశంలో తటిత్కాంతులు ఇవి. మానవజీవిత స్రవంతిలో మనోజ్ఞమైన మలుపులు ఇవి.

ఈ కలహాల కారణమూ, ప్రయోజనమూ మొదలైన విషయాలను గురించిన చర్చ ముందు ప్రకరణంలో ఉంటుంది.

# కలహస్వరూపము

## చిరు కలహాలు 1.

దాంపత్య జీవితానికి సంబంధించిన కలహాలలో ప్రణయ కలహాలని ఒక రకం ఉన్నవి. వాటిని గురించి వేరేపుస్తకము వ్రాశాను.

ఇక్కడ సిసలైన నాటుకలహాలని గురించి వ్రాస్తాను. మానవ జీవితంలో దాంపత్యజీవితము ప్రారంభం అయినప్పటినుండి ఈ [illegible] కలహాలు సాగుతూ ఉన్నవి.

సముద్రంలో ఒకప్పుడు చిన్నతరంగాలు మాత్రమే పుడుతవి. మరొకప్పుడు ఉత్తుంగ తరంగాలు ఉద్భవిస్తవి. ఈ సంసారసాగరంలోనూ అంతే. కొన్ని అలలు చిన్నవిగాను, మరికొన్ని బ్రహ్మాండ [illegible]విగాను ఉంటవి. కనక ముందు చిన్న అలలవంటి చిరుతగవులను గురించి ప్రస్తావిస్తాను.

ఇవి దాంపత్యజీవితపుటంచులను తాకుతూ ఉంటవి. వీటివలన జీవితానికి అశాంతిగానీ, అసౌఖ్యంగానీ కలుగదు.

భార్యకు పండుగకు చీర కొని ఇయ్యకపోవడమూ, ఆమెను పుటినింటికి వెళ్ళనియ్యకపోవడమూ, ఇంట్లోకి కావలసిన వస్తువులు తెచ్చిఇయ్యకపోవడమూ, చెప్పినమాట వినకపోవడమూ, ఇంటావిడ అభిరుచికి భిన్నంగా భర్త ప్రవర్తించడమూ, ఎన్నిసార్లు చెప్పినా

వినక భర్త రాత్రిళ్ళు ఇంటికి ఆలస్యంగా వస్తూఉండడమూ మొదలైన చిన్న చిన్న విషయాలు ఈ రకం కలహాలకు కారణాలు.

మొగుడూ పెళ్ళామూ పోట్లాడుకొంటూ ఉంటే చూడ ముచ్చటగా ఉంటుంది. ఇరుగుపొరుగు వాళ్ళకు చక్కని సంగీతం వింటున్నట్లు ఆనందంగా ఉంటుంది. దంపతులు అయిన యిద్దరూ వాయిస్తేగాని ఈ మధురమైన సంగీతం పుట్టదు అని అబ్రహాం లింకన్ అన్నాడు.

ఇందులో భార్యదే గాత్రసంగీతం. ఇంట్లో అత్తగారు ఉన్నదా అంటే ఆమె, అప్పుడప్పుడు లయయుక్తంగా ఒక ముక్తాయింపు యిచ్చి, మృదంగం వాయిస్తుంది. భార్య పాడేపాటకు ఆమె సోదరి, తమ్ముడు వంత పాడుతారు. అప్పుడు మహామధురమైన సంగీతం పుట్టుకొస్తుంది. భర్త ఈ పాటగాళ్ళకు ఎదురుగా కూర్చుని తల ఊపుతూ ఆనందిస్తూ ఉండాలె. లేకపోతే ఫిడేలు తీసికొని ఆమెకు తోడు పాడాలె.

ఈ పోట్లాటలవల్ల ఒక విషయం ప్రతి భర్తా తెలుసుకొంటాడు. ఏమిటి అంటే తన భార్యకు అన్నివిషయములూ తెలుసుననీ. ఆమెకు తెలియని విషయం అంటూ లేదు అనీ; అందుకనే ఆవిడ మాటి మాటికి భర్తతో, "మీకు తెలియదు ఊరుకోండి" అంటూ ఉంటుంది. పుస్తకాలు అమ్మే ఆయన ఒకరు విజ్ఞాన సర్వస్వము అనే పుస్తకం తీసుకొచ్చి, ఒక కాలేజీలెక్చరర్‌తో "బాబూ! ఈ పుస్తకం ఒకటి కొనండి. ఈ పుస్తకమువలన మీకు అన్ని విషయాలను గురించీ తెలుస్తుంది" అన్నాడు. ఆ లెక్చరర్ "నాకు అక్కరలేదయ్యా. నాకు పెళ్ళాముంది" అని విసుక్కుని అతనిని పంపివేశాడు. ఈ మాట విన్న ఇంటావిడ భర్తతో పోట్లాట వేసుకొన్నది.

ఒకాయన గడ్డం చేసుకుందామని కూర్చున్నాడు. బ్లేడు తెగడం లేదు. ఆయన విసుక్కుని "ఏమి కర్మం వచ్చిపడ్డదే! ఇంకోబ్లేడు లేదు ఈ బ్లేడు తెగడంలేదు" అన్నాడు.

భార్య ఆశ్చర్యపడి "అదేమిటండీ అల్లాగంటారు. ఇందాక పెన్సిల్ చెక్కితే బాగానే తెగింది. మీ గడ్డము పెనసలుకంటే గూడా బిరుసా ఏమిటి విపరీతం కాకపోతే।" అని కాసేపు పోట్లాడింది.

ఇటువంటి చిన్నచిన్నవి. అతిస్వల్పమైనవి అయిన కారణాల వల్లనే. ఈ చిరుకలహాలు వస్తూఉంటవి అని గ్రహించవలయును.

సాధారణంగా భర్త అవును అంటే భార్య కాదని అంటూ ఉండటముువలన ఈ కలహాలు వస్తూ ఉంటవి. రోజుకు ఒక్కసారి మాత్రము ఇద్దరు 'అవును' అంటే 'అవును' అనవలసిన అవసరం వస్తుంది. అది గడియారం రాత్రి పన్నెండు కొట్టినపుడు। ఆ ఒక్క సమయంలోమాత్రం భార్యాభర్తలకు ఏకీభావం కుదరక తప్పదు. ఒకరు అవునంటే. రెండోవారు కాదనటానికి వీలులేదు. అది మహా సత్యకాలము. భార్యాభర్తలను ఏకం చేస్తుంది।

## 2. గురుకలహాలు

ఇక బ్రహ్మాండమైన అలల వంటివి గురుకలహాలు. ఇవి ఎట్లా గుంటయ్యో చెపుతాను.

కావడానికి గురుకలహాలే అయినా స్వల్పవిషయాలను ఆధారంచేసుకొనే పుడుతూఉంటవి ఇవికూడా.

''గింజలు, కాయలు మొదలైనవాటిని పొట్టుతోనూ, పై పెచ్చుతోనూ తినడము మంచిది. ఆ పొట్టులో విటమినులు ఉంటవి'' అని నేనొకసారి అన్నాను మా ఆవిడతో.

ఆ మాటమీద ఆవిడ నాలుగూ యూధించి వదిలిపెట్టింది. "పొట్టు తింటామటండీ ఎక్కడైనా। డాక్టర్లు చెప్పడానికేం వాళ్ళు అల్లాగే చెపుతారు? ఈ డాక్టర్లకేం తెలుసునండీ। పొట్టు చిట్టు తినే వాళ్ళను నేను ఎక్కడా చూడలేదు. అందులో ఏదో ఉన్నయి అంటారే. ఆ ఉండేవి అసలు వస్తువులో ఎందుకు ఉందవండీ? పొట్టులో అంత సుగుణం ఉంటే మీరు పొట్టు తినండి. నేనూ పిల్లలూ మాత్రం అసలువస్తువే తింటాము।'' అది ఓ అరగంట పోట్లాట।

తెల్ల వాయిల్‌చీర కట్టుకుంటే తన భార్య అందంగా కనబడుతుందని ఊహించి ఒకాయన ఆ చీర కొనుక్కొచ్చాడు.

ఆమెగారు చీరను అటూ ఇటూ తిప్పి చూచి. చప్పరించి వికారంగా చూస్తూ ''షర్ట్ యిస్తే వుచ్చుకొంటాడా?'' అంది.

గృహాసు మనస్సు చివుక్కు మన్నది. కోపంతో ఒళ్లు మండిపోయింది. ఇక చూడండి.

''నేను తెచ్చిన చీర కట్టుకోవూ? నాయందు ప్రేమవుంటే నాకు ఇష్ట మైన వస్తువు నీకూ యిష్టమౌతుంది.''

''అవునండీ, మీకు ఇష్టమైనది నాకూ ఇష్టమేననుకోండి. అయితే నాకు యిష్టమైనది మీకూ యిష్టంకావాలిగా, అందుకని ఈ చీర నాకు ఇష్టంలేదు అనేసరికి మీకుకూడా ఇష్టంలేకుండా పోవాలె!''

ఈవిధంగా ఆవిడ వాదించి వాదించి దుంపతెంపింది. చివరకు, పెద్దగా ''మీరు ఏ దరిద్రపుచీర కొన్నా నోరెత్తకుండా కట్టుకొనే టంతటి ప్రేమ నాకు లేదు. సరేనా'' అని విదిలించి వదలిపెట్టింది.

పైటచెరగు వేలాడుతూఉంటే నాకు అందం అనిపిస్తుంది. మాఆవిడ అల్లాగ ధరించాలని నా అభిలాష. ఆవిడ చెంగును నడుంచుట్టూ త్రిప్పి బొడ్లో దోపుకుంటే అందం అంటుంది. ఈ విషయమై చక్కగా ఒక అరగంట పోట్లాట సాగింది.

ఒకసారి మా ఆవిడను సినిమాకు రమ్మన్నాను. ఆమె సరేనని ప్రత్యేక అలంకరణ ప్రారంభించింది. ఎన్నిసార్లు పిలిచినా పలుకదు. నాకు కోపం వచ్చింది.

అరగంటనుంచీ, ఎన్నిసార్లు పిలిచినా పలకవేమి?

పలికి ఎంతసేపు అయింది!

పలికావా? అయితే నాకు ఎందుకు వినిపించలేదు?

ఎందుకు వినిపించలేదో నాకేం తెలుస్తుంది, మీకే తెలియాలి.

ఎందుకు ఊరికే దబాయిస్తావు! అసలు నీవు జవాబు చెప్పి ఉన్న ట్లయితే నాకు వినపడే ఉండేది!

నేను చెప్పానండి.

ఎప్పుడు చెప్పావు?

ఇరవై నిమిషాలక్రింద చెప్పాను.

ఏమని చెప్పావు?

పది నిమిషాలలో వస్తున్నానని చెప్పాను.

పది నిమిషాలని చెప్పి అరగంట ఎందుకు చేశావు?

చేయలేదు. నేను చెప్పినతరువాత పది నిమిషాలకే వచ్చాను. ఇరవై యున్నూ పది ముప్పది నిమిషాలు. అంటే అరగంట. సరిపోలేదు టండీ ఊరికే గొడవచేస్తారూ-అని విచిత్రంగా వాదించింది ఆవిడ.

ఒక్కొక్కప్పుడు ఈ పోట్లాటలకు తలా తోకా ఉండదు. ఏదో విషయమువచ్చి "ఆయనకు చూస్తూ చూస్తూ పిల్లను ఎవ్వరూ ఇయ్యరు" అన్నది మా ఆవిడ. "ఎందుకివ్వరు?" అన్నాను.

"ఎట్లా ఇస్తారండి!"

"ఏం? ఎందు కివ్వకూడదు?"

"ఆయన బర్మా వెళ్ళి వచ్చాడండి!"

"బర్మా వెళ్ళొస్తే పిల్ల నియ్యడానికేం!"

"ఏమో, మీకు నేను చెప్పలేను. బర్మా వెళ్ళొచ్చినవాళ్ళకు పిల్లను ఎవ్వరూ ఇయ్యరు."

ఎందుకు అటువంటివాడికి పిల్ల నియ్యకూడదో నాకు అర్థంకాకపోవ డమువలన పోట్లాట నలభై నిమిషాలు సాగింది. చివరకు ఆమెగారు ఒక మాట అన్నది: "మీకు చచ్చినా అర్థంకాదు. బర్మా గిర్మా వెళ్ళివచ్చిన వాళ్ళకు చూస్తూచూస్తూ పిల్లను ఎవ్వరూ ఇయ్యరు!" నాకు వళ్ళుమండి "అసలు ఆయన బర్మా వెళ్ళొచ్చాడని నీ కెట్లా తెలిసింది?" అని నిలవదీసి అడిగాను.

ఆవిడ జంకలేదు. అంగుళంకూడా వెనకడుగు వేయలేదు. నాకంటే పెద్దగా అరచి చెప్పింది: "ఆయన బర్మా వెళ్ళొచ్చాడని చూచిన వాళ్ళకు ఎవరికైనా తెలుస్తుంది. ఒకరు చెప్పక్కరలేదూ, పెట్టక్క రనూలేదు. అలాగ పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ, తూలుతూ నడవడము కనబడదము లేదుటండీ!" అని తేల్చి చెప్పేసింది.

సాధారణంగా అరగంట అయినతరువాత గృహస్థుకు తెలుస్తుంది ఇంటావిడ వాదనలో ఉందేపట్టు. అప్పటికీ తెలియకపోతే చచ్చినా తెలియదు. ఇల్లాగ ఉంటవి ఈ కలహాలు.

ఇప్పటికి ఈ కలహాలస్వరూపం కొంతవరకైనా తెలిసిఉండకపోతే నేను ఇంకా చేసేది ఏమీలేదు. తెలుసుకోవాలె. అలవాటు అయిన కొద్దీ ఈ కలహాలలో ఉండే స్వారస్యము బోధపడుతూ ఉంటుంది.

అలవాటు కాకముందు ఈలాంటి పోట్లాటలు భరించలేక ఒకసారి ఒకాయన చచ్చి ఊరుకొన్నాడు. ఆయన మిత్రులతో ఈవిధంగా మొఱపెట్టుకొన్నాడు: "నేను చచ్చానురా బాబు. చచ్చి నెలరోజులైంది. ఇంకా నాతో పోట్లాడుతుందేం ఆవిడ! మీరన్నా చెప్పండి. ఆయన చచ్చాడమ్మా ఊరుకోమని!"

ఆవిడ ఊరుకోలేదు. పోట్లాడుతూనే ఉన్నది. మనిషికి పట్టుదలవస్తే అంతే. అవతలవాడు చచ్చానో అని మొత్తుకొన్నా తమ పట్టు వదలరు.

ఈ పోట్లాటలయొక్క ప్రధాన లక్షణాలు రెండుమూడు గుర్తించాలె. ఈ తగవులు అతి స్వల్పవిషయాన్ని ఆధారంచేసుకొని రేగుతూ ఉంటవి.

పోట్లాట పెరగడములో అసలు విషయం జారిపోతుంది. మాటల సందర్భంలో వచ్చిన విషయాంతరముపై వాదన పెరిగిపోతుంది. పోట్లాటను జరిపే ఇద్దరిలో ఎవరుగాని, వాదనయొక్క రెండు ప్రక్కలూ వినరు. ఎవరివాదన వారిదే. వాదనయొక్క రెండు ప్రక్కలూ వినేది ప్రక్కయింటి ఆవిడ మాత్రమే నని గుర్తుంచుకోవాలె.

# మధ్యతరగతి ప్రత్యేకత

ఈ కలహాలు సాధారణంగా మధ్యతరగతి కుటుంబాలలోనే సాగుతూ ఉంటవి. కాని భాగ్యవంతుల ఇండ్లలోనూ, జమీందారుల ఇళ్ళల్లోనూ ఉండవు. వీళ్ళ ఇళ్ళల్లోనే ఎందుకుండాలె? పోట్లాడుకోమని వీళ్ళ ముఖానే వ్రాసిపెట్టిఉన్నదా? అన్న ప్రశ్న వస్తుంది.

కొంచెం నిశితంగా ఆలోచిస్తే ఈ విచిత్ర సాంఘిక వ్యాపారానికి కారణం తెలియికపోదు. జమీందారుల ఇళ్ళలో కొన్ని మర్యాదలు ఉన్నవి. వారు వాటిని ఈ రోజుకు కూడా పాటిస్తూ ఉన్నారు. ఏమిటీ అంటే, దొర, దొరసాని సన్నిధికి ఎప్పుడుబడితే అప్పుడు వెళ్ళడానికి వీల్లేదు. దొరసానిని చూడడానికీ, ఆమెతో కొంచెంసేపు వినోదంగా కాలక్షేపం చేయడానికీ ముందుగా కబురు చేయాలె. ఆమెకు ఇష్టమైతే రమ్మంటుంది. ఈ విధంగా వాళ్లు ఒకరి యెడల మరియొకరు అనురక్తులై ఉన్నపుడే కలుస్తారు. అల్లాగ కలిసినపుడు పోట్లాటలు ఎందుకు ఉంటవి? ఆ కాసేపు ఏదో సరస సల్లాపాలలో గడిచిపోతుంది.

వర్తకులూ, ప్లీడర్లూ, తాలూకా గుమాస్తాలూ, పెద్ద ఆఫీసర్లూ వీళ్ళ కొంపలలో ఇల్లాంటి కలహాలు ఉండడానికి వీల్లేదు. ఎందుకంటే, వీళ్ళు ప్రొద్దస్తమానమూ ఏదో పనిలో మునిగి ఉంటారు. వీళ్ళకు తమతమ భార్యలతో మాట్లాడడానికే టైము ఉండదు. ఇక పోట్లాడడానికి టైము ఎక్కడనుంచి వస్తుంది?

సినిమానిర్మాతలూ, ట్రావెలింగ్ ఏజెంట్లూ ఎప్పుడూ కొంపకు వెళ్ళనే వెళ్ళరు. అన్నంకూడా ఆఫీసులోనే తింటారు. రాత్రి ఏ పది గంటలకో కొంపకుచేరి ఒకటి రెండు నిమిషాలు మాత్రము ఆమెతో

మాట్లాడి ఆ పళంగా పడుకొని నిద్రపోతారు. మళ్ళీ అమె నిద్రలేవక ముందే వీళ్ళు కారెక్కి బయటికి వెళ్ళిపోతారు. వాళ్ళు అప్పుడప్పుడు ఫోనులో మాట్లాడుకోవడము కద్దు. కాని ఫోనుమీదే పోట్లాడుకొన వానికి సౌకర్యాలు ఇంకా మన దేశంలో ఏర్పడలేదు కొంత అందో ళనచేస్తే 'థర్డ్ ఫైవ్ ఇయర్ ప్లాను' (మూడవ పంచవర్ష ప్రణాళిక) లో అటువంటి సర్వజనోపకరమైన ఏర్పాట్లు జరుగవచ్చు. కాని ప్రస్తుతం అల్లాంటి సౌకర్యంలేదు.

వేదాధ్యయనపరులూ, నైష్ఠికులూ, ధార్మికులూ అయినవారి ఇళ్లలో ఇల్లాంటి తగవులు ఉండడానికి వీలులేదు. ఎందుకంటే వాళ్ళకు ఎప్పుడూ అగ్నిహోత్రం ఒకటుంటుంది. అదీకాక వేదాన్ని ఘన, జట - అనేపద్ధతిలో చదువుతూ ఉంటే తనతో తానే పోట్లాడు కొంటున్నట్లుంటుంది। వాళ్ళకు వేరే విడిగా పోట్లాడటానికి అవసరం ఏమీ ఉండదు. పైగా సభలలోనూ, పండిత గోష్ఠులలోనూ వారు పోట్లాడుకొంటారు కాబట్టి, ఇంటిదగ్గర వేరే పోట్లాటలు ఉండవు ఇంతకూ వాళ్ళు కర్మిష్ఠులు. కర్మ చేయడంతోనే వారికి సరి పోతుంది. పోట్లాడటానికి టైము ఏదీ।

ఇక ఎహాచ్చీ. ఏమీ పనిలేకుండా ఉండేవాళ్లూ, రిటైరు అయిన ఉద్యో గులూ, ట్యూషనులు చెప్పని మాష్టర్లూ, పురోహితులూ, చిన్న కర్తరులూ - వీళ్ళ కొంపలలోమాత్రం ఈ కలహాలు నల్లత్రాచుల్లాగ బుసలుకొడుతూ ఉంటవి.

పనిపాటలు చేసుకొనే పరిశ్రామికుల ఇళ్ళలోకూడా ఈ తగవులు ఉంటవి. కాని అక్కడ వాటిస్వరూపం వేరు. అక్కడ కలహాలు మోటుగా నడుస్తవి.

మన ఇళ్ళల్లో అయితే పోట్లాట ప్రారంభం అయి, రాజీ నిప్పు అయి సేప్పు కణకణ లాడుతూ ఉంటుంది. అదో ముచ్చటగా ఉంటుంది. వాళ్ళ కొంపల్లో పోట్లాట తాటాకులమంటలాగ భగ్గున మండి బూడిదై పోతుంటుంది. వాళ్ళు అనాగరికులు. పోట్లాటను అందంగా నడుపు కొనే నేర్పు వాళ్ళ కెక్కడిది।

ఆ నేర్పు మనకే ఉన్నది. ఇంగ్లీషువాళ్ళు అంటారూ మరీ అందంగా జరుపుకొంటారు. వాళ్ళు ఏపని చేసినా అందంగానూ, నేర్పుగానూ చేస్తారన్న విషయం అందరికీ తెలిసిందేకదా!

ఈ కలహాలు చక్కగా నడుపుకొంటానికి రసజనకమైన చిత్తవృత్తి కావాలె. సౌందర్యతృష్ణకూడా ఉంటేగాని ఈ తగవులు సక్రమంగా నడవవు.

భార్యా భర్తలు ఈ తగవులను బరువైన విషయాలుగా గ్రహించక తేలిగ్గా ఊదెసెయ్యాలె.

కలహం జరపంగానే సరా! దాని కెంత దక్షత కావాలె. అందరు భార్యలూ పోట్లాడారు తమ తమ భర్తలతో. కాని కాంతం జరిపి నట్లు ఇంకెవ్వరైనా జరపగలిగినారా!

కలహం జరుపుతూ కూడా అది పెద్ద పోట్లాటలోనికి మారకుండా, జారకుండా ఎక్కడ తెగగొడితే రమ్యంగా ఉంటుందో అక్కడ తెగగొట్టే శక్తి అందరికీ ఉంటుందా!

శ్రుతిమించి రాగాన పడగానే చటుక్కున ఏదో హాస్యపు పలుకులతో ఆ కలహం అంతమొందించడము చాలామందికి చేతకాదు.

ప్రపంచాన్ని అంతా ముంచివేసేటంతటి వర్షము పడబోతున్నదా అనిపిస్తుంది. కారుమేఘములు ఆకాశాన్ని క్రమ్ముకొంటవి. మెరుపులు, ఉరుములూ గందరగోళంగా ఉంటుంది. కాని కాసేపటికి ఒక చిన్న గాలికి ఇదంతా తేలిపోతుంది. చల్లని హాయిని గొలిపే మంద మారుతము వీస్తుంది. అల్లా ఉండాలె ఈ కలహాల నడక. ఏదో కొంపలంటుకుపోయే టంతటి హడావుడిగా బయలుదేరుతవి ఈ కలహాలు. భర్త భార్యను కొట్టి చంపిపారేస్తాడా అన్నట్లు, పెద్దగా పోట్లాటను ఆరంభిస్తాడు. చివరకు తుస్సుమని తేలిపోతుంది. ఇదీ ఈ కలహాల తత్వము.

ఈవిధంగా ఈ కలహాలు మొదట్లో భయంకరంగా ఉండి చివరకు మనోహరమైన రూపమును పొందుతవి.

కఠినశిల శ్రీరామచంద్రుని పాదస్పర్శచే మనోహరమైన రూపమును పొందినట్లు, కలహం జరుగుతూ ఉండగా మధ్యలో భార్యాభర్తలలో ఎవరో అన్న ఒక్కమాటవలన ఈ తగవులు తమ కాఠిన్యమును పోగొట్టుకొని సుందర రూపమును పొందుతవి.

ఈ శక్తి మధ్యతరగతి కుటుంబీకులకే ఉన్నది.

పోట్లాటలు వచ్చినా, సంసారం తెగగొట్టుకోక ఎల్లాగో సర్దుకు పోవడమూ, సమాధానపడడమూ, నవ్వి ఊరుకోవడమూ, తుడిచి వేసుకొని తిరగడమూ, దుమ్ము దులిపినట్లు దులుపుకొని పోవడమూ మొదలైనవి మధ్యతరగతి కుటుంబంవారి రక్తనిష్ఠమైన సుగుణాలు.

సౌందర్య పిపాస, సంభాషణా చతురత, సరస సల్లాప వాల్లభ్యమూ-ఇవన్నీ మధ్యతరగతి గృహస్థులలోనే తరతరాలబట్టీ పెంపొందినవి.

భాగ్యవంతులూ, జమీందారులూ మొదలైనవారు రజోగుణ ప్రధానులు. రజోగుణ ప్రాబల్యంచేత వాళ్ళు పరిస్థితులకు లొంగరు. సరిపెట్టుకు పోరు.

అల్లాంటి కుటుంబాలలో భార్యా భర్తలు ఇద్దరూ బెట్టుగా, ఠీవిగా, గర్వంగా, దర్జాగా జీవిస్తారు. అటువంటి చోట్ల పోట్లాటలు ఎల్లా వస్తవి: వస్తే అవి సర్వనాశనానికే.

ఇక శ్రామికుల సంగతి. వీళ్ళకు సరససల్లాపా లేమి తెలుసు! పేద తట్టతో కొట్టుకోవడమే వాళ్ళకు తెలిసిన సరసము.

మన కలహాలు సరస సల్లాపాలు, అవి మోటుమాటలు! మన కలహాలు నృత్యప్రదర్శనాలు, అవి త్రాగినవాడి చిందులు! ఇవి సరస సంగీత సభలు, అవి పొలికేకలు!

మన కలహాలు రబ్బరు సాగినట్లు సాగి యథాస్థితికి వస్తవి. అంటే కలహంజరిగినా సంసారస్వరూపం ఏమీ మారదు. ఇతరుల కలహా

లలో సాగిన స్థితి సాగినట్లే ఉండిపోతుంది. లేకపోతే తప్పున తెగిపోతుంది.

కాబట్టి ఇటువంటి కలహాలు మధ్యతరగతి కుటుంబాలలోనే ఉంటవి. కాని ఇతరచోట్ల ఉండవు. వీటిని సక్రమంగా నడుపుకొనే శక్తి. అదుపులో ఉంచే తెలివితేటలూ ఇంకొకరికి లేవు.

ఇటువంటి కలహాలు సక్రమంగా నడుపుకొన్నవాడే సద్గృహస్థు.

ఈ పోట్లాటలు జరిపేది మనంగాదు. సర్వము ఈశ్వరాజ్ఞచేత జరుగుతున్నదీ అన్న జ్ఞానముకూడా గృహస్థుకు ఉండడము అవసరము.

# కలహ కారణము

...లు ఎందుకొస్తవి అంటే అనేక కారణాలవల్ల వస్తవి. ... అన్నిటికీ చెప్పే కారణమే. మనకర్మ అనేది దీనికి ... చెప్పవచ్చు. కర్మ - సంచితకర్మ అనుభవింపక తప్పదు. ... క్రోధలోభాదు లనెడి రజోగుణవికారాత్మక మైనపుడు ... చెంది. ఇల్లాంటి తగవులకు కారణభూతమగుచున్నదీ ... అంటారు.

...శాస్త్రవేత్తలను అడిగిచూచాను. "ఏమండీ! యీ లోకంలో ... కుటుంబాలలో మొగుడూ, పెళ్ళామూ అయినవాళ్ళు, ఇల్లాగ ...కొంటూ ఉంటారు - దీనికి మీ శాస్త్రరీత్యా కారణంఏమిటీ" ...

... ఆలోచించి పుస్తకాలు తిరగేసి, తల ఊపి చివరకు ఇట్లా ... "దీనికంతా కారణం ఒకటే ఉందండి. స్త్రీకి కంఠంమీద ...పుటగల పుట్టుమచ్చ ఒకటీ. హస్తమధ్యంలో త్రిశూలం ఒకటీ ... ఈ రెండూ ఉంటే మరీమంచిది. రెండూ లేకపోతే అధమం ... రెండింట్లో ఏ ఒకటి అయినా ఉండాలె. ఈ గుర్తులులేని స్త్రీలను ...ముమువల్లనే ఈ తిప్పలు వస్తున్నవి. నేను ప్రతివాళ్ళతోనూ ...టూ నేడన్నా. పిల్లకు ఉండవలసినవన్నీ ఉన్నవేమో చూచు ... పెళ్లాడండర్రా అని; కాని ఈ ముసలివాడిమాట చెవిని ... లేదు. ఈ గుర్తులులేని స్త్రీ కలహములయందు ప్రీతి ...యందు గౌరవము లేనిదై ఉంటుందని శాస్త్రంలో ... చెప్పనే చెప్పాడండీ!"

ఈ మాటలువినేసరికి నాకు జ్ఞానోదయం అయింది. "అరి దీని సిగ తెగ! ఇది కాబోలు కారణం! ఎందుకా ఎప్పుడూ పోట్లాడుతుందీ అని ఆశ్చర్యపడేవాడినే గాని ఇన్నాళ్ళబట్టీ ఈ సంగతి తెలుసుకొన్నావాణ్ణి కాను" అని అనుకొని గబగబ ఇంటివైపు పరుగెత్తసాగాను.

"ఏమిటయ్యా! ఏమి టా తత్తరపాటు! ఎక్కడికీ?" అని అడిగాడు ఆయన. "మా ఆవిడకు మీరు చెప్పిన వన్నీ ఉన్నాయో లేదో చూద్దామని వెడుతున్నాను" అన్నాను.

ఆయన నవ్వి "మీ ఆవిడ నీతో పోట్లాడుతుందనే అన్నావు కాబట్టి ఇంక ఏమీ చూడక్కరలేదు. పోట్లాటలు ఎట్లాగూ ఉన్నవి కాబట్టి ఆ గుర్తులు లేనట్టే లెక్క. ఉండడానికి శాస్త్రం ఏమాత్రం ఒప్పుకోదు, కాబట్టి నీవు యిప్పుడు చేసేది ఏమీలేదు. ఊరుకో" అన్నాడు.

నేను కొంచెం విచారంగా దిక్కుమొఖం పెట్టి నుంచుని, "చూడండి. అవి లేవు అన్నారా, మరి అవి పుట్టుకొచ్చే అవకాశం ఏదైనా ఉందాండి?" అని అడిగాను.

ఆయన జాలిపడి "అట్లాంటిది ఏమీ కుదరదు బాబూ! పుట్టుమచ్చలంటేనే, పుట్టుకతో వచ్చినవి అన్నమాట. పుట్టించడానికి వీలున్న పుటుమచ్చలు కానేరవు! పచ్చ బొట్లు చూశారూ. అని పుట్టుమచ్చలకు చాలా సన్నిహితంగా ఉంటవి. అవి పొడిపించి చూడండి" అన్నాడు.

"బాబూ! ఈవిషయం ఇల్లాగ అయిపోయిందా అండీ. నాకు కాకపోయినా ఇతరులకు చెప్పడానికైనా పనికివస్తుంది ఆ జ్ఞానము. ఇంకా పిల్లకు ఏమేమి ఉండాలో చెప్పండి" అని ప్రాధేయపడ్డాను.

"మిగతావన్నీ మామూలేనయ్యా! కాకపోతే, 'సూక్ష్మబింబారుకోష్ఠి ఛ విజకాన్తాను రాగిణీ' అన్నాడు కాబట్టి పెదవులు దొండపండువలె ఎఱ్ఱగా ఉన్నవా, లేవా అని చూచుకోవడమున్నూ. 'నిమ్ననాభిశ్చ సుముఖీ' అన్నాడు కాబట్టి బొడ్డు లోతైనది అయి ఉండేటట్లు చూచుకోవడమున్నూ ఈ రెండూకూడా ముఖ్యమూ" అని విసుక్కుని నన్ను పంపివేశాడు.

అందువలన పిల్లను చేసుకోబోయేముందు పిల్ల హస్తాన్ని, కంఠాన్ని జాగ్రత్తగా పరీక్షించి, ఈ గుర్తులు ఉంటేనే చేసుకోండిరా బాబూ అని యుక్తవయస్కులైనవాళ్ళకు మళ్ళీ నేను చెపుతున్నాను.

ఇంకొక విషయంకూడా ఉన్నది. 'ప్లుతకేశా పతిం ద్వేష్టి' అన్నాడు. వంకర కుటిల కుంతల అయిన స్త్రీ పతిని నిర్లక్ష్యముచేస్తుందీ అని. కాబట్టి ఆ విషయంకూడా చూచుకోవడము మంచిది.

అల్లాగే ఏయే రేఖలు, ఏయే వంపులువుంటే సుగుణవతి అవుతుందో చూసుకొని, ఉండవలసినవన్నీ ఉంటేనే ఆమెను భార్యగా గ్రహించవలసి ఉంటుంది.

అయితే, ఈ ఒక్క సాముద్రికం చూస్తే చాలదు. ఇంకా అనేక శాస్త్రములవలన లభించే జ్ఞానము అనబడే వెలుగులో పిల్లను పరీక్షించాలి.

జ్యోతిశ్శాస్త్రరీత్యా వచ్చిన పొరపాట్లుకూడా, ఈ గృహకలహ కారణం అవుతున్నవి.

భార్యయొక్క జాతకచక్రం వేయించిచూస్తే ఈ పోట్లాటలు ఎందుకు వస్తున్నవీ యిట్టే తెలిసిపోతుంది

లగ్నాన్ని గురు బుధులు చూస్తూంటేనేగాని పిల్లలకు మృదుస్వభావమూ, సరళవాక్కూ, సాధువర్తనమూ అలవడదు. ఇదొకటి చూచుకోవాలె. పెళ్లాం జాతకలగ్నంపై ఎవరెవరి దృష్టి ఉన్నదీ, ఎవరిది లేనిదికూడా చూచుకోవాలె. ఉండవలసిన గ్రహాలదృష్టి ఉండకపోతే తిప్పలు తప్పవు. ఇది చూచుకోకపోబట్టే నాకు నానా తిప్పలు వచ్చినయి. చూచుకోవలసింది ఎవరిదృష్టి ఉన్నదీని.

ఇంకో విషయం ఏమిటీ అంటే ఇంద్రుని యాజమాన్యములోని జ్యేష్ఠానక్షత్రము నాల్గవపాదములో గండసంధిలో చంద్రుడు ఉండగా వివాహము జరిగితే ఆ దంపతులు బ్రతికిఉన్నన్నాళ్ళూ పోట్లాడుకొంటూ ఉండడము తప్పదుట.

మరొకటి ఏమిటీఅంటే సప్తమశుద్ధిలేని వివాహం జరుగరాదదు. సప్తమభావంలో ఇంద్రుడుఉంటే సప్తమశుద్ధి లేదన్నమాట. అటువంటిలగ్నాన వివాహంజరిగితే జీవితంలో భార్యతో కలహాలు తప్పవు.

వరుణుడు దశమ కేంద్రంలో ఉంది. రవిబుధులు ప్రబలులై ఉండ్డ దముకూడా పెద్దదోషము. అల్లాంటప్పుడు ఆ జాతకురాలు భర్తను నిర్లక్ష్యముచేయు గుణముకలదై ఉంటుంది.

ఆ పిల్లనుఅన్నా ఏమీ ప్రయోజనంలేదు. ఆ పిల్లమటుకు ఏమిచేస్తుంది: గండసంధిలో వివాహమైందాయే. రవిబుధులు ముడ్డిమీద తంతూ ఉంటిరి. ఇక భర్తతో పోట్లాడక మరి ఎవరితో పోట్లాడుతుంది పాపం!

ప్రాణ్యాణ కర్తలు పోట్లాడడము అనేది సృష్ట్యాదినుంచీ వస్తూఉన్న ఆచారమే. క్రొత్తగా ఈ యుగంలో బయలుదేరిందీ అనుకోవడము పొరపాటు.

ఈ సిద్ధాంతాన్ని బలపరచడానికి అనేక నిదర్శనాలు చూడవచ్చు. కాని ఆ విషయాలన్నీ ఇంకొక విభాగంక్రింద వస్తవి కాబట్టి ఇక్కడ చెప్పడములేదు.

ఒక్క విషయంచూడండి. ఆది మానవుడు 'యాడెం' గదా! ఆయనే తన భార్యఅయిన 'అవ్వ' తో పోట్లాడి, చివరకు ఆమెకు లొంగిపోయినసంగతి అందరికీ తెలిసిందేకదా! ఆ ఒక్క ఉదాహరణ చాలు ఈ సిద్ధాంతము పరమసత్యము అని చెప్పడానికి.

మన మాటలలోనే పోట్లాటలు ఉన్నవి. మఱ్ఱిగింజలో బ్రహ్మాండమైన వృక్షము సూక్ష్మరూపంలో ఉన్నట్లు ఈ జగడములు బీజరూపంలో, అంతర్భాగములుగా ఉన్నట్లు మనము తెలిసికోవలె.

అంటే మానవుడు ఎప్పుడైతే మాట్లాడడమునేర్చాడో అప్పుడే పోట్లాడడము నేర్చినాడన్న మాట!

కలహము పుట్టుటకు పూర్వము ఆ కలహశక్తి మాటలలో వాసనారూపంగా ఉంటుంది. సమయము వచ్చినపుడు ఆ శక్తి విజృంభించి కలహాన్ని పుట్టిస్తుంది.

దెబ్బలాటలలోనూ, సరస సల్లాపాలలోనూ ఉన్నవి మాటలే. అయితే ఆ మాటలకు, ఈ మాటలకు ఉన్న భేదం ఏమిటీ అని మనము కొద్దిగా విచారించాలె.

శబ్దానికీ అభిధ, లక్షణ, వ్యంజన శక్తులున్నవీ అని లాక్షిణీకులు అంతా అంగీకరించారు. శబ్దానికి ఉంటూఉన్న మరొక అద్భుతమైన శక్తిని వారు గుర్తించలేదు. అదే కలహశక్తి.

కొన్నిమాటలు అంటే కోపం రావడానికీ, కొన్ని మాటలు అంటే నవ్వురావడానికీ ఇదే కారణం. కోపంవచ్చిందీ అంటే కలహశక్తి గల మాటలు ఉపయోగింపబడినవన్నమాట.

ఇంతకంటే శబ్దశాస్త్రాన్నిగురించిన ఇతర విషయాలలోకి పోవడము వలన ఈ పుస్తకం చదివి ఆనందించడానికి అడ్డు వస్తుంది. కాబట్టి ఆ విషయం వదిలేస్తున్నాను.

అయితే మాట్లాడడానికి, పోట్లాడడానికి గల ముఖ్యమైన భేదం ఇంకో రెండు మూడు వాక్యాలలో చెప్పుతాను, ఈ కలహతత్వం ఇటువంటిదీ అని తెలియడానికి.

శాంతము, స్థిరత్వము, విలకడ మాటలయొక్క లక్షణాలు. తీవ్రత, వేడి, వేగము, ప్రపాతము, ప్రజ్వలత పోట్లాటయొక్క లక్షణాలు. మాట్లాడడములో గొంతు మందరంలో ఉంటుంది. పోట్లాటలో షడ్జమస్థాయిని అందుకొంటుంది.

మాట్లాడేటప్పుడు కూర్చుని ఉంటాము. సంభాషణ పోట్లాటలోనికి దిగడముతోనే శరీరావయవాలకు చలనంగలిగి విలువబడడము జరుగుతుంది. మాట్లాటలో హస్తాది శరీరాంగముల కదలిక తక్కువ. పోట్లాటలో తల, ముక్కు, నోరు, చేతులు, కాళ్లు మొదలైన సర్వాంగములు అతి వేగముగా చలిస్తవి.

మాటలు సాధారణంగా ఇరుపక్షాలు కలిసి నవ్వుకోవడముతో సమాప్తి పొందుతవి. పోట్లాటలో, ఇరువురిలో ఎవరో ఒకరు కలహరంగాన్ని విడిచి కోపంగా, విసురుగా వెళ్ళిపోవడముతో అంతమౌతుంది.

మాట్లాడడములో అద్వయితము భాసిస్తుంది. అంటే భార్యా భర్తలు ఒకే అభిప్రాయమునూ, ఒకే లక్ష్యమునూ కలిగినవారై ఆ లక్ష్య

[illegible] మార్గములను అన్వేషిస్తూ ఉంటారు. పోట్లాటలో ద్వయిత [illegible]ము [illegible]ప్యమానంగా వెలుగుతుంది. అంటే వారి అభిప్రాయ [illegible] వేరువేరుగా ఉంటవి.

[illegible]ము రహస్యంగానూ. అంతటా నిశ్శబ్దము వ్యాపించియున్న [illegible]. అంధకారంలోను వృద్ధిపొందుతుంది. పోట్లాటలసమయంలో [illegible] గొడవగా ఉండి చప్పుడుతో నిండి ఉంటుంది.

[illegible] జరుగుసపుడు అనబడిన మాటలు నిజస్వరూపంలో విన [illegible]. పోట్లాటలో మాటలు రూపభేదమును పొందుతవి. ఒక [illegible] అంటే ఇంకోమాటగా వినబడుతుంది. 'అన్నీ చేశావులే' అంటే 'అన్నీ ఏడ్సావులే' అన్నట్లు వినబడుతుంది. 'ఇక ఊరుకో' అంటే 'నోరుమూసుకో' అన్నట్లు వినపడుతుంది.

[illegible]మాటల సాహచర్యమువలన, సాన్నిధ్యమువలన మంచిమాటలకే [illegible]లర్థం వస్తూఉంటుంది.

# కలహబీజము

కలహానికి బీజము అంటూ ఒకటి ఉంటుంది. కలహాన్ని ప్రేరేపింప గల సత్పదార్థము సూక్ష్మరూపంలో ఉన్నప్పుడు దానిని బీజము అంటాము.

అన్ని రకముల పోట్లాటలకూ ఈ బీజము ఒకచోట ఉండదు. ఒక ప్పుడు ఆ సత్పదార్థము ఎత్తుగడలోనే ఉంది. కలహోత్పత్తికి కారణం అవుతుంది. నాటకంలో నాందిలో నాటకవస్తువు అంతా క్లుప్తీకరింపబడి ఉన్నట్లు పోట్లాట ప్రారంభం కాగానే అనబడ్డ ఒకా నొక మాట కలహం బ్రహ్మాండంగా పెరిగిపోవడానికి సమర్థమైన దిగా ఉంటుంది. వేదాంతభాషలో దీనిని ఆరంభకారణవాదము అంటారు. అంటే, ఆరంభంలోనే కలహకారణం నిక్షిప్తమై యున్నట్టి పోట్లాట. (వాదము అంటే వాద ప్రతివాదములతో కూడిన పోట్లాట అని ప్రాకరణికార్థము.)

మరియొక రకము పోట్లాటలలో ఎత్తుకోవడములో వింతగాని, వైప రీత్యముగాని, ప్రతిభా ప్రదర్శనముగాని ఉండదు. కాని ఆరంభింప బడిన కలహము క్రమశః అంతై ఇంతై బ్రహ్మాండమంత అవు తుంది. చిన్న సెలయేరుగా బయలుదేరిన ప్రవాహము మహానదిగా ఎల్లాగ మార్పుజెందుతుందో, మందమందంగా బయలుదేరిన మలయ మారుతము ప్రళయఝంఝగా ఏ విధంగా మారుతుందో, అదేవిధంగా చిన్న చిన్న మాటలతో ఆరంభింపబడిన వాక్కలహము పెద్దపోట్లా టగా మారుతుంది.

ఈ పద్ధతికలహము ఆంజనేయుని తోకలాగ ఊరికే పెరిగిపోతుంది. సృష్టికూడా క్రమంగా పెరిగిందని ఒక సిద్ధాంతం ఉన్నది. ఈ వాదము

బహుళ ఆదరణను పొందడమేకాక బహుళవ్యాప్తిలో ఉన్నది. చాలా పోట్లాటలు ఈ నడకను నడుస్తవి. దీనిని వేదాంతులు పరిణామ వాదము అన్నారు.

ఒకప్పుడు వాద ప్రతివాదములు జరిగేసమయంలో ఒకరు ఏదో అంటే అది కోపంవచ్చే మాటగా భ్రమపడడమువలన పోట్లాటకు దారివచ్చి పెరిగిపోవడము జరుగుతుంది. ఇందులో భ్రమయే పోట్లాట వృద్ధిపొందడానికి కారణము. తాడునుచూచి సర్పము అని భ్రాంతి కలిగినట్లే సరసమైన వాక్కునుచూచి అది కఠినవాక్కుగా భ్రమపడడము ఇందులో ప్రధానవిషయము. ఇది వివర్తవాదము. ఈ వ్యవహారాన్నే ఆలంకారికులు భ్రాంతిమతి అలంకారంగా రూపొందించారు. ఇట్టి భ్రమను సంవాదిభ్రమ అన్నారు. అంటే వాదప్రతివాదాలలో ప్రదర్శితమయ్యే భ్రమ అన్నమాట!

కలహము ఎక్కడఉన్నా, కలహం రూపము ఏమీ మారదు. కలహవిధానము మారదు. అయినా వేదాంతులు కలహానికి బీజము ఎక్కడుందీ అనే చర్చ లేవదీసి తలలు బద్దలుకొట్టుకుంటూ ఉంటారు. మనకు ఆ సత్పదార్థము ఎక్కడున్నా ఒకటే.

భార్యా భర్తలు మాట్లాడుకొంటున్నారు. భర్త అన్నాడు "నీవు 'ఫూలిష్' లాగ మాట్లాడుతున్నావు" అని! భార్య వెంటనే "అల్లాగ మాట్లాడకపోతే మీకు అర్థమై చావదాయె. అందుకనే అట్లా మాటాడుతున్నాను" అన్నది.

ఈ మాటలు అన్నతరువాత భర్త నేను అంత తెలివితక్కువవాణ్ణా! అని పోట్లాడక తప్పదుగదా!

ఇందులో కలహానికి కారణము ఆరంభంలో ఉన్నది! ఇది ఆరంభవాదము. ఇల్లాగే మిగిలినవి ఊహించుకోవాలె.

కలహం సడపటానికి కావలసిన శక్తినిగురించి ఒకటి రెండు విషయాలన్నా వ్రాయకపోతే ఇది శాస్త్రగ్రంథం అనిపించుకోదు. అంతా

పోట్లాడుతూనే ఉంటారే. ఈ శక్తి ఎట్టిది? శారీరికమా. మానసికమా అని ప్రశ్న!

ఇది శారీరికము కాదు. ఎందుచేతనూ అంటే మిక్కిలి బలహీనులైన వాళ్ళుకూడా గంటలకొద్దీ పోట్లాడ గలిగి ఉండడము మనము చూస్తూనే ఉన్నాము.

ఇది మానసికమూ కాదు. ఎందుచేతనూ? మందబుద్ధులూ. తీవ్ర బుద్ధులూకూడా పోట్లాడుతారు కనుక.

అందుకని ఇది యొక విచిత్రశక్తి అని చెప్పాలి. ఇది ఇట్టిది అని నిర్వచించలేము. ఇది దేశకాల వస్తు భేదముల అపరిచ్ఛిన్నము. సర్వ వ్యాపి. కాలాతీతము.

ఈ శక్తి అజ్ఞానంవల్ల వచ్చేదీకాదు. జ్ఞానంవలన పోయేదీకాదు. ఒక్కటిమాత్రము నిజము. ఆ శక్తి విజృంభించినపుడు మనుష్యుడు ఆ శక్తికిలోబడి. తాను ఏమి చేస్తున్నదీ తెలుసుకోలేనిస్థితిలో ఉంటాడు.

ఇంకో విషయం ఏమిటీ అంటే ఈ శక్తి అభ్యాసం చేస్తే వచ్చేది కాదు. జన్మతః కలగాలిసిందే.

కాబట్టి ఇది ఆత్మకు సంబంధించిన శక్తి అని ఒప్పుకోక తప్పదు.

మనిషిలో ఈ శక్తి ఎప్పుడూ గుప్తంగా ఉంటుంది. కట్టెలో మండే శక్తి దాక్కుని ఉన్నట్లు! అగ్ని సాన్నిధ్యం లేనప్పుడు కూడా కట్టెలో మండేశక్తి ఉన్నదన్న మాటె! ఎట్లా ఉన్నది? నిగూఢం గానూ. రూపరహితంగానూ ఉన్నది. అట్లాగే మనిషిలో కూడా ఈ శక్తి ఉన్నది. భార్య కాపరానికి వచ్చిన తరువాత కొన్నిరోజులకు. సంసారంలో వేడి ఎక్కువైన తరువాత మనిషికి ఈశక్తి సాక్షాత్కరిస్తుంది.

దేనికైనా కారణాలు రెండు రకాలుగా ఉంటూ ఉన్నవి. నిమిత్త కారణము. ఉపాదాన కారణమూ అని। భార్యాభర్తల మధ్య ప్రజ్వ

ఇట్టి ఈ కలహాగ్నికి నిమిత్త ఉపాదాన కారణాలేవీ అని ప్రశ్న వస్తుంది.

నిప్పువలన కట్టె మండింది. అక్కడ అగ్నిసాన్నిధ్యం నిమిత్త కారణము. మండేశక్తి ఉపాదాన కారణము.

అల్లాగే భార్యాభర్తల మధ్య వచ్చే పోట్లాటలు కామక్రోధాదుల ప్రేరేపణవలన వస్తవి. ఈ ప్రేరేపణ నిమిత్త కారణాలు కట్టెలో మండే శక్తి ఎల్లాగుంటదో, అల్లాగే మనిషిలో కూడా మండిపడే శక్తి ఉన్నది. అది ఉపాదాన కారణము.

ఈ కలహాశక్తిని అగ్నితో పోల్చడము ఎంతైనా సమంజసము. ప్రేగుణాలు అని ఉన్నాయి. అందులో ఒకటి కలహాగ్ని. ఆ కలహాగ్నియొక్క బలమువలననే మనిషి కలహములయందు ఆసక్తుడు అవుతున్నాడు. అందుకనే భార్యను అగ్నిసాన్నిధ్యంలో అగ్నిసాక్షిగా స్వీకరిస్తాడు.

ఈ కలహాశక్తిని అంటిపెట్టుకొని మరి రెండు శక్తులు ఉన్నవని చెపితే. మరి ఈ ప్రకరణంతో చెప్పవలసిందంతా చెప్పినవాణ్ణి అవుతాను. ఏవి ఆ శక్తులు? అంటే. ఒకటి ద్రవశక్తి. రెండోది దాహశక్తి. మనుష్యుడు పోట్లాడుతూనే కళ్ళవెంట నీరు కారుస్తాడు. ఇది ద్రవశక్తి ప్రేరేపణ. మధ్య మధ్య నీళ్లు తాగుతూ ఉంటాడు. ఇది దాహశక్తి ప్రేరేపణ.

ఈ కలహాశక్తి కొందరిలో ఎక్కువగానూ. కొందరిలో తక్కువగానూ ఉండడము మనం చూస్తున్నాము. కారణం ఏమిటీ అంటే ప్రారబ్ధ విశేషం అంతే.

ఈ శక్తి మనుష్యునిలో సర్వకాల సర్వావస్థలయందు అంతర్గతంగా ఉంటుంది. మృత్తునందు ఘటము ఉన్నట్లుగా, ఒక విధమైన అవ్యక్తావస్థలో ఈ శక్తి ఉంటుంది.

ఈ శక్తి శాశ్వతమైనదీ, సత్యమైనదీ అని గ్రహించవలయును. ఈ శక్తి బహిర్గతం కావడములో శబ్దసంబంధమైన అనేక రూపాలను పొందవచ్చు. మృత్తు. బాన. కుండ. చట్టి. పిడత. ప్రమిద అని అనేక రూపాలను పొందినట్లు ఈ శక్తి అనేకములైన కలహాలుగా సాక్షాత్కరిస్తుంది. ఆ రూపాలేవో విచారిద్దాము.

ఈ కలహశక్తి (1) తెరచాటున ఉపన్యాసము లేక సాధింపు. (2) చీత్కారము, (3) బెదరింపు, (4) సణుగుడు. (5) కోత అను అను అయిదు స్వరూపాలలో అభివ్యక్తం అవుతూ ఉంటుంది.

ఏ రూపం దాల్చినా అసలు మూలపదార్థము ఒక్కటే. మనుష్యులు అనేక రకాలుగా ఉన్నారు. ఉపాధిభేదంచేత వీరు. వీరు అని వేరు పరుస్తున్నాము. కాని వారి అందరిలోనూ గల జీవాత్మస్వరూపం ఒకటే. ఒకటే జీవాత్మ యిన్ని రూపాలు పొందినట్లు కలహశక్తి అనే ఒక సత్పదార్థము ఇన్నిరూపాలతో భాసిస్తూ ఉన్నది:

# కలహ భేదాలు

## 1. సాధింపు

స్త్రీశక్తి అయిదు రకములైన పోట్లాటలుగా అభివ్యక్తం అవుతుందని క్రిందటి ప్రకరణంలో చెప్పాను. ఈ అయిదు రకాలలోను సాధింపు అనబడే దానికి ప్రథమ స్థానం ఇచ్చినాను.

స్త్రీశక్తి ఈ సాధింపు అని పిలువబడే ప్రక్రియలో చాలా మంద[illegible]ంచగా ప్రదర్శిత మౌతుంది.

సంగీతశాస్త్రంలో మందరస్వరం ఎట్లాంటిదో కలహ శాస్త్రంలో సాధింపు అల్లాంటిది. ఇక్కడ కలహం కాశీవద్ద గంగానదివలె, [illegible]ంచగతిని పొందటము మనము గమనింపతగిన విషయము.

సాధింపులో కలహశక్తి లేతరంగులో ప్రకాశిస్తుంది.

[illegible] చిన్న పొరపాటు జరిగితే దానిని బ్రహ్మాండమైన తప్పుగా నిర్ణ[illegible]ంచి. దాని వలన రాగల ఆపత్తు ఒకటి ఊహించి, అది వచ్చి[illegible]నట్లే భావించి, భర్తను నిందించడము అనే ప్రక్రియనే సాధింపు అంటారు.

మగవాళ్లు సాధించలేరు. ఈ సాధింపు జయప్రదంగా జరపడం ఆడవాళ్ళకే తెలుసు.... ఈ ప్రజ్ఞ స్త్రీకి మాత్రమే ఉన్నది. మంత్ర శాస్త్రజ్ఞులు దీనికే స్త్రీవిద్య అని పేరుపెట్టి బోలెడంత గ్రంథం వ్రాశారు.

[illegible] రోజులలో ఈ సాధింపు నాలుగు రకాలుగా ఉంటూ ఉండేది. దానికే సాధన చతుష్టయము అని పేరు. సాధింపుకే సాధన అని మరో పేరు. సాధింప బడేది సాధన.

అసలు విషయము ఏమిటో, దేనిని గురించి ఇంటావిడ అసంతృప్తిని పొందినదో, ఏ విషయము ఆమెను బాధ కలిగించినదో, ఏది ఆమె మనఃక్లేశమునకు కారణమైనదో చెప్పక తన అసంతృప్తిని మాత్రమే వెల్లడించడమే ఈ సాధింపుయొక్క ప్రధాన లక్షణము ... ఈ సాధింపు అనేక రకాలు.

గొడుగు పారేశాడు ఒక భర్త. భార్య మొదలు పెట్టింది. "గొడుగు పారేశారుటండీ! మొన్ననే కదండి కొన్నది! కొత్త గొడుగు! ఆ గొడుగు పారేయడానికి మీకు చేతు లెట్లా వచ్చినైయండీ!"

'పారేయాలని పారేశానా?' అంటాడు ఆయన.

"ఆఁ....పారేయాలని పారేయకపోతే, అయ్యో, గొడుగు పోయిందే అని అనుకోనైనా అనుకోరేం మరి! చీమ కుట్టినట్లు అయినా లేదే మీకు!

"అసలు మీ చేతుల్లో గొడుగు ఉంటుందా! పసివాడి చేతిలో గారె ముక్క ఉంటుందా! తీసికెళుతున్నప్పుడే అనుకొన్నా దీన్ని ఎక్కడో పారేసి వస్తారని!

"అయ్యో నిక్షేపంవంటి గొడుగు! పది రూపాయలు! నేను రెవికలు కుట్టించుకుంటానండీ అని మొత్తుకున్నా వినక, గొడుగు కొంటిరి. అయిదు రెవికలన్నా వచ్చేవి! ఒక సంవత్సరంపాటు రెవికలకు ఇబ్బంది లేకుండా ఉండేది. మీ రెందుకు వింటారు! ఇంట్లో డబ్బు ఉంటే నేను రెవికలు కొనుక్కుంటానని మీకు తెలుసు. నాకు రెవికలు లేకుండా చేయాలనేగా మీరు గొడుగుకొని, పారేశారు. రేపు ఆఫీసుకు ఎల్లా వెడతారు? వానాకాలం కూడాను." "ఏం, తడిస్తే తడుస్తానులే."

"అవునవును, మీకేం మీరు వానలో తడిసి, జ్వరం తెచ్చుకొని దర్జాగా పడుకుంటారు. చెయ్యలేక నేను చావాలి. మీరు ఏమి చేసినా నన్ను అవస్థ పెడదామనేగా!

"పిల్లలు బడికి ఎల్లా వెడతారు! వాళ్లు తడుస్తారు! వాళ్ళకూ జ్వరాలు వస్తాయి! ఇంటిల్లిపాదీ జ్వరాలతో పడుకొని ఊరుకొంటే చెయ్యకేం చేస్తాననేనా మీ ఊహ. ఎన్ని దురుద్దేశాలు లేకపోతే నిక్షేపంలాంటి గొడుగు పారేసి వస్తారెండి!

"మా అన్నయ్య సంవత్సరం నుంచి జబ్బుతో తీసుకొంటున్నాడు. [illegible] రూపాయలు వాడికిస్తే మందు పుచ్చుకునేవాడు. దాంతో జబ్బు కూడా నయం అయ్యేది! అట్లానైనా చేయకపోతిని. ఏదీ చేయనిస్తేనా! ఆలోచించ నిస్తేనా. అడిక్కున గొడుగు కొను క్కొస్తిరి! అసలు మీకు మా అన్నయ్య బ్రతకాలని ఉంటే గొడుగు ఎందుకు కొంటారు లెండి! పోతేపోయినాడని అనుకొనే గొడుగు కొనుక్కొచ్చారు.

"మాట్లాడుతారేమో! ఎందుకు మాట్లాడుతారు! అంతా నా మాటలు విని, ఈవిడ ఎంత గడుసు మనిషిరో అని అనుకోవద్దూ! అందుకనే మీరు మాట్లాడకపోవడము. మీరు నోరు మూసుకొని, నన్ను కోత కోస్తున్నారు.

"అబ్బ! నిద్రపోనియ్యి."

"ఎప్పుడొద్దన్నారు! నిద్రపోండీ, మహారాజులాగా పొండి. గొడుగు పోయింది! నాకు రవికలు లేకుండాను పోయినవి! మా అన్నయ్యకు జబ్బు నయమూ కాదు! ఇంకేం మీకళ్ళు చల్లబిడ్డవిగా హాయిగా నిద్రపోండి.

"నిశ్చింతగా ఎట్లా నిద్రపోయినారు! అప్పుడే గురకకూడా పెడుతున్నారు."

"ఏం మనిషో అబ్బ!"

ఇది ఒకరకము సాధింపు.

ఇప్పుడు ఈ సాధింపుయొక్క ప్రధానలక్షణా లేమిటో, దాని తత్వము. ప్రయోజనాలు-వీటినిగురించి ఆలోచిద్దాము.

సాధింపు అనబడే ఈ కలహప్రక్రియకు సంబంధించిన మూడు విషయాలు ప్రతిగృహస్థూ ముందుగా తెలిసికోవడము అవసరము. ఈ మూడూ మూడు ముఖ్యాంగములు. ఈ అంగములనుగురించి సంపూర్ణజ్ఞానము ఉన్నపుడే ఈ ప్రక్రియ జయప్రదంగా సాగుతుంది. (1) విషయము (2) అధికారము (3) ప్రయోజనము అనేవే ఆ ముఖ్యవిషయాలు.

ఈ ప్రక్రియ జరపడానికి అధికారి ఎప్పుడూ స్త్రీయే. పురుషునికి ఆ ప్రక్రియజరిపే అధికారం లేదు. సర్వ కలహప్రపంచానికి స్త్రీ మూర్తియే అధిష్ఠానదేవత.

విషయము ఏదైనా కావచ్చు గొడుగు పారవేయడమూ, ప్రయాణంలో ఒక తువాలాగుడ్డ ఎక్కడైనా మరచిపోయి రావడమూ, గుండీలు పారవేసుకోవడమూ, గడ్డం చేసుకోకపోవడమూ, వంకాయలు ఎక్కువధరపెట్టి కొనడమూ, ఇటువంటిది ఏదైనాసరే సాధింపుకు వస్తువుగా గ్రహింపవచ్చును.

ఈ సాధింపువలన ఇరువురికీ కలుగగల ప్రయోజనాలను గురించికూడా తెలుసుకొందాము.

(షేక్స్పియరు కరుణనుగురించి వ్రాస్తూ అది ఇచ్చినవాడికీ, పుచ్చుకొన్నవాడికీ కూడా మేలు చేస్తుందన్నాడు) ఇదీ అంతే.

సాధింపు గంగా స్నానాలవలె సకల మనోవైక్లబ్యమునూ కడిగి వేస్తుంది. కోపం అంతా ఆ రూపంలో వెళ్ళిపోయిన తరువాత స్త్రీమూర్తి కడిగిన ముత్యంలాగ కళకళలాడుతుంది. ఆమె ఆత్మ ప్రకాశిస్తుంది.

ఇక కర్మ అయినవాడు, అనగా క్రియయొక్క ఫలితమును పొందిన వాడి సంగతి. భార్య సాధిస్తున్నప్పుడు భర్త నోరుమూసికొని వింటాడేకాని నోరుతెరచి ఒక్కమాటకూడా మాట్లాడడు. ఆమె అనేమాటలన్నీ వింటూ ఊరుకొంటాడు. కోపాన్ని అణచుకొంటూ ఉంటాడు. ఈ ప్రవర్తనవలన అతని నిగ్రహశక్తి వృద్ధి అవుతుంది.

నిగ్రహశక్తి వృద్ధిఅవడమేకాక అతడు, అంటే ఆ సద్గృహస్థు,
కామక్రోధాది దుర్గుణములను జయించినవాడు అవుతున్నాడు.

అతనికి ఈ సాధింపువలన సంసారమునందు విరక్తికూడా కలుగు
తుంది. ఈ విరక్తి కలగడము చాలా మంచిది. ఎందుకంటే విరక్తి
కలిగగానే పరమార్థ చింతనమునందు ఆసక్తి కలుగుతుంది. ఆటు
తరువాత అతడు నిజమైన సన్యాసి కావడానికి ఎంతోకాలం పట్టదు.

సాధింపు వినుటవలన శ్రవణేంద్రియములకు పరిశ్రమకలిగి అవి
సానపెట్టిన కత్తులవలె శక్తిమంతములు అవుతవి.

ఎవరైతే గృహిణిచే జరుపబడు సాధింపును వింటాడో అతడు
'వినుట' అను క్రియయందు అధికారమును సంపాదిస్తాడు. దీనిని
నోరెత్తకుండా విన్నవాడు, ఏదైనా వినగలడు. ఆశక్తి వచ్చినపుడే
మనుష్యుడు వేదాంతశ్రవణానికి అధికారము గలవాడు అవుతున్నాడు.
ఈ సాధింపు ఎప్పుడు జరగాలె, ఎంతసేపు జరగాలె అనే ప్రశ్న
ఒకటి ఉన్నది. అది ఎప్పుడైనా జరగవచ్చు. కాని రాత్రి భోజనాలు
అయిన తరువాత, తీరికగా జరుపుకోవటమే అన్నిటికీ వీలు.

ఇక నే, ఎంతసేపు జరగాలె అన్న ప్రశ్న ఒకటి ఉన్నది.

గృహిణి నోరు నొప్పి పుట్టడము, అలసిపోవడము, నిద్రరావడము మొద
లైన ఆటంకాలు వచ్చి ఆగిపోయినదాకా ఈ సాధింపు సాగుతూ
ఉండడము సంప్రదాయ ప్రసిద్ధము.

ఎంతసేపు సాగినా, భర్తమట్టుకూ నోరు మూసుకొని ఊరికే చూస్తూ
ఉండవలసిందేగాని పెదవి విప్పి పలుక కూడదు.

ఇట్లా మౌనముద్ర వహించిన భర్త మంచముపైన పడుకొని నిద్రా
దేవిని ధ్యానంచేస్తూ ఉండాలె. తలక్రింద దిండు ఒకటి ఉండడము
అవసరము.

గృహస్థు అయినవాడు ఒకటి రెండు దిండ్లు సంపాదించి ఉంచుకో
వాలి. దిండు ఉండడము వలన చాలా ప్రయోజనాలు ఉన్నవి.

మొదటిది : గృహస్థు ఎంత ఎక్కువగా కన్నీళ్లు కార్చినా దిండు పీల్చేస్తుంది. ఈ విషయం రెండో కంటివాడికీ తెలియకుండా కాపాడు తుంది. రెండు : దిండుపైనున్న తలలోకి మంచి మంచి ఆలోచనలు వస్తవి. మూడు : శరీరావయవములలో శిరస్సు ప్రధానమైనది కాబట్టి అట్టి శిరస్సుకు ఒక రక్షణ ఉండడము ఎందుకైనా మంచిది. శత్రువు పైకి దుమికినపుడు ఆ వైపునుండి దెబ్బలు తగలకుండా అడ్డు పెట్టు కొనటానికి దిండు మంచి సాధనము.

ఈ సాధింపు మనస్సుకు కష్టం కలిగించేమాట నిజమే. అట్టి మనః క్లేశము కలుగకుండా చేసుకొంటానికి గల ఉపాయంలో కొన్ని మీకు చెబుతాను.

సాధింపుకు గురియైనవాడు మాటలు వినిపించుకో కూడదు. శ్రవణ శక్తిని అదుపులో ఉంచడము నేర్చుకోవాలె. సాధనచేస్తే ఈ శక్తి లభిస్తుంది.

ఇంటావిడ సాధిస్తున్నంతసేపూ చెవులలో దూదిపెట్టుకోవాలి. ఆమె మాటలు వినపడకుండా చేసుకొనుటతో ఈ సాధన ప్రారంభించాలె. కొన్నాళ్ళయిన తరువాత ఆ మాటలు వినపడవు.

గృహస్థు అయిన వాడికి పెళ్ళాము కాపురానికి వచ్చిన కొద్దిరోజులకే ఇట్టి కాలిక బధిరత్వము సహజంగానే సంప్రాప్తం అవుతుంది. ఈ బధిరత్వము ఒక నిర్ణీతకాలమునకు ఒక నిర్ణీత విషయానికి మాత్రమే పరిమితము. అంటే ఇంటావిడ సాధిస్తున్నంతసేపూ వినపడదు. ఇంటావిడ మాటలు మాత్రమే వినపడవు.

ఇల్లాగ పైన చెప్పిన విధంగా సాధింపుకు సద్గృహస్థు తట్టుకోవడము నేర్చుకోవాలె.

ఈ సాధింపు మొదట్లో కొంత కష్టంగానే ఉంటుంది. కాని బాగా అల వాటైన వాడికి అది లేకపోతే తోచదు.

ఒకాయన, సాధింపు బాగా అలవాటైనవాడు. ఒకసారి పొరుగూరులో హోటలులో భోజనం చెయ్యాలిసి వచ్చింది. వెళ్ళాడు. ఆ హోటలు యజమాని వయసులో ఉన్న స్త్రీ.

అన్నం వడ్డించింది. కూరలు వేసింది. ఆయన ఉపక్రమించరే!
"ఏమండీ! ఇంకా ఏమి వేయమంటారు?" అని అడిగింది ఆమె.
"కొత్త ఆవకాయవుంటే కాస్త వడ్డించండి" అన్నాడు. ఆమె తెచ్చి వేసింది. దోసకాయపచ్చడి కాస్త వేయమన్నాడు. ఆమె వేసింది.

అప్పడం కావాలన్నాడు. ఆమె అప్పడం కూడా వడ్డించింది.

ఆయన ఇంకా చూస్తూ, ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. భోజనం ప్రారంభించలేదు.
"ఏమండీ! భోజనం చెయ్యరేం? ఇంకా ఏమి కావలె?" అన్నది.

"ఏమీ అక్కరలేదు. కాని అల్లాగ నా యెదురుగా నిలబడి, కాసేపు నన్ను సాధించండి. అది నాకు అలవాటు—అది లేకపోతే నాకు అన్నం సహించదు" అన్నాడట!
సాధింపు బాగా అలవాటైన తరువాత, అది లేకపోతే అన్నమూ సహించదు. నిద్రా పట్టదు.



# కలహ ప్రక్రియలు



కలహప్రక్రియలలో మొదటిది సాధింపు అన్నానా. రెండవది చీత్కారము. ఇది కోపముయొక్క ఒకానొక రూప విశేషము. కోపము గడ్డకట్టుకొనిపోతే చీత్కారము అవుతుంది. ద్రవిస్తే సాధింపు అవుతుంది.

ఇది కూడా స్త్రీవిద్యకు చెందిన విషయమే.

భర్త ఏదైనా ఒక ప్రశ్న అడిగితే దానికి వెంటనే సమాధానం చెప్పక, రెండు మూడుసార్లు అడిగినా ఊరుకొని, చివరకు విసుగా చీదరించికొంటూ యీడంచే యీడింపుకే చీక్కారము అని పేరు.

భర్త భార్యను అడుగుతాడు : "ఉత్తరాలు ఏమైనా వచ్చాయా:''

సమాధానము లేదు.

''ఉత్తరాలు ఏమైనా వచ్చినయ్యా అని అడుగుతున్నాను.''

"ఏమో!"

ఈ ఒక్కమాట చీదరింపుగా అంటుంది. ఆ అనే సద్దతి వలన దాని స్వభావం తెలుస్తుంది. ఈ అనడము ఏదైనా ఒక వస్తువు ముఖాన విసిరికొట్టినట్లు ఉంటుంది.

ఆత్మదూషణ అనేది ఇంకో రకం ప్రక్రియ దీనినే సణుగుడు అంటాము. ఇందులో స్త్రీ తననూ. తన అదృష్టాన్నీ ఎక్కువగా నిందించుకొన్నట్టు కనపడుతుంది. కాని భర్తపైన పడాల్సిన వన్నీ పడుతూనే ఉంటవి.

"ఒక్క చీరగుడ్డ కొనియ్య మంటే నానాగోలాను? నాకు కొనియ్యడం దగరకొస్తేనే ఎక్కడలేని దరిద్రం వస్తుంది.

"డబ్బంతా నా బొందమీదే పెడుతున్నారా! నా పొట్టకోసమే అవుతున్నదా ఈ ఖర్చు అంతా?

"అంతకూ నా ముఖాన ఇట్లా వ్రాసి ఉంచే ఆయనమటుకు ఏం చేస్తాడు!

"ఏదో దాసీదానిలాగ చాకిరీచేస్తే ఇంత తిండి పెడుతున్నారు. పని చేసేదైనా ఒక గుడ్డముక్క ఇయ్యంది ఊరుకోదు! నాకు అదీలేదు!" ఇలా సణుగుడుకు అంతూ పంతూ వుండదు.

ఇక కోత ప్రక్రియ గురించి. ఈ రకము ప్రక్రియ జరుపుతున్నప్పుడు కొయ్యడమే జరిగే పని. రంపపుకోతే!

"చిన్న మెత్తు బంగారం లేదు. మెడలో పసుపుకొమ్ము కట్టుక తిరుగుతున్నాను. ఈ మాత్రం సుఖపెట్ట లేనివాళ్ళకు పెళ్ళి పెటాకులూ ఎందుకో? ఇట్లా బ్రతికేకంటే ఏ పాడు నూతిలోనో పడి చస్తేనే మేలు!"

ఈ మాటలు గంట కొకసారి అనకపోతే అది కోత కాదు. స్త్రీ ఈ మాటలనుగానీ, ఈ అర్థంవచ్చే మాటలనుగానీ, ప్రొద్దున కాఫీ ఇచ్చేటప్పుడు, మధ్యాహ్నం అన్నం పెట్టే సమయంలో, ప్రొద్దుగూకులూ, తెల్లవార్లూ మొగముండా వాడు చచ్చిందాకా అంటూనే ఉంటుంది. పొడిచి పొడిచి చంపడమే ఇందులో విశేషము. ఈ ప్రక్రియ వలన కలిగే బాధ అనుభవించినవాడికే తెలియాలె గాని ఇతరులు ఊహించడానికి కూడా సాధ్యం కాదు.

తనేదో మహా కష్టపడుతున్నట్లూ, మగవాడు పెట్టే బాధలు తాను చాలా భరిస్తున్నట్లు, తన యోగ్యతనూ, ఓర్పునూ ఇతరులు గుర్తించనట్లూ, ఎడా తెరిపి లేకుండా అనాలె. సుఖంగా మనిషిని తిననియ్యకూడదు. నిద్ర పోనీయకూడదు. ఊపిరి సలుపకుండా కొయ్యాలె. తనకు కావలసింది వచ్చిందాకా మనిషిని కోస్తూ ఉండాలె. ఇది వాచికసంబంధమైన క్రియ. కొందరు స్త్రీలు ఈ ప్రయోగము వలన తమతమ పనులు సాధించుకో గలుగుతున్నారు. ఇది ఒక

పాట! ప్రౌద్ధ న్తమానమూ ఒకటే పాట! స్వరము మారినా, రాగం మారినా, సాహిత్యం మారదు.

ఈ కోత భరించలేక కొందరు సన్యాసులలో కలిసిపోతారు. కొందరు విషం పుచ్చుకొని చస్తారు. కొందరు జీవితం అంతా ఏడుస్తూ ఉంటుంటారు.

అయితే ఎంత కోసినా వినిపించు కోక పోవడము, చిరునవ్వుతో సహించి ఊరుకోవడమూ దీనికి విరుగుడు.

సోక్రటీసు అంత వాడికి భార్యవలన కోత తప్పలేదు.

స్థలాభావముచేత మిగిలిన ప్రక్రియల సంగతి వదిలేస్తున్నాను. అసలు కొన్ని ప్రక్రియలు తెలిసినచో ఇక మిగిలినవి ఎల్లాగుంటవో సులభంగా ఊహించుకోవచ్చు.

ఈ అయిదు కలహప్రక్రియలే ఉన్నవి, ఇంక ఏమీ లేవు అనుకో కూడదు. ఆడది తెలివైన దైతే రకరకాలుగా కలహం జరుపుతుంది. భర్తను ఏడిపించడానికి ఎన్నో క్రొత్త ప్రక్రియలను కని పెడుతుంది. శ్రీమతి మాలతీ చందూర్ క్రొత్త క్రొత్త పిండివంటలను గురించి వ్రాస్తుంది గాని, క్రొత్త రకంగా మొగుణ్ణి ఏడ్పించడాన్ని గురించి వ్రాస్తే బాగుండు. ఎట్లాగైనా ఈ విషయంలో స్త్రీలబుద్ధి పనిచేసినట్లు మగవాడి బుద్ధి పనిచేయదు. అందు కని నేను ఇట్లా అడుగుతున్నాను.

# కలహా విధానము

## పూర్వభాగము

ప్రణయ కలహం జరిపే పద్ధతి ఒకటుందని అందరికీ తెలుసు కదా! అట్లాగే నాటుకలహాలు జరిగేపద్ధతీ ఒకటుంది.

ప్రణయ కలహం విషయంలో ''శయ్యారచన, పాదతాడనము, ద్వార గమనం'' అని ఇల్లాగ ప్రకరణాలున్నవి. అల్లాగే నాటుకలహం కూడా ''బీజము, ఆరంభము, అపవాదము, తోటకము, సంఘటము, మౌనము, ధ్వని, వజ్రము, గునుపు''—అనబడే తొమ్మిది ప్రకరణాలలో నడుస్తుందని నేను కనిపెట్టాను.

ఈ నాటుకలహాలు పెళ్ళిఅయిన క్రొత్తరోజులలోరావు. కొంతకాలం పోయినతరువాతనే వస్తవి. మొదటి రోజులలో భర్త భార్యను ఉద్దేశించి ''ఓ నా రంగులపిట్టా!'' అని పిలుస్తాడు. ఆ పిట్ట అతనిచే ప్రేమగా నిమరబడి తన్మయతను చెందుతూ ఉంటుంది. కొన్నాళ్ళు అయిన తరువాత ఆ పిట్టే మగ పిట్టను ముక్కుతో పొడుస్తుంది.

అందుకనే భార్యావిధేయుడైన భర్తను పిట్టచే పొడువబడినవాడు (Henpecked Husband) అంటారు.

ఇక కలహం నడిచే విషయము తీసుకొందాము. కలహానికి ముందు బీజము ఉండాలె. శూన్యములో నుంచి ఏదీ పుట్టదు. ఈ బీజమును గురించి ఇదివరకే చెప్పాను.

మద్రాసు చాల తొందరపనిమీద వెడుతూఉన్న భర్తతో భార్య అంటుంది: ''చూడండి ఎట్లాగూ అటు వెడుతున్నారుకాబట్టి దారిలో బెజవాడలోదిగి మా అక్కయ్యగారిని చూచి వెళ్ళండేం!'' ఈ ఒక్క వాక్యంలోనే కలహోత్పత్తికి కావలసిన సత్పదార్థము ఉన్నది.

అతడు దిగడానికి వీలులేని పరిస్థితులున్నవి. ఆ సంగతి తెలిసికూడా ఆమె అలాగ అనడంలో కలహానికి కారణం కల్పిస్తున్న దన్న మాటే; అదే బీజము.

భర్త ఏమంటాడు: "నేను తొందరపనిమీద వెడుతున్నాను బెజవాడలో దిగడానికి వీలుండదు" అంటాడు. ఆ మాట అనడంతోనే ఆమెకు చుర్రుమంటుంది. పోట్లాట ఆరంభ మవుతుంది.

కాబట్టి ఈ మాట కలహానికి ప్రారంభకారణము అయిందన్నమాట.

ఆమె ఏమంటుంది? - "టైముకేం లెండి; కావాలంటే ఉంటుంది. అక్కర లేదనుకొంటే ఉండదు. అపేక్ష లుండాలె ఇంతకూ" ఇది కలహానికి మొదలు. భర్తపైన ఒక అపవాదు వేసింది.

తరువాత భార్య అన్నమాట భర్తకు సూదిపోటు అవుతుంది. అపశంగా "ఛా నోరుముయ్యి" అన్నాడా: కలహం భగ్గుమంటుంది. కొంచెం సంస్కృతిగల కుటుంబాలలో భర్త అల్లాగ అనడు "ఎందుకే అల్లా అంటావు అన్యాయంగా; నీ మీద నాకు చచ్చే అపేక్ష ఉందని నీకు తెలియదా: నీ వంటే పడిచస్తాను. నీ మాట వింటాను. నీవు గీచినగీటు దాటటంలేదు. అపేక్షలేక నేనుచేసిన దేమిటి? నీ వన్నదీ కా దన్నదెప్పుడు? మొన్న చీర కొనమంటే కొన్నాను. వస్తూ వస్తూ రాచిప్పలు కొనుక్కొంటివి. పెనం కొనుక్కున్నావు. కుంపటికొన్నావు. నాకు రాగిచెంబుమాత్రం కొనియ్యమంటే కొనియ్య లేదు. నిజానికి నీకే నాపైన అపేక్ష లేదు" అని అంటాడు.

ఈ విధంగా సంభాషణ కొంతసేపు నడుస్తుంది. ఈ ప్రకరణంలో కలహం జరిపే భార్యాభర్తలు ఒకరిపై ఒకరు అపవాదులు చేసుకొంటారు. "మీరు ఎప్పుడూ ఇంతే. అప్పుడు అట్లా చేశారు. మరొకప్పుడు మరోలాగ చేశారు" అని ఆవిడ అనడమూ. "నీవు మటుకు చేయలేదా" అని ఆయన అనడమూ జరుగుతుంది. ప్రాత విషయాలన్నీ త్రవ్వి పోసుకుంటారు. ఒకరి నొకరు నిందించుకొంటారు. అప్పుడు ఒకరిపై ఒకరికి కోపాలువస్తవి. ఇదంతా రాబోయే కలహా

నికి పునాదివంటిది. ఈ పరస్పరదూషణ ఎంత బాగాజరిగితే రాబోయే కలహానికి అంతమంచి పునాది పడ్డదన్నమాట.

దాని తరువాత పోట్లాట తోటకము అనబడే ఘట్టంలో ప్రవేశిస్తుంది. ఇది మంచి రసవంతమైన ఘట్టము. పరస్పరము నిందించుకోవడము పరస్పర ధిక్కారములోకి దిగుతుంది. నీ వెంత అంటే నీ వెంత అనే పద్ధతిలో ఈఘట్టము నడుస్తుంది...."నీవు ఈ విధంగా మాట్లాడితివా నా పళ్ళు మండిపోతుంది. ఆ తరువాత ఏ మనుకొన్నా లాభము లేదు."

"నాకూ వస్తుంది కోపం."

"నీకు కోపంవస్తే నీవు ఏమి చేయగలవు?"

"మీరుమటుకు తలగొట్టి మొలేస్తారా ఏమిటి?"

ఇలాగ సంభాషణ పెరిగిపోతుంది. ఇద్దరికీ కోపాలు పెరిగి పోతవి. కోపాలు పెరిగిపోయినపుదే కలహం సంపీటము అనబడే ఘట్టాన్ని చేరుకొంటుంది.

ఈ ఘట్టములోకి కలహము ప్రవేశించడముతోనే ఆడదానికి కంఠము గాద్గదికమునుపొంది కన్నులు అశృపూరితములు అవుతవి. అశృపాతం జరుగుతుంది.

ఇదంతా చూస్తుంటే మగవాడికి ఒళ్లు మండిపోతుంది. "ఛా, ఎప్పుడూ ఇంతే. ఒక్క నిమిషము నీతో సరదాగా మాట్లాడద మంటూ లేదు గదా? నిమిషంలోకి మాట్లాటను పోట్లాటలోకి దించుతావు" అంటాడు. అప్పుడు ఆవిడ భర్తవంక కొఱకొఱా చూస్తుంది. అంతకంటే ఏం చేస్తుంది ఆ స్థితిలో?

మగవాడికి ఇంకా మండి పళ్లు కొరుకుతూ అంటాడు : "పాడుగోల! దరిద్రపుగోలవచ్చిపడ్డది! నాకు కోపంవస్తే మనిషిని కాదు తెలిసిందా?" స్త్రీ ఏమీ మాట్లాడదు. తలవంచుకొని లోలోన కుళ్ళుతూ ఉంటుంది. మగవాడు మటుకు ఆ పోట్లాట ఆ స్థితికి వచ్చిన తరువాత ఏమంటాడు? ఆవిది మాటకు మాట అంటిస్తూఉంటే పోట్లాటకు ఊపువస్తుంది. కాని ఆమె ఎప్పుడైతే ఏడుస్తూ కూర్చుందో, అప్పటితో మాటలతో సంబంధించిన కలహము అయిపోతుంది.

మగవాడు కాసేపు ఆ ఇంటావిడవంక కోపంగా చూచి రెండుసార్లు పళ్లు కొఱికి "ఛీ కొంపలో ఉండకూడదు" అని పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ బయటికి వెళ్ళిపోతాడు.

తాను పళ్లు కొరకడము, ఉత్తరీయము దూడించి వేసుకోవడము. 'ఛీ' అని విసుక్కోవడము, పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళి పోవడము చూచి తన భార్య హడలిపోతుందని అనుకొంటాడు ఆ భర్త.

కాని - ఆమె ఏమీ హడలిపోదు.

అప్పటికి ఏమీ అనకపోయినా ఆమెకూ తెలుసు ఆయన ఎక్కడికీ పోడనీ. సాయంత్రానికి మళ్ళీ తాళ్ళిచ్చుకొంటూ రాక మానడనీ. ఆమెకూడా కాసేపు అక్కడే కూర్చుని తరువాత కళ్ళనీళ్ళు తుడుచు కొని వంటయింట్లోకి వెడుతుంది. దీనితో కలహవిధానంలో మొదటి భాగం పూర్తి అవుతుంది. ఇది పూర్వభాగము అన్నమాట. ఇది శాస్త్ర దుడుకుగాను. వేగంగాను నడుస్తుంది. తరువాత ఉత్తరభాగం చాలా తమాషాగా. మెల్లగా నడుస్తుంది. అందుకనే దానినిగురించి ప్రత్యే కంగా చెప్పదలచాను.

# కలహ విధానము

## ఉత్తర భాగము

భర్త భార్యమీద ఆ విధంగా మండిపడి నిప్పులు కురిపించి వెళ్ళి పోయిన తరువాత ఏమి జరుగుతుందంటే ఆయన రాత్రి పొద్దుపోయిందాకా అక్కడా అక్కడా తిరిగి ఏ తొమ్మిది గంటలకో పదిగంటలకో కొంపకు చేరుకొని రుసరుస మంటూనే స్నానంచేసి, భోజనం చేస్తాడు. ఆవిడా భోజనం చేస్తుంది. కాని ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. ఇద్దరూ మౌనం వహిస్తారు. అందుకనే దీనికి మౌనప్రకరణమని పేరు.

ఇల్లాగ మాట్లాడకుండా ఉండాలనే పట్టుదల పురుషునియందుకంటే స్త్రీలోనే ఎక్కువ బలంగా ఉంటుంది.

ఇక్కడనుంచి ప్రకరణముఅంతా స్త్రీ పరంగానే నడుస్తుంది. స్త్రీ సర్వము అన్నమాట.

ఆ స్థితిలో స్త్రీ ఎల్లా ఉంటుందీ అంటే ఆమెకు శ్రవణేంద్రియాలు సరిగ్గా పనిచేయవు. అంటే అసలు వినపడకపోదు. అన్నీ వినపడుతై. కాని జవాబు చెప్పదు. నాలుగుమాట్లు అడిగినతరువాత ఏకపద పరిమితమైన ఒక జవాబు వస్తూ ఉంటుంది.

వంట అయిందా?

మాట్లాడదు.

వంట అయిందా అంటే?

అయింది.

రా వచ్చునా?

వచ్చు.

వేన్నీళ్లు ఉన్నవా?
లేవు.

ఇల్లాగ దాని తరువాత ఆమె క్రమంగా బిగుసుకు పోతుంది. జవాబులు ఏకాక్షర పరిమితములు అవుతవి. ఆమె కన్నెత్తి అయినా చూడదు.
వక్క పలుకున్నదా? - ఆ.

తమలపాకులూ? ఉహుఁ.

ఈ స్థితి ఎంతసేపు ఉంటుందో చెప్పలేము. ఒక గంట ఉండవచ్చు లేక ఒకరోజు ఉండవచ్చు. ఆ తరువాత పూర్ణమౌనము వస్తుంది. అప్పుడు ఆవిడను ఎంత మాట్లాడించినా మాట్లాడదు. ఏ వస్తువైనా కొనాలని అడిగినా జవాబు చెప్పక ఊరుకొంటుంది. ఎన్నిసార్లు అడిగినా, ఎంత మొత్తుకొన్నా జవాబు చెప్పకపోవడమే ఈ స్థితియొక్క ప్రధాన లక్షణం.

ఈ ప్రకరణం సక్రమంగా నడుపుకొంటానికి స్త్రీ చాలా కష్టపడుతుంది. అసలు ఆడదానికి మాట్లాడడమే నైజగుణము, మౌనము కాదు

ఉయ్యూరు కుమార రాజాగారూ, నేనూ, మరికొంత మంది స్నేహితులూ అంతా ఏదో సాహిత్యసంబంధమైన సమావేశంలో కలిశాము. ఆ సభలో ఒక సాహిత్య విషయాన్ని గురించి డా॥ అచ్చమాంబ గారు ఒక పది నిమిషాలు మాట్లాడినారు. ఆమెను అల్లాగ మాట్లాడమని ప్రోత్సహించింది కుమారరాజా గారు.

ఆదేదో చాల గొప్ప పనిలాగ భావించి తాను ఆ పని సాధించినందుకు కొద్దిగా గర్వపడుతూ రాజాగారు అన్నారు: "చూశారా అచ్చమాంబ గారిచేత పదినిమిషాలు మాట్లాడించాము!"

మా ముద్దుకృష్ణ అన్నాడు: "బాబుగారు ఆమెగారిచేత పది నిమిషాలు మాట్లాడించడములో గొప్ప ఏమీ లేదు. పది నిమిషాలు మాట్లాడకుండా ఉండేలాగున చేసినట్లైతే మేమంతా సంతోషించి మిమ్ములను అభినందించే వాళ్ళము!"

అంతా నవ్వుకొన్నాము అనుకోండి. ఇంతకూ ఎందుకు చెప్పానూ అంటే స్త్రీ మాట్లాడకుండా ఉండడము చాలా కష్టము. 'ఫిడేలు' చివరక్షరము తప్ప, ఇంకేదీ 'సైలెంట్' కాదు అని ఒక ఇంగ్లీషు రచయిత అన్నాడు.

స్త్రీకి అది పరీక్షాసమయము. ఈ ప్రకరణము జయప్రదంగా నిర్వ హించడానికి ఆమెకు బాహ్యేంద్రియ అంతరేంద్రియములను నిగ్ర హించే శక్తి కావలె. వికారముల నన్నిటినీ జయించాలె. నిర్వికార నిర్వికల్ప సమాధిలో ఉన్నట్లుగా ఉండాలె. అదేమీ సామాన్య విషయము కాదు.

ఈ సమాధిని పాడుచేద్దామని అనేక ప్రోద్బలములు వస్తవి. అనేక ప్రేరేపణలు వస్తవి. స్త్రీ ప్రత్యక్ష, పరోక్షావరోధములను త్రోసివేసి ఒకే విషయంపై మనస్సు లగ్నం చేయాలె. భర్తతో మాట్లాడ కూడదు. భర్తతో మాట్లాడకూడదు ఇది ఆమె ఆ సమయమున మననం చేయవలసిన మహా వాక్యము. అదే ఆమె ధ్యేయము. ఈ ధ్యేయము మీద మాత్రమే మనస్సును నిలిపి తదన్య విషయముపై మనస్సు పోనీయకుండా చేయాలె. దానినే సమాధి అనవచ్చు.

ఈ మౌనమే సమాధి అని నేను అంటున్నాను. కాని వేదాంతులు ఇది సమాధికాదు అంటారు. ముఖ్యంగా 'వ్యవహార మాధవీయము' అనే పుస్తకంలో ఇది సమాధి కాదు అని పదకొండు కారణాలు చూపి నిరూపణ చేసినాడు ఆ గ్రంథకర్త.

ఈ మౌనము మూడు రోజులు దాకా ఉంటుందని ఆయన అభి ప్రాయము. అసలు మూడు రోజులు మాట్లాడకుండా ఉండగలగడము ప్రపంచంలో ఉన్న తొమ్మిది అద్భుత విషయాలలో ఒకటి అవు తుంది అని నా వాదన.

రెండు రోజులో, మూడు రోజులో ఆ మౌనము ఉంటుం దను కొంటానికి ఏ మాత్రం వీల్లేదు. ఎందు కంటే, అంతకాలం మాటలు లేకపోతే జగడం చచ్చిపోతుంది. కలహాగ్ని చల్లారిపోతుంది.

మా జమదగ్ని శర్మ అంటాడూ "మీరు పూర్తిగా పొరపడుతున్నారు. ఉపసంహారం, శాంతి, ఇల్లాంటివి శాస్త్రోక్తంగా జరుగనిది కలహం అంతరించిపోదు. ఉంటుంది. సింహము చల్లని నీడను పడుకొన్నంత మాత్రాన దాని క్రౌర్యము పోతుందా! నెపోలియన్‌ను ఎల్బా ద్వీపములో బంధించారు. కొన్ని నెలలపాటు ఉన్నాడు. కాని ఆయనలో ప్రతాపాగ్ని చల్లారిందా! మనిషి నిద్రపోతున్నప్పుడు చలనము లేకుండా ఉన్నంత మాత్రాన మరణించాడని అంటానికి వీలుందా?

"అట్లాగే ఆ కలహము ఆ రోజుల్లో విశ్రాంతి తీసుకొంటున్న సింహం లాగ ఉన్నదన్నమాట! ఆ కలహము ఎల్బాలో చెరపడియున్న నెపోలియన్ అయినది."

"మనిషి నిద్రలేవడముతోనే చైతన్యవంతుడైనట్లు ఆ ప్రతిబంధకము వదలడముతోనే కలహము కూడా చైతన్యవంతము అవుతుంది" అని.

ఈ మూడు రోజులూ గడచిన తరువాత ఏమి జరుగుతుంది అని మళ్ళీ ప్రశ్న.

ఈ మూడు రోజులు గడిచేటప్పటికి స్త్రీ మెత్తపడుతుందనీ. కలహాగ్ని చల్లారుతుందనీ. ఆ తరువాత శాంతి జరుపుకొని మామూలు జీవితం లోకి పడిపోవచ్చుననీ ఒక వాదన ఉన్నది.

కాని అల్లాగ జరగడం చాల అరుదు. దాని తరువాత బోలెడంత కార్యక్రమము జరుగవలసి ఉన్నది. బోలెడు ప్రకరణాలున్నవి. అవన్నీ సక్రమంగా జరిగిన తరువాతగాని శాంతిస్థాపనకు అనుకూలం కాదు.

ఈ మూడు రోజులు గడిచిపోయిన తరువాత వచ్చేది ధ్వనిప్రకరణము. కలహం ధ్వనిప్రకరణంలోకి ప్రవేశించిన తరువాత దాని నడక ఎట్లా గుండేది చూద్దాం.

స్త్రీకి కోపం లోపలలోపల రాజుతూ ఉంటుంది. ఇంతవరకు కలహమువలన మనస్సులో ఏర్పడిన వికారము ధ్వనిరూపంగా ప్రకటి

తము అవుతుంది. ఈ వికారానికి, ధ్వనికి కార్యకారణసంబంధం ఉన్నది.

ఈ ధ్వనిప్రకరణము స్త్రీపరంగా నడుస్తుంది. స్త్రీయే ధ్వనికారకు రాలు.

ఆనందవర్ధనుడు ధ్వనికారుడు అంటారు గాని ఆయన ఈ ధ్వని సిద్ధాంతాన్ని తీసికొని రాక ముందు ఆ ధ్వని ఎక్కడుండేది? స్త్రీలను ఆశ్రయించుకొని వుండేది. వారి చేష్టలకు ప్రతిఫలంగా ఉత్పన్నమయ్యే చప్పుడులో ఉండేది.

స్త్రీ వస్తుతః ధ్వనివాది. శబ్దమునందు ఎక్కువ ప్రీతి కలది.

అసలు విషయానికొద్దాము. ఈ ధ్వనిప్రకరణము ఎట్లా నడుస్తుంది? స్త్రీ ధ్వనిని పుట్టిస్తుంది. భర్తపై తనకున్న కసిని తీర్చుకొంటానికి అనేక మార్గం:

ఆమె ఈ ధ్వనిని ఎల్లాగ పుట్టిస్తుంది? చెంబులూ, తప్పేలాలు మొదలైనవాటిని ఎత్తిపారేస్తుంది. కిటికీ తలుపులు విసిరి కొట్టుకొంటవి. లాంతరుగ్లాసులు పగిలిపోతవి. తలుపులు ఢమఢమా అని కొట్టుకుంటవి. సైకిల్ ఢాం అని పడిపోతూంది. బ్రహ్మాండమైన శబ్దంచేసి కాఫీ ఫ్లాస్కు బ్రద్దలుఅవుతుంది. ఈ విధంగా వివిధవస్తువులను ఉపయోగించి ధ్వని జనింపజేస్తుంది. స్త్రీ తన కోపమును ఈ విధంగా ప్రకటితం చేస్తుంది. ఇది ధ్వనిప్రకరణము.

ఇదంతా వస్తువుల కదలికవలన ఉత్పన్నమైనది. కాబటి దీనిని వస్తుధ్వని అన్నారు.

ఆమె ఇంకా ఏమిచేస్తుందీఅంటే పిల్లలను కొడుతుంది. వాళ్లు ఏడుస్తారు. ఆమె కొట్టడము, వాళ్లు ఏడ్వడమూ, ఆమె కోప్పడడమూ ఇవన్నీ జరుగుతున్నప్పుడు కరుణ, బీభత్స, భయానక రసాలు ప్రదర్శితమౌతవి. ఇది రసధ్వని.

ఈ ధ్వనిప్రకరణం పూర్తిఅయ్యే సరికి కలహాగ్ని కొంతచల్లారుతుంది. ఆ తరువాత కలహాము వజ్రము అనే మరోప్రకరణములోకి వెడుతుంది.

ప్రియజనుల యెడల స్త్రీ ఏవేవో ఎత్తిపొడుపు మాటలు మాట్లాడడమే ఈ ప్రకరణంలో జరిగే పని.

ఎవరైనా స్నేహితులు గాని, బంధువులు గాని వచ్చి "ఏమమ్మా! పండుగకు ఏమిచీర కొనుక్కున్నావు?" అంటే "చీర కొనుక్కున్నట్లే ఉన్నది నా బ్రతుకు. నా బ్రతుక్కు తోడు క్రొత్తచీర కూడానా? ఏదోలే ఇల్లా వెళ్ళిపోతే అదే చాలు!"

అని ఈ విధంగా తన అదృష్టాన్నిగురించి నిందించుకోవడం ఈ స్థితిలో జరుగుతుంది.

ఈ స్థితిలోనే ఇల్లాలు పిల్లలను అనవసరంగా కొట్టి "కొత్త చొక్కాలు ఎక్కడనుంచి వస్తాయర్రా! నా కోటి గతి ఉంది కనకనా మీకు కొనడానికి! ఆ ముద్దూ ముచ్చటా తీరే యోగం లేదురా!" అనడము సాగిస్తుంది.

ఈ వజ్రముఅనబడేది ఒకరకము సాధింపు. ఒకటి రెండు రోజులు జరిగిన తరువాత ఇదే క్రమంగా గునుపుగా మారుతుంది. క్రమంగా ఆమెలో వేడితగ్గుతుంది. నార్మల్‌కు వస్తుంది.

ఈ గునుపునే సాధింపు అన్నారు కొందరు. 17 వ శతాబ్దము లోని వారైన భాస్కరసింహుడు అనే తెలుగు బ్రాహ్మణుడు సాధింపును మరొక ప్రకరణంగా పేర్కొని దానికి చాలా ప్రాముఖ్యము ఇచ్చినాడు.

ఈ సాధింపు కొద్దిమార్పులతో రాత్రివేళలందు జరిగినట్లు అయితే దానిని తెరచాటు ఉపన్యాసం అంటారు. ఇంగ్లీషులో 'కర్టెన్ లెక్చర్' అంటారు. ఈ రెండు ప్రక్రియలను గురించి ఇదివరకే చెప్పినాను.

కలహ విధానాన్నిగురించి ఇంతకంటే ఎక్కువగా ఏమీ చెప్పనక్కర లేదు. గుసుపు పూర్తికావడంతోనే కలహతీవ్రత తగ్గిపోయి, శాంతి స్థాపనకు అనుకూల వాతావరణం ఏర్పడుతుంది.

అన్ని కలహాలూ ఈ గాడినేపడి ఇంత క్రమంగా జరుగుతవి అని చెప్పలేము. ఏస్థితిలోనైనా ఈ కలహం తీవ్రరూపం దాల్చవచ్చు. భగ్గున మండవచ్చు. ఆ ఆపద ఎప్పుడైనా రావచ్చు. అంతే కాకుండా నేను చెప్పినట్లుగాని కలహం క్రొత్తక్రొత్త ఘట్టాలలోకి దూకినా దూకవచ్చు.

అందుకని గృహకలహం ప్రారంభమై ఒకటి రెండు స్టేజీలు దాటటముతోనే తక్కున ఆపివేయగలిగితే మంచిది. కలహాన్ని నడవనీయకుండా ఎట్లా ఆపివేసి వెయ్యాలో తరువాత వేరే ప్రకరణములో చెపుతాను. కలహం గుసుపుదాకా నడిపినతదుపరి ఏవిధంగా శాంతిస్థాపన చెయ్యాలో ముందు చెపుతాను దానితరువాత కలహాన్ని మొదట్లోనే ఆర్పేసేవిధానాన్ని గురించికూడా చెపుతాను.

కలహం అన్ని ప్రకరణములు నడవడానికి ఎన్నిరోజులు పడుతుంది అని ప్రశ్న. సాధారణంగా నాలుగు అయిదు రోజులలో పూర్తి కావచ్చు, బాగా అలవాటైన కుటుంబాలలో అన్ని ప్రకరణాలుకూడా కొన్నిగంటలలోనే పూర్తి అవుతవి.

# కలహాంతము - శాంతి

ఈ విధంగా కలహము జరిగి చప్పబడ్డ తరువాత, స్త్రీ ఊరుకొంటుందనీ, మామూలు జీవితము సాగుతుందనీ అనుకోవడము పొరపాటు.

స్త్రీ ఎప్పుడూ ఊరుకోదు ఏదో సణుగుతూనే ఉంటుంది. ఏదో ఎత్తిపొడుపుమాటలు అంటూనేఉంటుంది.

కలహంజరిగిందే అని పురుషునికి కష్టంగానే ఉంటుంది. స్త్రీకీ కష్టంగానే ఉంటుంది. ఇద్దరిమనస్సులూ శాంతి పొందడము ఎట్లాగ అన్నదే ఇప్పటి ప్రశ్న.

పురుషుడే ముందుకువచ్చి శాంతిస్థాపనకై ప్రయత్నాలు సాగించాలి. అతడు తనను ఓదార్చుకోవాలె, ఇల్లాలును ఊరుకోబెట్టాలె.

ముందు తనకుతాను శాంతిపరచుకోవడానికి ఉపేక్ష అనే మార్గాన్ని అవలంబించాలె.

"ఆఁ పోనీద్దూ ఎప్పుడూ ఉండేదే ఇది. దీని కోసం దుఃఖపడడము ఎందుకూ? రోజులు గడిస్తే ఈః కలహాలకు అలవాటు పడిపోతాను" అని ఇల్లాగ తనకు తాను చెప్పుకొని ఓదార్చుకోవాలె. పరుపుపై పడుకొని స్థానత్రయాన్ని అనగా ముక్కు, నోరు, కళ్లు వీటిని అరికట్టి తల దిండులోదూర్చి చీకటియింట్లో మంచంపైన పడుకోవడం ఉత్తమము. దానివలన శాంతి లభిస్తుంది.

అయితే అల్లాగ పడుకొని ఉన్నప్పుడు దుఃఖము ఎక్కువఅయితే కన్నీళ్లు కార్చవచ్చునా అన్నవిషయంపై శాస్త్రజ్ఞులే అభిప్రాయ భేదాన్ని వెల్లడించారు. గురుదత్తేంద్రపాదుడను కామశాస్త్ర రహస్యజ్ఞుడు 'జయమంగళవ్యాఖ్య'లో తగుమాత్రము కన్నీళ్లు కార్చవచ్చు ననే చెప్పాడు.

కాని 'గీతగోవిందము' నకు టీక వ్రాసిన కుంభనృపతీ, 'నైషధీయ చరిత్రము' నకు వ్యాఖ్యవ్రాసిన నారాయణభట్టూ పురుషుడు కన్నీళ్లు కార్చరాదని స్పష్టంగా చెప్పారు.

పురుషుడు ఈవిధంగా తన్నుతాను ఓదార్చుకొని స్త్రీని శాంతపరచే ఉపాయాలు ఆలోచించాలె. ధ్యుతి, ప్రసంగం, వ్యవసాయము అనే మూడు మార్గాలవలన స్త్రీని ప్రసన్నురాలిని చేసుకోవచ్చునని చాలా మంది అభిప్రాయము.

ధ్యుతి: అంటే భయపెట్టటం. ముందుగా ఈ ప్రక్రియవల్లనే స్త్రీని శాంతురాలినిగా చేసికొనే ప్రయత్నం చేయాలె.

నీవు ఇల్లాగ పోట్లాడితే నేను ఊరుకోను. తెలిసిందా। నేను అసలే కోపిష్టిని. అంటే నాకు అసలు కోపంరాదు. వచ్చిందా అంటే మరి పోదు జాగ్రత్తగా ఉండు తెలిసిందా?

అని ఇల్లాగ కోప్పడి చూడాలె.

మొదటి రోజులలో ఈ ప్రక్రియ పనిచేయడానికి చాలా అవకాశం ఉన్నది. కాని చాలారోజులు కాపురం చేసినపిల్ల అయితే ఈమాత్రం బెదరింపులకు లొంగదు. ప్రసంగము: ఇది పొగడ్త. స్త్రీని పొగడితే లొంగిపోతుందని చాలామంది అభిప్రాయం. చూడూ నీవెందుకు ఇవ్వాళ ఇల్లాగపోట్లాడావో తెలియడంలేదు. నీవు మంచిదానివని నాకు తెలుసు. మీ అమ్మకూడ ఎంతో మంచిది. మీ అక్కయ్య ఎంత గుట్టు చక్కంగా కాపురం చేస్తున్నది! నీవు ఇక ఎప్పుడూ ఇల్లాగ చేయకు. ఆడదానికి భర్తయే దైవము అని మీ అమ్మ చెప్పలేదూ? ఈ విధంగా స్తుతిచేస్తే ఆడది పొంగిపోయి లొంగిపోతుందని కొందరు అంటారు.

భార్య కాపురానికి రావడముతోనే పతివ్రతలకథలూ, అవీ చదివించి ఆమెకు భర్తఅంటే దేవుడు అనే భావం బాగా నాటుకుపోయేలాగున చెయ్యాలె.

ఆడదానిచేత ఇటువంటి పుస్తకాలు చదివించి, ఆ విషయంలో పరీక్షలు ఏర్పాటుచేస్తే మంచిది. చీర కావాలన్నప్పుడల్లా, ఇటువంటి పరీక్ష ఒకటి ప్యాసుకావాలని నియమము పెడితే మరీమంచిది.

వ్యవసాయము : తన శక్తిని తాను పొగడుకొనడము వ్యవసాయము. "ఓసి పిచ్చిదానా! వెధవచీర కొన లేదనా ఇంత పోట్లాట! నేను తల్చుకొంటే ఒకటి లేదా పది చీరలు కొని పారేస్తాను. ఏమనుకొన్నావో, ఏమిటో! మనం కబురు చేశామా అంటే ఏ కొట్టువాడైనా సరే మాంచి చీరలు కావలసినన్ని తెచ్చిపడేస్తాడు. నాకు పట్టుదల వచ్చిందా అంటే, ఒక ఇరవై చీరలు కొని పారేస్తాను, జాగ్రత్త! అందాకా ఎందుకు ఓ బట్టల కొట్టే పెడతాను నీకు చీరలకు ఇబ్బంది లేకుండా." ఈ విధంగా చెప్పుకొని తన శక్తిసామర్థ్యాలు చూపి ఆమె హడలిపోయేలాగున చెయ్యడమే ఈ పద్ధతి లక్షణము.

ఈ మార్గాలవల్ల భార్య శాంతించకపోతే ప్రియవాక్కు, దానము, నమస్కారము - అనబడే మరి మూడు మార్గాలున్నవి.

ఇందులో ప్రియవాక్కు క్రొత్తదికాదు. పొగడ్తవంటిదే. ఆమెను గురించీ, ఆమె తల్లిని గురించీ, ఆమె తమ్ముడిని గురించీ మంచి మంచి మాటలు మాట్లాడి ఆమెను సంతోషపెట్టడము అనేది ప్రియవాక్కు.

దీనికీ లొంగకపోతే క్రొత్త చీరలు, రెవికలు ఆవిడకు కొని ఇయ్యాలె. ఆవిడకే కాక వాళ్ళ అమ్మకూ, చెల్లెలుకూడా కొనడము మంచిది. ఇది దానము. బట్టలేకాక, డబ్బుంటే బంగారు నగలూ అవీ కొని ఇస్తే ఈ క్రియ బాగా పనిచేసి ఆమె ప్రసన్నవదన అవుతుంది.

అప్పటికీ లొంగకపోతే, కాళ్ళమీద పడి, క్షమించమని వేడుకోవాలట. ఇది నమస్కారం. కాని ఈ మార్గమును అవలంబించమని నేను అనను. ఆడదాని కాళ్ళమీద పడి లొంగిపోవడమువలన ఏమీ ప్రయోజనం ఉండదనే నా అభిప్రాయం.

కలహం జరిగేటప్పుడు, కలహకర్తయొక్క చేతులూ, కాళ్ళూ ఏదో విధంగా కదులుతూనే ఉంటవి. వాటిని బిగబట్టి ఎవరూ పోట్లాట జరుపలేరు. ఎట్లాగూ కదులుతూనే ఉంటవి కాబట్టి వాటిని ఒక అందమైన పద్ధతిలో కదిలిస్తే అంటే నాట్యశాస్త్రంలో చెప్పినట్లు చలింపజేస్తే కలహంయొక్క స్థాయి పెరుగుతుంది. కలహానికి కళాగౌరవం వస్తుంది.

పోట్లాడుతూఉన్న స్త్రీ తల అనేకరకాలుగా ఆడిస్తుంది. ఆమె మనోగతభావానికి అనుగుణంగా ఈ శిరఃకర్మ జరుగుతూ ఉంటుంది. ఈ తలత్రిప్పేపద్ధతులలో పదమూడురకాలున్నవి.

''అవునవును'' ''అంతే'' ''నామాటవినండి'' ''ఎందుకుచెపుతున్నానో గ్రహించండి'' ''మీ రన్నమాట నిజమే'' మొదలైన వాక్యాలు అంటూ ఉన్నపుడు మనము తల పైనుంచి క్రిందికి ఆడిస్తాము. ఆ పద్ధతిని తల ఆడించడాన్ని ''అకంపితశిరము'' అంటారు.

తల ఆ ప్రక్కనుండి ఈ ప్రక్కకు త్రిప్పడము ఇంకో పద్ధతి. ''నాకు అక్కరలేదు'' ''నా వల్లకాదు'' ''నేను ఒప్పుకోను'' ''అట్లాగు చస్తే చేయను'' ''వీల్లేదు'' ''నేను వినను'' ఈ విధమైన మాటలు అంటున్నప్పుడు తలను ఆ ప్రక్కనుండి ఈ ప్రక్కకు త్రిప్పుతాము. దానికి ''ధుత శిరము'' అనిపేరు. అయిష్టమును తెలియజేయడానికి ఈ విధంగా శిరఃకంపనం చెయ్యాలె.

ఒకప్పుడు మెడను కొంచెముగా ఒక ప్రక్కకు వంచుతాము. బాధను ప్రదర్శించడానికి తల నొప్పిగాఉంది ఆ విషయము ఇతరులతో చెబుతూ 'అబ్బ' అన్నపుడు, తల ఒక ప్రక్కకు వంచుతాము.

కలహం జరిపే ఆవిడ ఎప్పుడో ఒకసారి ''అబ్బా! తల బద్దలేసుకు పోతుంది'' అని అనవలసివస్తుంది. అప్పుడు మెడ ఒకప్రక్కకు వంచాలె. దానినే శాస్త్రంలో ''అంచిత శిరము'' అన్నారు.

దుఃఖము వచ్చినపుడు తల క్రిందికి దించేసుకుంటాము చూడండి. దానికో పేరు పెట్టారు శాస్త్రజ్ఞులు. అది ''అధోగత శిరము.'' సిగ్గు వచ్చినా ఇదే శిరఃకర్మను ప్రయోగించాలె.

నేను చెప్పిన విషయాలు ఏమీ క్రొత్తవి కావు. పోట్లాడుతున్నప్పుడు భావానికి లేక రసానికి అనుగుణంగా తల తిరుగుతూనే ఉంటుంది. ఎటొచ్చీ ఇప్పుడు వాటిపేర్లు మనము నేర్చుకొన్నాము. అంతే. ఈ పేర్లు తెలియకపోయినా తల తిరగాల్సిన విధంగా తల తిరుగుతూనే ఉంటుంది. దానిని మనము ఆపలేము. ఎట్లాగూ తల తిరక్కమానదు కాబట్టి తిరుగుళ్ళ పేర్లుకూడా నేర్చుకొని మరీతిప్పమని నేను కోరుతున్నాను.

చూపులు కూడా మారుతూ ఉంటవి. కోపం వచ్చినపుడు ఒకరకంగా చూస్తాము. అసహ్యములేనపుడు ఇంకో రకంగా చూస్తాము. ఇల్లాగ ముప్పై రకాలుగా చూడవచ్చును అని నాట్యశాస్త్రవేత్తలు చెపుతారు. భావాన్నీ, రసాన్నీబట్టి ఈ చూపులు మారుతూ ఉంటవి. కొందరికి కళ్లు ఉన్నట్లుగానే ఉంటుంది. కాని కనపడవు. అల్లాంటి కళ్లు ఉన్న వాళ్ళ చూపులుమాత్రం ఎప్పుడూ ఒకేమాదిరిగానే ఉంటవి. అది మనకు అక్కరలేదు.

ఏరకం చూపును శాస్త్రంలో ఏ పేరుతో పిలుస్తారో తెలియక పోయినా మన ఆడవాళ్ళందరికీ ఈ చూపులు చూడడము తెలుసు. అవి చాలా ఉన్నవి. అవన్నీ మనం నేర్చుకో నక్కరలేదు. కాని ఆయిదారు రకాలైనా తెలిసిఉంటే మంచిది.

ఈ శాస్త్రవిషయిక జ్ఞానము లేకపోయినా కలహం జరిగిపోతుంది! ఆగిపోదు! కాని ''ఇది, ఇదీ'' ఈ విధంగా చూస్తే భయానకము అంటారు. ఈ విధంగా చూచిన చూపును కాంతదృష్టి

అంటారు అని తెలుసుకొని, అప్పుడు ఆ దృష్టులను ప్రయోగిస్తూ జరిపిన కలహానికి ఉండేగౌరవం మరి దేనికీ ఉండదు.

శృంగారరస ప్రదర్శనములో మాత్రము కాంతదృష్టి ప్రయోగించాలి. మనము ఇప్పుడు కలహవిషయమై ఆలోచిస్తున్నాము కాబట్టి ఈ కాంతదృష్టి మనకు అక్కరలేదు. పోట్లాడుకుంటూ విరహాన్నిగాని, విస్వోకము, మోట్టాయితము, కుట్టమితము అనబడే శృంగార భావములనుగాని పొందడము జరుగదు. పోట్లాడుకుంటుంటే అందులో శృంగారం ఏమిటి?

అయితే "అభితప్త" అనేటువంటి దృష్టి విశేషాన్ని మాత్రము కలహకాంతలు నేర్చుకోవాలి. సంతాపమును, మనోవ్యథను తెలుపడానికి ఈ దృష్టివిధానమును ప్రయోగిస్తారు.

ఈ దృష్టులు రసదృష్టులు, స్థాయీభావదృష్టులు అనే భేదంతో ఉన్నవి. కాని మన కలహాలకు అవన్నీ నేర్చుకోవలసిన అవసరంలేదు. రెండు మూడు రకాల దృష్టులతో నెట్టుకు పోవచ్చు.

పోట్లాడుతున్న స్త్రీని జాగ్రత్తగా చూస్తే ఆమె ముక్కుపుటాలు కూడా అదురుతున్నట్లు మనకు కనిపిస్తుంది. ఈ ముక్కుపుటాలను ఎగరవేయడము అనేది తొమ్మిదిరకాలు. మనకు అవన్నీ అక్కరలేదు. క్రోధరస ప్రదర్శనమునకు పనికివచ్చే "నిమేషపుటము" అనే పుటకర్మ ఒక్కటైనా తెలిసిఉంటే చాలావరకు సరిపెట్టుకోవచ్చు.

కలహములు నడిపేసమయంలో కనుబొమలు ముడిపడి పోతవి. ఇవి ఏడురకాలు. "భ్రుకుటీభ్రువు" అనే భ్రూకర్మ ఒక్కటి నేర్చి ఉండడము అవసరము. కోపంవచ్చినపుడు ఒకరకంగా కనుబొమలు ముడివేసేపద్ధతికే "భ్రుకుటీభ్రువులు" అని పేరు.

పోట్లాడే స్త్రీముక్కుకూడా ఒక విధమైన ఆకారాన్ని పొందుతుంది. "ముక్కు ముడుచుకు కూర్చుంది" - అని మనము సాధారణంగా అంటాము. కోపంవచ్చినపుడు ముక్కు ముడుచుకుపోతుంది. దానినే

శాస్త్రంలో "వికూణితనాసిక" అన్నారు. ఆ కోపమే ఎక్కువైతే మారినపుడు ముక్కు జారుతుంది. "మూరెడు పొడుగైంది'' అంటాము. అమోస్తరు నాసికను "వికృష్టనాసిక'' అన్నారు. ఇట్లాగే ఇంకా ఉన్నవి. కాని మనకు ఈ రెండురకాల నాసాకర్మలూ తెలిస్తే చాలు.

ఇల్లాగే చెక్కిళ్లు ఉండే పద్ధతులను గురించి కూడా చెప్పారు. కోపం వచ్చినపుడు దవడలు జారినట్లు కనపడతవి. దానిని "చామగండము'' అంటారు. చెక్కిలి అవగతము అవుతుంది. ముఖ్యంగా దుఃఖము నందు ప్రదర్శించే గండ లక్షణము ఇది.

ఇల్లాగే శరీరంలోని ప్రతి అవయవము కదులుతుంది. పోట్లాట సమయంలో ఏ అవయవము ఇల్లాగ చలింపజేయాలె అని శాస్త్రం చెపుతుంది.

అధరము తీసుకోండి. పోట్లాట సమయంలో క్రింది పెదవి అదురుతూ ఉంటుంది. దానినే "కంపనాధరము" అన్నాడు శాస్త్రకారుడు. ఒక ప్పుడు కోపంతో పెదవిని పళ్ళతో కొరుకడము జరుగుతుంది. దీనినే అపుడు కటచుట అంటారు. కావ్యాలలో అట్లు కొరుకబడిన అధ రాన్ని "సందష్ట కాధరము'' అన్నారు. ముఖం వంచుకొని ఎవ్వరూ పోట్లాడరు. పోట్లాట జరిగేటప్పుడు మెడపై కెత్తుతారు. దీనినే "ఉన్నత గ్రీవము'' అన్నారు.

పోట్లాడుతూ ఉన్న స్త్రీ తన చేతులు అనేకరకాలుగా త్రిప్పుతుంది. చేతులు ఏదో విధంగా కదిలించకుండా ఎవ్వరూ పోట్లాడలేరు. దీనికే "హస్త ప్రదర్శనాలు'' అని పేరు.

చేతులు ఎత్తి దుమ్మెత్తి పోసినట్లు ఆడించడము ఒక పద్ధతి. మెటి కలు విరవడము ఒక పద్ధతి. ఇల్లాగ, తల బాదుకోవడమూ, జుట్టు పీక్కోడమూ, పతాకహస్తాన్ని గోడినపెట్టి గాలిలో దేనినో నరుకు తున్నట్లు చూపడమూ మొదలైన హస్తవిన్యాసాలు అనేకం ఉన్నవి. వాటి కన్నిటికి శాస్త్రంలో ఉన్న పేర్లు సంపాదించలేక పోయినాను. ఇక ఆఖరు విషయం కాళ్ళసంగతి. కొంతమంది చిందులేస్తూ

పోట్లాడుతారు. కొందరు అటూ ఇటూ తిరుగుతూనే పోట్లాడుతారు. కొందరు గదిలోకి పోతూ వస్తూ కలహం సాగిస్తారు ఇల్లాగ అనేక పద్ధతులు ఉన్నవి. మొత్తం మీద ఎవ్వరూగాని స్తంభంలాగ నిలువబడి పోట్లాడరు.

అయితే ఈ కాళ్లు ఎల్లా ఉండాలన్న విషయంలో రెండు ప్రసిద్ధపద్ధతులు ఉన్నవి. (1) ఔత్తరాహుల పద్ధతి. (2) దాక్షిణాత్యుల పద్ధతి. కుడి పాదాన్ని ముందుకుపెట్టి దానికి కొంచెము వెనుక వామపాదాన్ని ఉంచి వామహస్తమును కటితటము నందుంచి దక్షిణ హస్తాన్ని అనేక రకాలుగా కదిలిస్తూ, ఆడిస్తూ, గాలిలో ఊపుతూ కలహము జరపడము దాక్షిణాత్య పద్ధతి.

కోసల, కళింగ, ఆంధ్ర, ద్రవిడ, మహారాష్ట్ర, ఛైణ్ణదేశములలో ఈ దాక్షిణాత్య పద్ధతినే అవలంబిస్తారు.

ఇక ఔత్తరాహుల పద్ధతిలో వామహస్తము కటిస్థానమును మాత్రమే అంటిపెట్టుకొని ఉండక ఇష్టము వచ్చినట్లు చలిస్తూ ఉంటుంది. కాళ్లు కూడా ముందొకటి, వెనుక ఒకటి ఉండక రెండూ దగ్గరదగ్గరగా కలిసే ఉంటవి. అవంతి, విదిశ సౌరాష్ట్ర, మగధ, మాలవ, పాంచాల, సింధుదేశములలో ఈ పద్ధతిని కలహం జరుపుకొంటారు. కాని ఈ మధ్య కొన్ని మార్పులు వచ్చినవనీ, దాక్షిణాత్య స్త్రీలు కూడా రెండు చేతులూ ఆడిస్తూ కలహము జరుపుతూ ఉన్నారనీ విన్నాను. ఇది అశాస్త్రీయము అయినా ఆచారప్రాబల్యముచే దీనికి గౌరవం వచ్చింది

నేను ఒక్క విషయం గట్టిగా చెప్పాలనుకొంటున్నాను. ఎట్లాగూ పోట్లాటలు జరుగుతవి. అవి జరక్కమానవు. అట్లాంటప్పుడు వాటిని సుందరమైన పద్ధతిలో జరుపుకోండి అని అంటాను.

పోట్లాట ఎల్లాగూ తప్పనపుడు విసుక్కుంటూ ఏడుస్తూ పోట్లాడుకోవడము ఎందుకూ? ఆ జరిగేది ఏదో ఠీవిగా, దర్జాగా, అదొక నాట్య

ప్రదర్శనంలాగ జరగనీ! దీని వలన వచ్చిన నష్టం ఏమీ లేదు లని కూడా అంటాను.

ఈ పోట్లాటలు మధురలలితాంగాభినయోపేతములుగా ఉండడము వలన ఏడ్పులో కూడా నవ్వొస్తుంది. కష్టాలలో నుంచి సుఖాన్ని పిండుకోకపోతే బ్రతకడము ఎట్లాగు?

నవ్వులాటకే అయినా దీన్ని శాస్త్రగ్రంథంగా వ్రాస్తున్నాను కాబట్టి శాస్త్రమును ఏ విధంగా పరామర్శిస్తారో (ఈ విషయాన్నీ అల్లాగే పరామర్శ చేయాలె.) అందుకని, ఈ కలహ సమయాల్లో ఏ భాష ఉపయోగించాలె అన్న సంగతి తీసుకొని రెండు ముక్కలు వ్రాస్తున్నాను.

కలహం జరిపే స్త్రీయొక్క 'స్టేటస్'ను బట్టి ఆ భాష మారుతూ ఉంటుంది. బమ్మలమడక మాధవరాయ శర్మగారింట్లో పూర్తిగా సంస్కృతంలోనే జరిగేదట కలహకాండ. కొక్కొండవారియింట్లో శుద్ధగ్రాంథికంలో జరిగి ఉంటుంది. గురజాడ అప్పారావు యింట్లో శిష్టవ్యావహారికంలో జరిగి ఉంటుంది.

ఈ పోట్లాటలలో పురుషుడు కాస్త సంస్కృతంతో కూడిన భాషనూ, స్త్రీ పూర్తిగా వ్యావహారికమునూ ఉపయోగిస్తే మర్యాదగా ఉంటుంది. 'ఏ'కార బహుళమైన బాష గంగాసాగర మధ్య దేశస్థులు వాడవలెననీ, 'ఉ'కార బహుళమైనభాష ఆంధ్రులు వాడవలెనని శాస్త్రంలో ఉన్నది.

ఇక పోట్లాట జరుగునప్పుడు భార్యాభర్తలు ఒకరి నొకరు ఏ విధంగా పిల్చుకోవలెను అనే అంశం ఒకటి ఉన్నది.

యౌవనములో ఉన్న భర్తను భార్య ఆర్యపుత్ర అనీ, యౌవనం లేకపోతే ఆర్యా అని పిలవడము మంచిది. మహా రాజా అని పిలవటము మరీ మంచిది "మహా రాజా మీరు చెప్పింది చెప్పినట్లుగా ఉన్నది. నేను అట్లా చేయను." ఈ మోస్తరు వాక్యాలు కలహంలో వస్తూ ఉంటవి.

భర్త భార్యను ఓ భార్యా అనడం మంచిది. కృష్ణశాస్త్రి భార్యను అల్లాగే పిలుస్తాడు. పేరుపెట్టి భార్యను పిలవకూడదు అంటాడు. అయితే ఇప్పుడు కొంత మంది భార్యను పేరు పెట్టే పిలుస్తున్నారు. పండితులలో జమదగ్నిశర్మ, నటులలో ''స్థానం'' తమ తమ భార్యలను పేరుపెట్టే పిలుస్తారు.

ఈ కలహము జరిపేటప్పుడు రంగస్థలము ఎట్లా ఉండాలె, ఎవరు ఎక్కడ ఉండాలె అన్నది కూడా ఒక ప్రశ్న. ఈ విషయంలో శాస్త్ర సమ్మతమైన విధానము సూచిస్తాను. దాని తరువాత మీ యిష్టం.

ఇది కూడా అంతా నాటకరంగం మోస్తరే. వంట యిల్లు నేపధ్య గృహము అవుతుంది. కలహ నాటకానికి 'నాంది' అక్కడే పఠింప బడుతుంది. వంటయింటికి ముందున్న వసారా ఈ సందర్భంలో రంగశీర్షము అవుతుంది. మిగతా ఇల్లంతా రంగమండలము.

నాటక ప్రదర్శనంలో మృదంగం, వీణ మొదలైన వాద్య విశేషాల చేత ధ్వని పుడుతుంది. ఈ కలహనాటక ప్రదర్శన సందర్భంలో ఇంటావిడ కోపంతో చెంబులనూ, తప్పాలాలనూ విసిరికొడుతూ ఉంటే వచ్చేధ్వనినే సంగీతంగా గ్రహించవలసి ఉంటుంది.

ఈ నాటకంలో విదూషకుడు లేకపోవుట గమనింప తగిన విషయము.

# కలహసాహిత్యం

ఎన్నో కలహాల మూలంగా ఉత్తమసాహిత్యం పుట్టింది.

పండితరాజు విద్వత్సభలయందు మహా పండితులతో వాగ్వాదాలు జరిపినాడు. ఈ వాదప్రక్రియయందుఆయనకువైదుష్యం ఎట్లాకుదిరింది? లవంగీ సన్నిధానంలోనే నేర్చుకొన్నాడు. సంభాషణా నైపుణి ఆమె నేర్పింది. వాదాన్ని పెంచడము. కుదించడము. క్లుప్తీకరించడము. వేరొర్థం తీయడము. అర్థం కాకుండా మాటలు కూర్చడము. అన్వయ కాఠిన్యాన్ని కల్పించడము. రెండు అర్థాలు వచ్చేలాగున మాట్లాడడము మొదలైన ప్రక్రియలన్నీ నేర్చుకొన్నాడు. ఆ పోట్లాటలలో ఉత్పన్నమైనట్లు చెణుకులు. వింత ప్రయోగాలు. వక్రోక్తులు మొదలైనవి కలిపి, గంభీరమైన మాటలతో పొదిగి అలంకార శాస్త్రాన్ని వ్రాశాడు. ఆ కలహాలలో బీజప్రాయంగా ఉన్న విషయాలే తరువాత అలంకార శాస్త్రంగా పరిణామం పొందినవి.

జనకుడు ఉపనిషత్తులకు కారికలు వ్రాయుగలుగుట ఎట్లు సాధ్యమైనదో ఎవరైనా ఊహించినారా? వేదాంత రహస్యాలన్నీ సర్వజన సులభంగా, మనోహరంగా తేటతెల్లముగా ఎట్లా చేయగలిగినాడు? కాత్యాయనీ మైత్రేయీలతో ఆయన జరిపిన వాక్కలహముల సంక్షిప్త సౌమ్య రూపమే ఆ ఉపనిషత్సారము.

యాజ్ఞవల్క్య మహాఋషి తన గురువుతో పోట్లాడిన తరువాతనే సూర్యభగవానునివద్ద సకల విద్యలూ అభ్యసించి. స్మృతిరహస్యాలను వివరింప గలిగినాడు.

భారవి తండ్రితో తగాదాపడిన తరువాతనే. వివేకవంతుడై మహాకవి అయినాడు.

పెద్దన్న భార్యతో పెద్దతగవు పెట్టుకొని. గంధర్వస్త్రీ సంగమాన్ని తద్గత సౌఖ్యాన్ని అభిలషించి. ఊహా ప్రపంచంలో అనుభవించి. ఆ స్వప్నజన్య సౌఖ్యాన్నే కథా రూపంగా వెలువరించి మహా కవి అయినాడు. మనుచరిత్రలో ప్రవరుడు. వరూధిని వీరి మధ్య జరిగిన వాక్కలహాలే గదా మనోజ్ఞమైన ఘట్టాలు!

కృష్ణదేవరాయలు ముగ్గురు భార్యలతో కలహాలు జరిపి జయమును సంపాదించినాడు కాబట్టే ఆయనకు "మూరు రాయరగండడు" అనే బిరుదు వచ్చింది.

శ్రీనాథుడు నిషధమహారాజుతో జరిపిన కలహమే నైషధం.

కోమటిపడతి కోపంతో అన్న ఎత్తిపొడుపుమాటలే బాలచంద్రుడు యుద్ధానికి పోవడానికి కారణం! పలనాటి యుద్ధానికి మూలము!

ఏదో విధంగా ప్రేమరూపంగానో. మరో విధంగానో కామినితో జరిగిన కలహాలే కావ్యానికి వస్తువు అయినవి. మహా కావ్యాలకూ. ఉత్తమ కథాసాహిత్యానికీ ప్రాతిపదికలుగా ఈ రోజుకూ భాసిస్తున్నవి.

సౌందరనందం—సుందరికీ నందుడికీ మధ్య జరిగిన కలహాత్మకమైన ప్రణయగాథే కదా! తెనాలి రామకృష్ణ కవి నిగమశర్మకూ. ఆయన అక్కగారికీ జరిగిన కలహాలనేకదా కావ్యవస్తువుగా గ్రహించినాడు! కృష్ణార్జునుల పోట్లాటే గయోపాఖ్యానం అయింది తెలుసుగా! అట్లాగే కౌరవ. పాండవులమధ్య జరిగిన పోట్లాటేగా మహా భారతం అంటే! దశరథుడు కైకేయీల మధ్య జరిగిన వాగ్వాదానికి ఫలితమేగా. రాముడు అరణ్యవాసము చేయవలసి వచ్చుట! ఆ కలహమే లేకపోతే రామాయణమే లేదు!

అదేమిటి, ఇదేమిటి? తెలుగు సాహిత్యంలో అత్యంత మధురమైన గేయకావ్యము కిన్నెరసాని పాట గదా! చిరంజీవి సౌభాగ్యవతియగు కిన్నెరకూ. ఆమె అత్తగారికీ జరిగిన కలహమే ఆ మహాకావ్యానికి కూడా వస్తువు! అత్తా కోడళ్ళ కలహాలను విశ్వనాథవారు చక్కగా ఉపయోగించుకొని కావ్యకల్పన చేయగలినారు.

ఇక సంగీతానికీ ఈ కలహాలకూ గల సంబంధాన్ని చూదాము. సంగీత సాహిత్యం అంతా సమీక్షచేస్తే త్యాగరాజు ఆ కీర్తనలను భార్యతో తగవులు పెట్టుకొనిన కారణానే వ్రాయగలిగినాడని తెలుస్తుంది.

ఆయన భార్యతో పోట్లాడాడు ఇంట్లో అశాంతి ఏర్పడినా అప్పుడే "శాంతము లేక సౌఖ్యము లేదు" అన్న కీర్తన వ్రాశాడు.

చీరల విషయమై ఏదో తగవువచ్చి "నారీమణికి చీరలు ఇచ్చినాపని నాదే విన్నానులే" అని వ్రాశాడు. సంగీత విద్వాంసులు ఒక రాగానికి కలహప్రియ అని పేరు పెట్టడము ఈ తగవులయందు గల అనురక్తివల్లనే అనాలి.

ఇంట్లో విస్తారను పోట్లాటలు ఉండడము మూలంగానే క్షేత్రయ్య ఇల్లు వదలి వెళ్ళిపోయి మహా భక్తుడై పధాలను వ్రాసినాడు.

ఈ కలహముల మూలమున రజస్తమోగుణములు ముందు ప్రకోపింపబడినా తరువాత అవి అదుపులోనికి తీసికొని రాబడుచున్నవి.

ఈ కలహములవలన ఎవ్వడైతే తన వాక్కును, మనస్సును, హృదయాన్ని వశీకృతం చేసికొని, శక్తిమంతుడు అవుతున్నాడో, అతడు ఈశ్వరునకు సమానుడు అవుతున్నాడని గ్రహించవలసి ఉన్నది.

# కలహ ప్రయోజనం (I)

యోగులు ఏండ్లతరబడి తపస్సుచేసి సంపాదించే నిర్వికల్పసమాధి ఈ తగవుల వలన లభిస్తుంది. ఎంత పెద్ద కష్టమైనా లెక్కచేయక పోవడమూ, ఎంత పెద్ద శబ్దమైనా చలించకపోవడమూ, ఈ రెండూ బహుకాల తపఃఫలితముగా రాతగినవి. అవి ఈ తగవుల వలననే లభిస్తవి.

బోధనశాస్త్రంలో 'ప్లేమెథడ్' అని ఒక పద్ధతి ఉన్నది. దాని నను సరించి క్రీడ మూలముగానే జ్ఞానసముపార్జన జరుగుతుంది. ఆడుతూ పాడుతూనే ఎన్నో విజ్ఞాన విషయములు నేర్వడము ఆ పద్ధతి లక్ష్యము. ఈ తగవులు అల్లాంటి ప్రయోజనమునే సాధిస్తున్నవి. ఈ తగవులే క్రీడలు. వీటి మూలంగా గొప్ప నైతికసంపదను పొందు తున్నాము.

వైద్యశాస్త్రంలో 'ఎనస్తేషెయా' అని ఒక ప్రయోగము ఉన్నది. ఒక మందు రక్తంలోకి పంపిస్తే ఆ ప్రాంతం అంతా మొద్దుబారి పోతుంది. అక్కడ కత్తితో కోసినా మనిషికి తెలియదు. ఈ తగ వులు శరీరానికి శబ్దవిషయకంగా అల్లాంటి 'ఎనస్తేషెయా'ను కలి గిస్తవి.

రోజూ భార్యతో పోట్లాట అలవాటు అయిన తరువాత, ఆమె గారి అరుపులు, చీత్కారాలు, చీదరింపులు, బెదరింపులు నిన్నేమీ చేయ లేవు.

మొద్దుబారి, కఠినీకృతమైన నీ దేహము ఎట్టి శబ్దాన్నిఅయినా సహింప గలుగుతుంది. అప్పుడు నీ ఆరోగ్యం చెడిపోక వృద్ధిపొందుతుంది. అప్పుడు నీవు రైళ్ళలో ప్రయాణం చేయగలవు. నీ అధికారులు

విరోధులూ ఎంత పెద్దగా అరచినా నీలో చలనం ఉండదు. అట్టి చిత్త వృత్తి కలిగినపుడు నీకూ, మహాఋషికీ భేదం ఏమీ ఉండదు. అప్పుడు నీకు చీటికీ మాటికీ కోపంరాదు. చికాకు ఉండదు. చీదరించుకోవు. నవ్వుతూ ప్రపంచాన్ని చూస్తావు. ప్రపంచం నిన్నుచూచి నవ్వుతుంది. ఇంకేం కావాలె?

ఈ భూమిమీద ఉన్న నాలుగు రోజులూ అల్లాగ నిర్లిప్తతతో ఉండగలిగి ఉండడమే మనము కోరదగిన విషయము. జీవితసమాధి అంటే అది।

శబ్దంలో ఉండికూడా నిశ్శబ్దతను అనుభవించడమూ, చీకటిలో ఉండి కూడా వెలుగు చూడగలగడమూ, అజ్ఞానంలో ఉండికూడా ఆనందాన్ని పొందగలగడమూ, ఇవి మన ఇండ్లలో నిరంతరము జరుగు కలహాల వల్ల మనము చివరకు పొందగలిగిన సుగుణాలు.

కాబట్టి ఈ కలహకార్యక్రమము ఒక మహాతపస్సు వంటిది. దాని ఫలితము శాంతి, జీవితానికి హాయి.

జీవితము దుఃఖభూయిష్టము. కాబట్టి జీవితమునందు విరక్తిని పొందాలంటారు.

విరక్తిమార్గము అంటే ఏడుస్తూ కళ్ళుమూసుకొని జీవించడము అన్న మాట। అది సులభము. దుఃఖాన్ని సుఖంగా, క్లేశాన్ని శాంతిగా మార్చుకొనడము కష్టము.

కష్టపరంపర వచ్చినపుడు వాటిని పట్టించుకోకుండా తామరాకుపై నీటిబొట్టువలె విరక్తుడవై జీవించడము కష్టంకాదు.

కష్టాలు వచ్చినపుడు కళ్లు మూసుకొనడము గాదు మనం చేయవలసింది. వాటిని అనుభవించాలె. జీవితమునందు విరక్తి కాదు అనురక్తి కావాలె.

జీవితమార్గాన ఎట్లాగో కళ్లుమూసికొని పొమ్మని నేను అనను. కళ్లు తెరచి అన్నీ చూస్తూ నడవాలంటాను.

"దుర్గంధపూరితమైన వాతావరణంలో ముక్కుమూసుకో. ఎల్లాగో నాలుగు రోజులూ గడుపుకో" అని చెపుతున్నారు మన వేదాంతులు. "ప్రపంచంలో ఉన్న దుర్గంధాన్ని గ్రహించు. ఆ సుందరతను. వికారమును. వికృతిని చూచి అనుభవించు. ఆ అనుభవించుటలో. దుఃఖంలోనుంచి సుఖాన్ని పిండుకో. ఆ సుందరతలో నుంచి సౌందర్యమును గ్రహించు. జీవితము దుఃఖభూయిష్టమే. కాని ఆ దుఃఖాను భూతివలన ఒకానొక ప్రయోజనాన్ని సాధించు" అంటాను నేను. ఇనుపగుండు అగ్నిలో కాగడమువలన గట్టిపడ్డట్లు ఈ పోట్లాటలనే అగ్నిజ్వాలలలో కాగినవారికి జీవించుటకు కావలసిన దార్ఢ్యము వస్తుంది.

జీవించడములోనే అందము ఉన్నది. జీవించడంలోనే సౌఖ్యమున్నది.

మరణానంతరము సౌఖ్యము ఉన్నదంటారు. ఈ భూమిమీద జీవితము అశాశ్వతమూ. క్షణికమూ అనీ; ఇది కాలానికి బద్ధమైనదనీ. పరిమితమైనదనీ అంటారు.

కాని ఈ జీవిత ఆవరణను దాటినతరువాత ఏముందో చెప్పలేము. వెలుగే ఉన్నదో? అంధకారమే ఉన్నదో? సుఖమే ఉన్నదో? దుఃఖమే ఉన్నదో? మనము ఊహించలేము.

ఇంత దుఃఖములోకి తీసికొనివచ్చిన భగవంతుడు ఇంతకంటె దుఃఖములోనికి తీసికొనిపోడని నమ్మకం ఏమిటి?

అంధకారంలోకి వచ్చాము. జీవితానంతరం ఇంతకంటె అంధకారంలోకి వెడతామేమో!

మనకు ఏమీ తెలియదు!

కాన. ఈ జీవితములో నిగూఢంగా ఉన్న ఆనందాన్ని అనుభవించలేనివాడు. జీవితానంతరం కలుగబోయే సౌఖ్యాన్ని ఏమి అనుభవించగలడు!

ఈ కష్టమయ జీవితాన్ని ఎదుర్కొని చెడ్డను మంచిగా మార్చగల దార్ఢ్యత అలవరచుకొన్న తరువాత, దుఃఖమును ఆనందముగా గ్రహించగల చిత్తవృత్తి లభించినతరువాత, నీవు నిశ్చింతగా నిర్భయంగా, శాంతంగా మరణానంతర జీవితానికై ఎదురు చూడవచ్చు. అది కష్ట భూయిష్టము అయినా, సుఖపూర్ణమైనా నీకు దిగులులేదు.

కావున జీవితముయెడల విరక్తికాక అనురక్తిని పెంపొందించవలె. పోట్లాటలు, చీదరింపులు, చీత్కారాలు వీటిఅన్నిటివలన రాగల మంచి నీకు జీవించడానికి కావలసిన దార్ఢ్యమును ఇస్తుంది.

# కలహ ప్రయోజనం - (II)

ప్రక్క తగువులవలన ఇంకా చాలా ప్రయోజనాలు ఉన్నవి. మధ్యమధ్య ఇట్లాంటి తగవులు లేకపోతే జీవితము చైతన్యవంతము అవుతుంది. సముత్వలయమూ అవుతుంది.

కోపంఅనేది ఒక విధమైన మాలిన్యం. నాలుగు రోజులకు ఒకసారి పోట్లాడుకొంటూ ఉంటే హృదయగత మాలిన్యంఅంతా క్షాళితం అయిపోయి భార్యా భర్తల ఇరువురి హృదయాలూ కడిగిన ముత్యాలలాగ ప్రకాశిస్తవి.

అనేక కారణాలవల్ల మనిషిలో కోపం పేరుకొని ఉంటుంది. ఆ కోపాన్ని ఎప్పటికప్పుడు కక్కివేస్తూ ఉండడమువలన శరీరం తేలికై మనస్సుకు హాయి కలుగుతుంది.

కోపాన్ని మ్రింగివేయడమువలన ఎంత అయినా ఆపద కలుగవచ్చు. మనస్సులోఉన్న కోపం శబ్దరూపాన్ని పొంది ఇతరశబ్దాలతో కలసి. మస్తిష్కంలో పెరుగుతూ ఉంటుంది. ఇల్లాగ శబ్దరూపమును పొందిన కోపం. ఎప్పటికప్పుడు బైటికిపోవడము మంచిదికాని. లేకపోతే ఎప్పుడో ఒకసారి ఒళ్లు తెలియని స్థితిలో దానంతట అదే బైటకొచ్చేస్తుంది. అది చాలా ప్రమాదం. భర్త భార్యను కత్తితో పొడిచి చంపాడనీ. గొంతు పిసికి ప్రాణాలు తీశాడని మనము వార్తాపత్రికలలో చదువుతూ ఉంటాము. ఇటువంట ఘోర కృత్యాలు జరగడము. ఇల్లాగ మ్రింగివేయబడిన కోపంయొక్క ప్రేరేపణవలననే అని తెలుసుకోవలె.

భార్యా భర్తలు రెండు రోజుల కొకసారి కాట్ల కుక్కలలాగ ఇల్లాగ పోట్లాడుకోవడము అశాంతికరమైన విషయము కాదా అనవచ్చు.

ఆ మాటా నిజమే. కాని పట్టుదలతో ఈ కార్యక్రమాన్ని సాగిస్తూ వస్తే ఈ మేరకు మన జీవితాలు అలవాటై పోతవి.
చివరకు ఎంతవరకు వస్తుందంటే ఆ మోత లేకపోతే మనకే ఏమీ తోచనిస్థితి వస్తుంది.

రైల్వేస్టేషనుకు సమీపంలో ఉండే వాళ్ళను చూడండి ఆ రైలు కూతలకూ, ఇంకా తత్ సంబంధమైన ఇతర ధ్వనులకూ అలవాటై పోతారు. అటువంటి వాళ్లు, ఏదైనా పల్లెటూరు వెడితే, వాళ్ళకు నిద్రపట్టదు. ఒక్క రైలుకూత అయినా వినపడదు. ఇక్కడి జనం ఎట్లా బ్రతుకుతున్నారా అని ఆశ్చర్యపోతారు.

మన జీవిత సమస్యలలో ప్రొద్దు ఎల్లాగ పోతుందా అన్నది ఒకటి ఉన్నది. ప్రొద్దు పోవటానికి కొంతమంది చీట్లపేక, చదరంగం మొదలైన ఆటలు ఆడుతారు. భార్యాభర్తలకు ప్రొద్దుపోవటానికి ఈ కలహాలు ఎంతైనా సాహాయ్యపడుతవి. కాస్సేపు పోట్లాడుకొంటే కాలం గడిచిపోతుంది.

ఎప్పుడూ ఒకే పనిచేస్తుంటే విసుగు పుడుతుంది. పనిని మార్చడం అవసరం. పనిని మార్చి సరదాకు మరోపనిని చెయ్యాలె. దీనినే 'హాబీ' అంటారు. ఈ హాబీవలన విశ్రాంతి, వినోదము లభిస్తవి. కాసేపు పోట్లాడుకోవడమే హాబీగా పెట్టుకొంటే అన్నివిధాల కలిసి వస్తుంది.

కాబట్టి కాలం గడపటానికీ, విజ్ఞానార్జనకూ, వినోదానికీ, మానసికంగా అభ్యుదయాన్ని సాధించడానికీ ఈ కలహ కార్యక్రమమంత ఉచితమైనదీ మరొకటి లేదు.

పాలను కాచి చిలికితేగాని వెన్న రాదు. సంసార సముద్రమనే ఈ క్షీరసాగరాన్ని ఈ కలహం కారణంగా చిలికి అమృతాన్ని సాధించవచ్చు.

ఈ కలహాలవల్ల కొద్దిగా మనఃక్లేశము కలుగవచ్చు. ఆ మాత్రంచేత వాటిని వదిలేయ కూడదు. క్షీరసముద్రాన్ని మథించినపుడు హాలాహలమూ పుట్టింది, అమృతమూ పుట్టింది।

ఈ కలహాల వల్ల ధ్వని ఉత్పన్నం అవుతున్నది. కావ్యంలో వలెనే కాపురంలో కూడా ధ్వని సంపత్కరమూ, శోభాయమానమూను. ధ్వనిలేని యిల్లు శ్మశానవాటికలాగ, నీరసముగా ఉంటుంది. కిలకిల లాడే పిల్లలతోనూ, కిచకిచలాడే పిచ్చుకలతోనూ, గలగల్లాడే ఇల్లాలు తోనూ ఇల్లు కళకళ లాడుతుంది. అనే పరమసత్యాన్ని మరువ రాదు. మూగమొద్దుతో కాపురం చేసినా ఒకటే, చెయ్యకపోయినా ఒకటే. మాటకుమాట అననేర్చిన ఇల్లాలితనమే ఇల్లాలితనం.

శబ్దకారణంగా మనుష్యునికి గాఢమైన నిద్రపడుతుంది శబ్దానికీ, గాఢ మైన సుషుప్త్యావస్థకూ అవినాభావసంబంధము ఉన్నది. శబ్దానికి ఫలి తంగా వచ్చేనిద్ర నిజమైన గాఢనిద్ర. అందుకనే అటువంటి గాఢ మైన నిద్రను ఇంగ్లీషులో 'సౌండ్ స్లీప్' అన్నారు. ఆరోగ్యానికీ, శబ్దానికీకూడ సంబంధం ఉన్నది. సౌండ్ హెల్త్, సౌండ్ బాడీ అనే మాటలవల్ల ఇది అభివ్యక్తం అవుతూ ఉన్నది. వీటి కన్నిటికి ముందు సౌండ్ అనే విశేషణం ఉన్నది. దీనినిబట్టి శబ్దముయొక్క ప్రాము ఖ్యాన్ని గ్రహింపవచ్చు.

శబ్దము ఎక్కువైతే నరముల బలహీనత ఏర్పడుతుంది అంటారు. శబ్దమునకు అలవాటుపడితే ఈ విపత్తురాదు. పైగా శబ్దము 'టానిక్' లాగ పనిచేస్తుంది.

ఉపాధ్యాయులూ, ప్లీడర్లూ, శాబ్దికవాదులు, శబ్దప్రసారకులు శబ్దస్నిగ్ధ త్వములో జీవిస్తారు. అందుకనే వాళ్లు ఆరోగ్యంగానూ, సుఖంగానూ ఉండడము మనము చూస్తున్నాము.

ఏ యింటిలో అయితే శబ్దపౌష్కల్యం ఉంటుందో, ఆ యిల్లు పిల్ల లతో కూడినట్టి, శోభాయమైనట్టి గృహము అని తెలుస్తుంది.

వెలుగూ శబ్దమూ ఈ రెండుకూడా శోభనగృహసూచకములు.

ఆరోగ్యవంతులు శబ్దాన్ని సహించగలరు, రోగులు శబ్దాన్ని ఓర్చుకో లేరు. దీనినిబట్టి శబ్దానికి, ఆరోగ్యానికి సంబంధం ఉన్నట్లు గ్రహించ గలరు.

ఈ పోట్లాటలవల్ల చమత్కారరచనా వైదుష్యం అలవడుతుంది. వీటి వల్లనే ఎత్తిపొడుపు, గడ్డిపోంకము, నర్మము, నాకిక, ప్రపంచము అనబడు వాగ్గూఢమైన సాహిత్యప్రక్రియలయందు వైదుష్యము లభిస్తుంది.

కృష్ణశాస్త్రిగారు ఎందుకో ఒకసారి భార్యనుకోప్పడితే ఆమె ఏడ్చిందట. కృష్ణశాస్త్రిగారు విసుక్కుని, "ఏడ్వటము అసహ్యము" అన్నారుట. ఆమెగారు, "ఏడ్చినా నేనేదో సంసారపక్షంగానే ఏడుస్తున్నాను గాని హోరుహోరుమని గొంతెత్తి ఏడ్వడము లేదుగా।" అని ఎత్తి పొడిచిందట।

విశ్వనాథవారు ఒకసారి సానులవెంట తిరిగేవాళ్ళను గురించి అసహ్యించుకొంటూ మాట్లాడితే ఆయన భార్య ఒకరినిగురించి అనడము ఎందుకులెండి. ఎవరికుండేసానులు వారికి ఉన్నారు।" అని ధ్వని వ్యంజకంగా అన్నదట।

కిన్నెరసాని సత్యనారాయణగారి సాని అని ఆమె అనుమానం।

ద్రౌపది విరటునికొల్వులో ప్రవేశించి తనకుజరిగిన అవమానాన్ని గురించి చెపుతూఉంటే ధర్మరాజు అంటాడు. "వెళ్ళిపో. కులసతులకు ఈ విధంగా మాట్లాడడము ఏమీ మర్యాదకాదు."

అప్పుడు ద్రౌపది, "గౌరవమా। నాభర్త జూదరి. మోసగాడు. అటువంటివాడి భార్యకు గౌరవమూ, మర్యాదా ఎక్కడనుంచి వస్తవి!" అని నాలుగూ దూడించి వెళ్ళిపోతుంది:

ఈ విధంగానే ఈ చిరుకలహాలలో అనేకమైన చమత్కారమైనట్టి మంటలు పుట్టుకొస్తవి. ఈ కలహాలవలన కలిగే ప్రయోజనాలలో ఇదే ఎక్కువగా చెప్పుకో దగిన ప్రయోజనము.

ఈ వాక్కలహాలు చక్కగా జరుపుకొంటే భాషకూడా వస్తుంది. మొదటి రోజులలో మామూలు మాటలతోనే కలహం జరుపుకుం

టారు. కొన్నాళ్ళయిన తరువాత, క్రొత్త క్రొత్తమాటలంతో కలహము జరుపుకోవాలెనని బుద్ధిపుడుతుంది. కలహంలో వాడుకొంటానికి క్రొత్త క్రొత్తమాటలూ, మంచి మంచి సమాసాలూ, ముద్దుఅయిన పలుకుబళ్ళు, సొగసైన సామెతలూ, రసవంతమైన వాక్యాలూ సేకరించి అట్టిపెట్టుకొంటారు. రేపు పోట్లాటలో ఈ మాటలు ఉపయోగించాలె. ఈ సమాసాలు విసరాలె అనుకొని, అటువంటివి పుస్తకాలలోనుంచి ఎరి వ్రాసి అట్టిపెట్టుకొంటారు. సమయము వచ్చినపుడు వాటిని ఒకరిపై ఒకరు విసురుకొంటారు. దీనివలన భార్యాభర్తలు క్రొత్త క్రొత్త మాటలు నేర్చుకొని భాషను వృద్ధిచేసుకోవడం జరుగుతుంది. మా జమదగ్ని భార్య ఒక్కసారి భర్తతో పోట్లాడుతూ, "ఈ విషయం నేను నమ్మను. మీరేదో విశ్వామిత్రం చేశారు" అన్నది. ఆ బిడ్డ ఎంత చక్కని మాట ఉపయోగించిందో అని నేను ఆశ్చర్యపడ్డాను.

ఇల్లాగ రసవంతమైన మాటలతోనూ, సమాసాలతోనూ పోట్లాటలు నడిచినపుడు, వాటి స్వభావమే మారిపోయి మామూలు పోట్లాటలు కాక రసవంతమై, భావపరిపుష్టమై, అలంకార సమృద్ధమై, నవరస భరితములై, ఒక్కొక్క కలహము ఒక్కొక్క కావ్యమై, ఒక్కొక్క పట్టిరగవు ఒక్కొక్క కావ్యఖండమై మొత్తముమీద కలహకార్యక్రమము అంతా కమనీయమైన మహాప్రబంధము అవుతుంది. వాటిలోని కావ్యత్వము, సౌందర్యం కనిపిస్తవి.

ఈ కలహాలు ఒక్కొక్కటి ఒక ప్రబంధం అని చెప్పాను. ఒక పోట్లాట 'పారిజాతాపహరణము' నడక నడుస్తుంది. 'మరొక్కటి ఉత్తర రామ చరిత్ర' పోకడను అనుసరిస్తుంది. ఒకసారి భార్యాభర్తల మధ్య జరిగిన కలహం వరూధినీ ప్రవరుల సంభాషణను పోలి ఉంటుంది. మరియొకసారి సరస్వతీ చతుర్ముఖుల కలహంవలె ఉంటుంది. మరొక్కసారి రతీ మన్మథుల మధ్య జరిగిన సరస సరళ సంభాషణ మాదిరిగా ఉంటుంది.

ఈ కలహం ఒక్కసారి వియతి స్రవంతీ సంచాలిత రాయంచ గమనములో నడుస్తూంది. మరొకసారి సర్పముపైకి బ్రహ్మాండమైన వేగముతో వచ్చే గరుత్మంతుని వేగంలో ఉరుకు లెడుతుంది.

భగవంతుడు కూర్మావతారమెత్తి మేరుపర్వతాన్ని మోస్తున్నప్పుడు నడచిన నడక ఒకసారి, గజేంద్రుని మొఱవిని వైకుంఠమునుండి భువికి దుమికి చక్రమును పైకెత్తి మకర సంహారార్థ మేగు ఆ కృష్ణ పరమాత్ముని వేగగమనమును మరొకసారీ అనుసరిస్తవి - ఈ కలహాలు.

భార్యా భర్తలమధ్య జరిగే ఈ కలహాలు మీరంతా నిరసిస్తారు. నేను మెచ్చుకుంటాను. ఎందుచేతనూ అంటే మామూలు కలహంగా మీరు భావిస్తారు. అవి పంచాంగములతో కూడిన నాటక ప్రదర్శనాలుగా నేను భావిస్తాను.

భార్యా. భర్తలమధ్య జరిగిన కలహం పేలవమైనట్టీ. నిర్జీవమైనట్టీ మాటల కూర్పుఅని మీరు అంటారు. అది రసవంతమైన కావ్యం అని నే నంటాను.

ఆ మాటలు కఠినవాక్కులని మీరూ. రమణీయార్థ ప్రతిపాదకములని నేనూ. అంటున్నాను.

ఆ మాటల ఉచ్చారణలో కా కవిత్వము లేదని మీరు అంటారు. అవి మాటలు కావు రాగయుక్తమైన కీర్తనలు అని నే నంటాను.

పోట్లాటలో భయానక బీభత్సరస ప్రదర్శనము మాత్రమే జరుగుతుందని మీరు అంటారు. కాదు బాబూ. నిశితంగా చూస్తే. తీవ్రంగా ఆలోచిస్తే ప్రతిమాటా ధ్వని వ్యంజకమనీ, అన్ని రసములూ ప్రదర్శిత మౌతాయనీ నే నంటాను.

ఇంకొక్క విశేషం ఏమిటీఅంటే ఈ కలహాలు తర్కము, వ్యాకరణము మొదలైన శబ్దశాస్త్రాలకు లక్ష్యముగా ఉంటున్న సంగతి గ్రహించాలె.

ఈ పోట్లాటలలో జీవాత్మ పరమాత్మలయొక్క స్వరూపం గోచరిస్తుంది. భార్యా భర్తలు జీవాత్మ పరమాత్మలవలె విడి విడిగా వున్నట్లు కనపడుతూ ఉన్నా, ఒకేపదార్థముయొక్క భిన్నరూపము గదా।

జీవితానికి శాంతి, దాంతి, కాంతి, భక్తి మొదలైనవి కావలయును అన్న సత్యము, సర్వ వేదాంతములయొక్క పిండితార్థము. ఇదీ ఈ కలహాకార్యక్రమంలో ఉపదేశింపబడుతున్నదని అందరూ గ్రహింతురుగాక।

శాంతి శ్శాంతిః



# ప్రశ్నలు

1. ఈ పుస్తకము వ్రాయడములో నేను పెట్టుకున్న ఉద్దేశాలు ఎంత వరకు నెరవేరినవని నీవు అనుకొంటావు?
2. చిరుకలహాలు, గురుకలహాలు - ఈ రెంటికిని గల భేదమును వివరింపుము.
3. ప్రణయకలహానికీ, దేశీయకలహానికీగల అతి ముఖ్యమైన భేదము ఏమి?
4. గురుకలహాలయొక్క ముఖ్యలక్షణాలు ఏమి?
5. ఈ కలహాలు మధ్యతరగతి కుటుంబాలలోనే ఎందుకు వృద్ధి పొందుతున్నవి?
6. జ్యోతిశ్శాస్త్రరీత్యా గృహకలహాలకు కారణం ఏమి?
7. కాపురంఉన్న ఇంట్లో దోషముంటే భార్యాభర్తలమధ్య పోట్లాటలు వస్తవని వాస్తుశాస్త్రం చెబుతుంది. అల్లాంటప్పుడు ఇల్లు మారిస్తే లాభం ఉంటుందా?
8. సాధింపు అనగా నేమి? సాధింపుకు పనికివచ్చే కొన్ని విషయాలు వ్రాయి. సాధింపుయొక్క ప్రయోజనాలేమి?
9. ఎట్టి విషయాలు 'సణుగుడు' అనే ప్రక్రియకు స్వాధీన మవుతవి?
10. గడ్డం గొరిగించుకొనని భర్తను భార్య ఎట్లా సాధిస్తుందో వ్రాయుము?
11. కోత అనగా నేమి? దాంపత్యజీవితంలో దీని ప్రాముఖ్యాన్ని. ప్రాధాన్యాన్ని. ప్రయోజనాన్ని గురించి వ్రాయుము.
12. భర్తతో కలహము జరుపుకొనేటప్పుడు పక్కవాయిద్యాలు ఎవరి వలన జరుపబడవలయును? ఈ పనికి ఎవరు పనికొస్తారు?

13. భర్తను శిక్షింపదగిన నాలుగు మార్గములను సూచింపుము?

14. నరకములో నాకు నమ్మకం లేదని ఒకాయన అన్నాడు. ఆయన భార్య, అత్తగారు ఈ మాట విని, మేము ఇద్దరం కలిపి నీచేత నరకమున్నదని ఒప్పించడానికి ఎంతోకాలం పట్టదు అన్నారు గర్వంగా. నిజంగా వాళ్లు విజయం సాధించగలరా? నీ అభిప్రాయ మేమి?

15. ద్రౌపది, ధర్మరాజును సాధించిన విధమును వివరింపుము. మాయలేడికై వెళ్ళిన శ్రీరాముడు చనిపోయినట్లు భావించి, సీత, లక్ష్మణున్ని ఏ విధంగా సాధించినదో ఊహించి వ్రాయుము.

16. సాధింపులోనూ, ఇతర కలహప్రక్రియలోనూ ఇంటిలోని పాత్ర సామగ్రి ఏవిధంగా ఉపయోగపడుతుంది?

17. సద్గృహస్థు అనగా ఎవరు? సద్గృహస్థుకు ఉండవలసిన కొన్ని లక్షణాలు వ్రాయుము.

18. బిందుమొక్క ఉపయోగమును గూర్చి వివరముగా వ్రాయుము.

19. భార్య ఏమన్నా మాట్లాడక బెల్లంకొట్టిన రాయిలాగ ఉండేభర్తను లొంగదీయు ఉపాయములను కొన్నింటిని పేర్కొనుము.

20. భార్య ఏ మన్నా, పడి ఉండేటట్టి భర్తను తయారు చేయడానికి కొన్ని ప్రక్రియలను చెప్పుము.

21. ఎత్తిపొడుపు అనగా నేమి? కలహశాస్త్రంలో దాని ప్రాముఖ్యము లేమి?

22. కొన్ని ప్రసిద్ధమైన ఎత్తిపొడుపు వాక్యాలను సందర్భములను వివరిస్తూ వ్రాయుము. (ఇవి ఆధునికకవుల గార్హస్థ్యజీవితానికి సంబంధంగా ఉండడము అవసరము.)

23. భర్తను ఏడ్పించడానికి ఈ పుస్తకములో సూచింపబడినవి కాక, ఇంకా కొన్ని క్రొత్తపద్ధతులను ఊహించి చెప్పగలవా?

24. భర్త వంశాన్ని, వంశ గౌరవాన్ని తూర్పార బట్టడములో, ఆయనవంశాన్ని ఎన్నితరాలదాకా ఎత్తవచ్చు?

25. భర్తకు దగ్గరైన బంధువులు గాని, అత్తగారు, వదినగారు అటు వంటి వారుగాని ఇంటికి వచ్చినపుడు వారిపై ప్రేమనుచూపుతూ ఉన్నట్లు నటిస్తూ, వారు వెళ్ళిపోయేలాగున చేయడానికి ఎన్ని మార్గాలు ఉన్నవి? ఒక మార్గాన్ని గురించి విపులంగా వ్రాయవలెను.

26. తన అప్పగారికి చీర పెట్టవలయునని ఆలోచిస్తున్న. భర్త మనస్సు మార్చడానికి సుకుమారమైన రెండు పద్ధతులను చెప్పుము.

27. "కర్ణమర్దన" అను ప్రక్రియను ఎప్పుడు ఏ విధంగా ప్రయోగించవలయును? దాని ప్రయోజనమేమి?

28. భర్తపై ప్రేమఉన్నట్లు నటన ఎట్లో సూచింపుము.

29. "జవదాటి ఎరుగదీ యువతీ లలామంబు పతిమాట రతనాల పాడిమూట." — ఈ మాట ఎవరినిగురించి, ఎవరు అన్నారో చెప్పి, అది ఆదర్శమా కాదా అన్న విషయమును చర్చింపుము.

30. భర్తచెప్పినట్లు వినవలయును అను సూక్తిని ఖండిస్తూ ఒక వ్యాసము వ్రాయుము.

31. "ఏడేడు పదునాలుగు జన్మలకు నీవే భర్తవు కావలె" అని పతివ్రతలు అంటూ ఉంటారు. నీ కోరిక ఏమిటి? ఎన్ని జన్మల దాకా ఈ ఉన్నభర్తే ఉండాలంటావు?

32. తాను మంచిది అనిపించుకొంటూ నలుగురూ అయన్నే తిట్టే లాగున చేయటానికి కొన్ని ఉపాయాలు చెప్పుము.

33. తనవైపు బంధువులువస్తే తన భార్య వారిని అన్ని విధాల మర్యాద చేస్తున్నట్లే కనిపించింది భర్తకు. కాని వాళ్లు తెంచుకు పోయినారు - ఆ గృహిణి ఏం చేసిఉంటుంది?

34. సాధింపుకు అనుకూలసమయం ఏది? ఆ ప్రక్రియ ఎంతసేపు జరుపవలెను?

35. సాంధింపు మొదలైన కలహప్రక్రియలు జరుపునపుడు ఏరంగు చీర కట్టవలెను?

36. కలహం నడపడములో నాట్యశాస్త్రం ఎంతవరకు ఉపయోగిస్తుంది? కొంతమంది పోట్లాడుతూ వేసే గంతులు, ప్రదర్శించే హస్తవిన్యాసాలూ, ఏనాట్యసంప్రదాయానికి సరిపోతవి? కూచిపూడి సంప్రదాయమా? కథాకళీయా? మణిపూరునాట్య సంప్రదాయమా?

37. "ఇనుప తలుపులు వేసేవారేగాని, తీసేవారు లేరు." ఇవి హిందూసనాతన ధర్మము ననుసరించి జరిగిన వివాహానికి ఎట్లా సరిపోతుంది?

38. "భార్యను పొగడ్తవలన లోబరుచుకో వచ్చును" అంటారు. నీ అభిప్రాయం ఏమి?

39. భార్యను రోజు కోసారి కౌనుక్కోవాలె అని అబ్రహాం లింకన్ అన్నాడు? దాని అర్థం ఏమిటి?

40. దంపతులు ఇద్దరూ వాయిస్తూ ఉంటేగాని మధురమైన సంగీతం పుట్టదు. ఈ ఇద్దరిలో అసలువాయిద్యం ఎవరు వాయించాలె? పక్కవాయిద్యం ఎవరిది?

41. క్రొత్తగా పెండ్లిఅయిన మొగుడూ పెళ్ళాం ఒక బంధువుని యింటికి వెళ్ళారు. ఆ బంధువు, ఈమెను ఎందుకు పెండ్లాడినావు? అని అడిగాడు - పెండ్లికొడుకు "ఈవిడ వంట బాగా చేస్తుంది. అందుకని పెండ్లాడాను" అని అన్నాడు. ఆ మాటపైన ఆవిడకు చాలాకోపంవచ్చింది. ఎందుకు కోపం వచ్చిందో చెప్పగలవా?

42. మనిషికి తాత్కాలికంగా ఆకలి పోయిందీ అంటే, అతడు ప్రేమలో పడ్డాడన్నమాట. ప్రేమలో పడడముతోనే సగం ఆకలి పోతుందట. పూర్తిగా ఆకలి లేకపోవడము ఎప్పుడు సంభవిస్తుంది?

ఈ కథలలోని చమత్కారము గ్రహింపుము.

1. భార్య:-ఒకభార్య అన్నది. హోటలు యజమాని మీరు లేన పుడు వచ్చి, ముద్దు పెట్టుకోనిస్తావా అని అడిగాడు.

భర్త:- పోనీ ఒప్పుకోకపోయినావా? అద్దె అడగకుండా ఉండే వాడేమో?

భార్య:-అదేమీ లాభంలేదు।

2. నా భర్తకు నాయందు అమితమైన ప్రేమ. నిద్రలో, ఆయన అనేక పేర్లతో పిలుస్తూంటాడు.

44. వివాహము చేసుకొన్నవాడికి మాట్లాడడానికి కావలసినంత స్వేచ్ఛ ఉన్నది. భార్యకు ఇష్టమైన విషయాలను గురించి మాట్లాడవచ్చు. ఏమిటి ఈ కథలో చమత్కారము?

45. A. నీ భర్త పుస్తకాల పురుగా?
 B. కాదు మామూలు పురుగే।
 ఇందులో చమత్కారము ఏమున్నది?

46. పెళ్ళిఅయిన తరువాత ఎన్ని రోజులకు పోట్లాటలు ప్రారంభం అవుతవి?

47. ఇంట్లో పోట్లాడి భర్త ఛా. ఈ కొంపలో ఉండకూడదు అని గబగబా వెళ్ళిపోయినాడు. ఆ మాటలు వినికూడా భార్య ఏ మాత్రం భయపడక పోవడానికి కారణం ఏమిటి?

48. భార్య జరిపే కలహకార్య క్రమమువలన మానసికంగా బాధ కలగకుండా ఉండటానికి ఈ క్రింద పేర్కొనిన వానిలో ఏపని చేయడమువలన ఎక్కువ ప్రయోజనం ఉంటుంది?

1. పైన ఉత్తరీయం వేసుకొని ఇంట్లోనుంచి బైటకు వెళ్ళి పోవడము.

2. ఇంట్లో ఉన్నంతసేపూ చెవులలో దట్టమైన దూది దిండ్లు పెట్టుకొని ఉండడము.

3. ఏదో పుస్తకమును చదువుటలో మనస్సును లగ్నంచేయడము.

4. రేడియో త్రిప్పి వాల్యూము హెచ్చించడము.

49. గృహస్థు తాను లోకానికి చాలా ఉపకారం చేసినట్లు స్నేహితులతో పలుమారు అనడము విని, భార్య ఒకసారి విలవతీసి అడిగింది. "ఏమిటండి, అందరిలోనూ అల్లాగ గొప్పలు చెప్పుకుంటారు. మీరు లోకానికి చేసిన ఉపకారం ఏమిటో చెపుదురూ?" అని.

గృహస్థు:- "నేను నిజంగా సంఘానికీ, లోకానికి ఉపకారం, మేలు చేశాను. నేను ఆ పనిచేసి అధమమూ ఒక ప్రాణినైనా కాపాడినట్లు లోకం గుర్తించాలె" అన్నాడు.

భార్య నవ్వి "ఏమిటి ఆ మేలు?" అన్నది.

"ఆ మేలు ఏమిటంటే, నేను నిన్ను పెళ్ళిచేసుకోవడమే!"

అన్నాడు గృహస్థు.

# ప్రణయ కలహం

భార్యాభర్తలకు మధ్య పోట్లాటవస్తే దానిని ప్రణయ కలహం అంటారు. ప్రణయం కలచోట పుట్టిన కలహం కాబట్టి దానిని ప్రణయ కలహం అని అనుకొంటారు కాని నిజానికి అది ప్రణయ కలహం కాదు. అది పోట్లాట. అట్లాంటి పోట్లాటకు శాస్త్రీయ గౌరవం లేదు.

ప్రణయ కలహం అనేది నిజానికి ఒక కలహం కాదు. అది ఒక వ్రతం. ప్రణయ కలహం జరుపవలెనూ అంటే. ఓ సత్యనారాయణ వ్రతం చేసి నంత చేయాలె. ఈ సంగతి చాలా మందికి తెలియక ఏ పోట్లాట వచ్చినా ప్రణయ కలహమే అనుకొని తృప్తిపడు తున్నారు. శాస్త్రాలు చదువక పోవడము వలన వచ్చిన ప్రమాదమిది. అందుకనే నేను నిజమైన ప్రణయ కలహం స్వరూపాన్ని చిత్రించి చూపాలని పూనుకొన్నాను.

మామూలు పోట్లాటలు అవంతట అవి వస్తవి. ఏవో మాట పట్టింపు మీదనో, అభిప్రాయ భేదంవల్లనో, భార్యాభర్తలు మాటా మాటా అనుకొంటే అది పోట్లాట అయింది.

ప్రణయ కలహం అటువంటిది కాదు. నాయకుడు ప్రొద్దున్నే లేచి ఇవ్వాళ ప్రణయ కలహం పట్టాలి అనుకొని దానికై బోలెడు ప్రయత్నంచేసి రాత్రికి ప్రణయ కలహం జరుపవలె. నాటుకలహాల మార్గం వేరు. ప్రొద్దున్నే లేచి ఇవ్వాళ మా ఆవిడతో పోట్లాడాలె అని ఎవరూ అనుకోరు. అల్లాగ ముందుగా అనుకోకుండా, దాని కోసం ప్రయత్నము చేయకుండా వచ్చిన పోట్లాటకు ప్రణయ కలహానికి ఉన్న గౌరవమూ ప్రతిష్ఠా లేవు.

పోట్లాటలు అనుకోకుండా వస్తవి. ప్రణయ కలహాలు చిట్టి బొట్టు నోము పట్టినట్టుగా పడతారు. పోట్లాటలు ఎట్లా నడుస్తవో ఎవరు చెప్పలేరు. వాటి నడకకు ఒక నిర్దిష్ట మార్గము లేదు. ఇట్లా నడువవలె, ఇట్లా జరుగ కూడదు అని విధి నిషేధాలు ఏమీ లేవు. ప్రణయ కలహానికి ఈ లక్షణాలన్నీ ఉన్నవి.

ప్రణయ కలహము నడిచే విధానము ఒకటున్నది. కొన్ని నియమాలను, శాస్త్రీయ మర్యాదలను అనుసరించి నడిచేది ప్రణయ కలహం. ఆ మర్యాదలకు భిన్నంగా నడిచిందా అది అశాస్త్రీయమై గౌరవాన్ని కోల్పోయినది అవుతుంది. కాబట్టి ప్రణయ కలహం అనేది ఒక వ్రతం లాంటిది అనీ, దానికి ఒక విధానం ఉందనీ, జ్ఞాపకం ఉంచుకొనవలయును.

ప్రణయ కలహం పట్టాలని అనుకొంటే ఎవ్వరితో పట్టాలె అన్నది మొదటి ప్రశ్న. మనలను ప్రేమించే స్త్రీ ఎవరైనా ఒకర్తె ఉంటే ఆవిడతో ప్రణయ కలహం జరుప వచ్చు. ప్రియురాలు అంటూ ఒకతె ఉంటే ఆమెతో మాంచి ఒకటో రకం ప్రణయ కలహం జరుపవచ్చు. కాని ఈ రోజులలో ప్రియురాలును సంపాదించుకొనడము అంత సులువైన పనికాదు.

మాలో కొంత మంది, కృష్ణశాస్త్రి అటువంటివాళ్లు ఓ చిన్న ప్రియురాలును సృష్టించుకొని ఆవిడతో ప్రణయ కలహం పట్టినట్టు వ్రాసికొని, సరదా తీర్చుకొన్నారు.

కాని నిజం సంగతి ఏమిటీ అంటే ఆయనకు ప్రియురాలూ లేదూ నా తలకాయ లేదు. అసలు ఆ మాట ఆయన స్నేహితులమైన మేము ఎవ్వరమూ నమ్మలేదు. పోనీ ఏదో ఈ విధంగా సరదా తీర్చుకొంటున్నాడులే అనుకొని నవ్వి ఊరుకొన్నాము.

ఒక సారి వాళ్ళ అమ్మ అడిగింది కూడా. ''ఏమిట్రా నాయనా ఇదేం గొడవ; నీవు ప్రియురాలా అని పద్యాలు వ్రాస్తావుట; నీకు ప్రియురాలు ఏమిట్రా బాబూ?'' అని.

కృష్ణశాస్త్రి ముసి ముసి నవ్వులు నవ్వుతుంటూ, వాళ్ళ అమ్మదగ్గరకు వెళ్ళి ''ఒట్టిదేనే అమ్మా, అలాగ తమాషాకు వ్రాస్తున్నాను'' అన్నాడు.

''అంతేలే నాయనా, కాకపోతే నిజం అని ఎవరు అనుకున్నారులే! ఇక అటువంటివి వ్రాయకు. అంతగా నీకు ఏమైన వ్రాయాలని బుద్ధి పుడితే కోడలు మీదే వ్రాయి'' అన్నది ఆ ముసలమ్మగారు.

ఇక మా వేదుల కూడా మొదట్లో ఏదో కాస్త పిచ్చి పిచ్చిగా ఉండి ప్రియురాలు ప్రియురాలు అనడం సాగించే సరికి ఆయన భార్య ''మీకు ప్రియురాలు ఏమిటండీ, నా బొంద! ఎవరైనా వింటే నవ్వు తారు. ఎవరో వ్రాశారు అంటే అది వేరే సంగతి. మన అందానికి తోడు ప్రియురాలు కూడాను టండీ'' అని గట్టిగా మందలించేసరికి, ఇక ఆ రోజునుంచి ప్రియురాలి సంగతి ఎత్తకుండానే ఏవో పద్యాలు వ్రాసుకుంటున్నాడు పాపం.

నిజమే మరి. కృష్ణశాస్త్రికి ప్రియురాలు ఉన్నదంటే ఎవరైనా నమ్మితే నమ్మవచ్చు. మనిషి అందంగా ఉంటాడు. అందంగా కనపడడానికి, కూడా అనేక విధాలుగా ప్రయత్నిస్తాడు.

వేదుల అంద చందాల విషయమై యాథార్థ్యం మీ మనస్సుకు గో- రించడానికి ఒక వృత్తాంతము చెపుతాను.

వేదులనూ, నన్నూ చూస్తే, పెద్దవాళ్ళ మాట అటుంచి పసిపిల్ల లటువంటివాళ్లు కెవ్వున కేకేసి తల్లి వెనకాలకు పరుగెత్తుకొని వెళ్లుతూ ఉంటారు. మా ఇద్దరిలో ఎవ్వరిని చూచినా ఇది జరుగు తుంది. ఇక మేము ఇద్దరం కలిసి ఒకేసారి ఎవరింటికైనా వెళ్ళి పిల్లలకంట బడ్డామా ఓరి బాబో, ఆ పిల్లలందరూ ఒక్కసారి పెద్దగా ఏడ్చి నానాగోల చేస్తారు. అటువంటి స్థితిలో ఏ సౌందర్యవతి మా ముఖం చూస్తుంది నిజానికి!

నే నొకసారి వాళ్ళింటికి వెళ్ళాను. వేదుల ఇంట్లో లేడు. ఆమెగారు ఎక్కడో దొడ్లో ఉన్నది. ఏణ్ణర్థం వయస్సు గల పసిపిల్ల ఒకతె నా కెదురుగా వచ్చింది. ఆ బిడ్డను నేను చటుక్కున ఎత్తుకున్నాను.

ఎవరినైనా అల్లాగ ఎత్తుకొన్నప్పుడు ఆ పిల్ల నా ముఖం చూచి కెవ్వున కేకేసి ఏడ్వవలసిందేగా। వేదుల కూతురు ఏడ్వలేదు సరి గదా. చిక్క ముఖం అయినా పెట్టక నవ్వుతూ తన చిట్టి చేతులతో నా మీసాలు అవీ సర్ది కేరింతలు పెట్టింది. నేను బ్రహ్మానంద భరితుణ్ణి అయినాను. ఆ పిల్లను దీవించాను. ఈ బిడ్డ ఒక్కతే నా హృదయగత మార్దవాన్ని గ్రహించింది అనుకొన్నాను.

కాని ఈ పిల్ల అందరివలె భయపడక పోవడానికి కారణము ఏమిటా అన్న సందేహము నన్ను బాధించగా, అక్కడే నిలవబడి ఈ దృశ్యాన్నంతా చూస్తున్న వేదుల భార్యను అడిగినాను. ఏమమ్మా, నన్ను జూస్తే సాధారణంగా ఏ పిల్ల అయినా భయపడుతుంది. ఈ బిడ్డ ఏమీ భయపడటం లేదు.—చాలా ధైర్యం గలదా ఏమిటమ్మా? అని.

"ధైర్యం కాదు ఏమీ గాదు. వట్టి పిరికి పిల్ల. పిల్లిని జూచి ఏడుస్తుంది."

"అయితే ఈ కొత్తముఖం చూచి ఏ మాత్రమూ భయపడలేదేమమ్మా?" అన్నాను.

"ఆ౹ అది వాళ్ళ నాన్నగారి ముద్దు బిడ్డ. ఆయన ఎప్పుడూ దాన్ని ఎత్తుకుంటూ ఉంటారు. అందు కని వాళ్ళ నాన్నముఖం చూడడము దానికి బాగా అలవాటు అయింది. అందు చేతనే మీ ముఖం దానికి క్రొత్తగా లేదు" అని ఆమెగారు పక పకా నవ్వింది.

ఇదంతా ఎందుకు చెప్పానంటే మాబోటి మహా కవులకే ప్రేయురాండ్రను సంపాదించడము కుదరలేదు. మీకేం పడుతుంది. ఆ విషయం తల పెట్టవద్దు బాబూ అని చెప్పడానికి.

వేశ్యతో పరిచయం ఏర్పరచుకొని దాని చేత ప్రణయ కలహం పట్టించవచ్చు. కాని అది డబ్బు లాగేస్తుంది. డబ్బు బాగా ఉన్న వాళ్లూ జమీందారులూ ఆ పని చెయ్యవచ్చు.

పోతే, పనిచేసేది ఒకటే ఉంది. పోనీ, దానిని పిలిచి, ప్రణయ కలహం పట్టవే అంటే పడుతుందేమో అని అనుకోవడము పట్టి

భ్రమ. "అదేటండి బాబు, నాను పట్టలేనండి. మీరు పట్టండి బాబయ్యా. నాను సాయం ఉంతాను" అంటుంది. కామశాస్త్రం చదివిన వేశ్య పట్టమంటే శాస్త్రోక్తమైన ప్రణయ కలహం పడు తుంది. కాని పాపం దీనికేం తెలుసు! వేశ్యను వద్దనుకొంటిమి. పనిచేసేది పనికిరాదనుకొంటిమి, ఇక ఏమిటి మార్గము? ఆలోచిద్దాము.

## 2

దేనికైనా మనపూర్వులు చేసినపని మనకు ఆదర్శంగా ఉంటుంది. ఈ ప్రణయకలహ విషయమూ అంతే.

క్రితం ప్రకరణములో మనము ప్రణయ కలహము ఎవరితో పట్టాలె అని అనుకొని కొన్నివిషయాలు ఆలోచించినాము. ఎవరితో పట వలెనో తేలలేదు.

ఈ విషయం తేల్చుకోవాలంటే మనపూర్వులు ఎవరు ఎవరితో పట్టారూ, ఎట్లా పట్టారూ అన్నవిషయము తెలుసుకొని, ఆ విధంగా అచరించడమన్నది ఒకటే సరియైనమార్గం.

అలసాని పెద్దన్న శుద్ధ ఛాందసుడులాగ కనబడుతున్నాడు. ఆయన తన భార్యచేత ప్రణయకలహాలు ఏమీ పట్టించి ఉండడు. శ్రీనాథుడు డబ్బు బాగా సంపాదించి వేశ్యలతో ఈ మన్మథక్రీడ జరిపిఉంటాడు. కాని ఈ మహాకవులంతా తాము ఆ క్రీడను ఎట్లా జరిపెందీ వ్రాయక తాము సృష్టించిన నాయికలద్వారా మనకు ఆ విధానము అంతా తెలియజేసినారు.

కాబట్టి ప్రణయకలహం ఎట్లా పట్టాలా అని ప్రశ్న వచ్చినపుడు, ఆ నాయికలు అందరూ ఎట్లా పట్టినారో మనమూ అట్లాగే మన నాయికలచేత పట్టించవలెనూ అన్న సమాధానం రానేవస్తుంది.

ఈ నాయికలలో స్వీయ, పరకీయ అని రెండురకాలుగా ఉన్నారు. దానేది, మరెవరైన ప్రేమింపబడిన స్త్రీ సామాన్య నాయికలుగా పనికివస్తారు. కాని కొన్ని కారణాలవల్ల మనము సామాన్యను తీసుకో వద్దు అనుకొన్నాము.

కాబట్టి, ఏతా వాతా ప్రణయకలహం పట్టించటము అంటూవస్తే, ఇంటావిడచేతనే పట్టించడము అన్నివిధాల మంచిది అని తోస్తున్నది. ఈ స్వీయచేత ప్రణయకలహము పట్టించే విషయములోగల సాధక బాధకాలను గురించి ఆలోచిద్దాము.
ముందు స్వానుభవమే చెపుతాను. ఒకసారి నాకుకూడా మా ఆవిడ చేత ప్రణయకలహం పట్టిద్దామని బుద్ధిపుట్టి "ఏం కాంతం! ప్రణయ కలహం పడతావా?" అన్నాను.

ఆవిడను ఏమో తెలియలేదో ఏమి కర్మమో తెల్లపోయి ఒకక్షణం అల్లాగేనిలబడి చివరకు "నాబొంద. ప్రణయకలహం పట్టడము ఏమి టండీ? నేను పట్టను'' అన్నది ఈసడింపుగా.

''ఒక్కసారి పడుదూ నీకు పుణ్యం ఉంటుంది'' అని కాస్త బతిమి లాడుతున్నట్లు మాట్లాడినాను.

''నేనుపట్టనూ అంటే పట్టను" అన్నది.

''చాలా సరదాగా ఉంటుంది. ఒకసారి పడుదూ" అని మళ్ళీ బతిమి లాడితే ఆమెగారు కాస్త మెత్తపడి. ''అయ్యోనన్ను తగలెయ్య అది ఎట్లా పట్టాలో నాకు తెలియందే. నన్నేమి పట్టామంటారండీ!" అని విసుక్కున్నది.

''మీ అమ్మా. అత్తయ్య వాళ్లు పడుతూంటే నీ వెప్పుడూ చూడలేదా ఏమిటి?'' అని అడిగినాను కోపంగా.

౮. ఆమెకళ్లుపెద్దవిచేసి కోపంగాచూచి, "చాలు చాల్లెండి, ఇటువంటి మాటలు అంటే నేను ఊరుకోను. మీచెల్లెళ్లవాళ్లు పడతారేమో ఇటు వంటివి! మా అమ్మకేం కర్మం అండీ? పండంటి ముత్తయిదువును పట్టుకొని అల్లాగ అంటిరా అంటే కళ్లు పోతవి సుమండీ!" అన్నది.

అంతటితో ఆ విషయము వదిలేశాను. ఎందుకంటే అల్లాగ మాట్లాడుతూ ఉన్న మనిషితో ప్రణయకలహము జరుగడము అసంభవము. మెల్లి మెల్లిగా ఆమెను అనుకూలవతిగా దిద్దుకొని క్రమంగా. ఈ ప్రణయకలహ విధానం ఆమెకు బోధపరచి అప్పుడు పట్టమంటే పడుతుందేమో కాని ఇప్పుడు ఏమీ తెలియని అమాయకురాలిని పట్టమంటే ఏంపడుతుంది పాపం అనిపించింది.

ఇప్పుడు ఒక విషయం స్పష్టంగా తేలిపోయింది. స్త్రీయ అయినా కామశాస్త్రం బాగాచదివిన మనిషి అయితేనే ఈ కామక్రీడ శాస్త్రీయ పద్ధతిని జరుపగలదుగాని అజ్ఞానురాలు ఈ విలాసక్రీడ జరుపలేదు. కామశాస్త్రం చదివితే ఏయే విషయాలు తెలుస్తవి? ఎటువంటి అర్హతలు గల మనిషి. ఏ వయస్సులో ఉన్న మనిషి ప్రణయకలహం జరుపడానికి పనికివస్తుందన్న విషయం విచారిదాము.

# 3

ఈ ప్రణయ కలహాల గోల కావ్యాలలో విషయంగదా మన కెందుకూ అని ఒక ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం చెబుతున్నాడు ఈ శాస్త్రకారుడు :

కావ్యానికి, కుటుంబానికి చాలా విషయాలలో సామ్యంఉన్నది. మొదటి విషయం కావ్యానికీ, గృహానికికూడా కాంతా సన్నిధానం ఒకటి ఉండాలె.

కావ్యానికి ఇంట్లో ఉంటూఉండే కాంతకి చాలా పోలికలు ఉన్నవి. కావ్యానికి శరీరం ఉన్నది. శబ్దార్థములు కావ్యానికి శరీరము. కాంతకూ శరీరము ఉన్నది. కామినికికూడా కావ్యానికి వలెనే అలంకారాలు ఉండాలె. కావ్యానికి పాకముఅంటూ ఉంటుంది. మధుర

మైన పాకంలోపడ్డ కావ్యాన్ని అంతా మెచ్చుకొంటారు. తియ్యని పాకం చేయగల కాంతనూ అంతా మెచ్చుకొంటారు

కావ్యానికీ కామినికీ కమనీయత్వం ఉండవలెను కదా!

చః రెండు విషయాలలో కూడా రమణీయమైనశయ్య అవసరము. ఉభయత్రా శయ్యలో విశ్రాంతి ఉన్నది.

కావ్యము కాంతాసమ్మితంగా ఉండవలె. కాపురంలో వ్యవహారం కూడా కాంతాసమ్మితంగా ఉండకపోతే పోట్లాటలతో గృహస్థజీవితము కంటకావృతం అవుతుంది.

కాబట్టి కావ్యం వేరు, కాపురం వేరు అని అనుకోవద్దు. కావ్యములో జరిగే విషయములన్నీ కాపురంలో జరగడానికి వీలు ఉన్నదని గ్రహించవలసి యున్నది.

పోతే కావ్యాలలో ఉండే కథానాయికలు ఎనిమిది రకాలుగా ఉన్నారు కదా! మన ఇళ్ళల్లో ఉండే కథానాయికలు అన్నిరకాలు ఏరీ అని అడుగవచ్చును. దీనికి సమాధానం చెప్పకపోతే, కాపురానికీ కావ్యానికీ ఉన్న పోలిక అన్నివిధాలా కుదరకుండాపోతుంది.

ఈ ఎనిమిదిరకాల నాయికలు పుట్టుకలోనే ఆ రకం మనుష్యులుగా పుట్టుకువచ్చినవాళ్ళు కాదు. నాయకయొక్క అవస్థనుబట్టి ఆలాగ విభాగం చేసినారు. ఒకే అమ్మాయి ఒక్కొక్క స్థితిలో ఒక్కొక్క రకం నాయికగా తయారై కూర్చుంటుంది.

మా కాంతసంగతి చెబుతాను. ఒక్కొక్క సన్నివేశంలో ఒక్కొక్క రకం నాయికగా అగుపిస్తుంది ఆవిడ! నేను వేళకు ఇంటికి రాకపోతే ఆ రోజున ఆమె తహ తహను పొంది విరహోత్కంఠిత అయ్యేది. నేను ఆమెతో పోట్లాడి ఇంట్లోనుంచి వెళ్ళిపోయినరోజున ఆమె కలహాంతరిత. నేను గ్రామాంతరము వెళ్ళినరోజున ఆమె ప్రోషితభర్తృక. నేను దొడ్లో మంచంమైన పడుకొని ఉండగా నాకోసం వెతుక్కుంటూ వచ్చినపుడు ఆమె జ్యోత్స్నాభిసారిక. నేను వస్తానని నాకోసం వేచియున్నపుడు ఆమె వాసకసజ్జిక. ఇట్లే ఆవిడ ఒక్కొక్క అవస్థలో ఒక్కొక్క రకము నాయికగా ఉండేది.. కాబట్టి ప్రబంధనాయికలు ఆకాశంమీదినుంచి ఏమీ ఊడిపడలేదు.

వాళ్ళూ మనవాళ్ళలాంటివారే. అంటే మన ఆడవాళ్ళుకూడా ప్రబంధ నాయికల వంటివారే. అయినప్పుడు ప్రబంధనాయికలే ప్రణయ కలహం పట్టవలె. మనవాళ్ళు పట్టకూడదు అంటే నేను ఒప్పుకోను. ఇంతకూ నేను ఈ ప్రకరణంలో ఏమి చెప్పినానంటే మనవాళ్ళు కూడా ప్రణయకలహం జరుపడానికి ఎట్టి ఆక్షేపణాలేదూ అని మాత్రమే.

## 4

ప్రబంధ నాయికల వలెనే మన వాళ్ళచేత కూడా ప్రణయ కలహం జరిపించ వచ్చునని ఇంతవరకు తేల్చినాము. అంటే మన కాపు రాల్లో ఉండే వాళ్లు స్వీయలు అన్నమాట.

అయితే పెళ్ళిచేసుకొని కాపురం చేస్తున్న ప్రతి ఆడదీ ప్రణయ కలహం పడతానంటూ కూర్చుంటే వీల్లేదు. అసలు స్వీయ అంటేనే ఎన్నో సుగుణాలు కలదై ఉండాలి. లజ్జా సామాగ్రియు, పాతి వ్రత్యమును కలిగి కోమలత్వమూ, కమనీయత్వమూ కలది స్వీయ అన్నాడు.

స్వీయ అనబడే స్త్రీ అమృతమువలె పరిశుద్ధమగు గుణమునూ, చంద్రకళవలె స్వచ్ఛమైన భావమునూ, శివగోత్రభూతియు, శుభ వంశక్రమమునూ కలిగి వుండవలెను అన్నాడు.

ప్రణయ కలహమనే మన్మథక్రీడ జరుపటానికి స్వీయస్వాధీనపతిక అయి యుండవలెను అన్నది రెండవ విషయంగా గ్రహించవలసి ఉన్నది.

స్వాధీనపతిక అంటే ఎవరూ అని ప్రశ్న. స్వాధీనపతిక లక్షణాలు చెపుతూ ప్రతాపరుద్రీయము అనే అలంకార గ్రంథంలో ఇల్లాగ అన్నాడు: ప్రియునిచే నిత్యమూ ఉపలాలిత అయిన యువతి స్వాధీనపతిక అవుతుందీ అని.

అదేమంత మహా భాగ్యం కాదు. నీవు ఏ భార్యను నిమిషంలోకి స్వాధీనపతికగా దిద్దుకోవడానికి వీలు వున్నది. స్వాధీనపతిక నిత్యమూ ఒక సారి ఉపలాలిత కావాలె. ఒక సారి ఏమి కర్మం. ఆమెను రోజుకు మూడు సార్లు ముద్దెట్టుకొని, ఇరవై సార్లు బతిమిలాడితివా, ఇక ఆమె మొదటి శ్రేణికి చెందిన స్వాధీనపతిక అయి కూర్చుంటుంది.

పరపురుషుని కన్నెత్తి చూడక పోవడము స్వాధీనపతికకు వుండవలసిన రెండవ లక్షణము. ఈ లక్షణము మనవాళ్ళందరికి బాగానే పట్టింది మనము ఇంట్లో లేనపుడు ఎవరైనా వచ్చి పిలిస్తే, మన వాళ్లు చస్తే పలకరు. మొహం అయినా చూపరు. ఆ వచ్చినవాడు అరచి ఇంట్లో ఎవ్వరూ లేరు కామోలు ననుకొని వెళ్ళిపోవలసిందేగా! కాబట్టి మన వాళ్లు మాంచి పతివ్రతలు.

ఇటువంటి స్వాధీనపతికలు ప్రణయ కలహం పట్టటానికి అర్హత కలిగి యున్నారు. ఇంతవరకు బాగానే వున్నది.

అయితే ప్రణయ కలహం పట్టడానికి ఈ రెండూ కాక మరొక లక్షణం కూడా కావాలట.

ఏమిటీ అంటే, కావాలన్నపుడు మిక్కిలి స్వల్పమైన కారణము ఆధారంగా చేసుకొని, భర్తమీద అలిగి కోపం తెచ్చుకొనే శక్తిగలిగి ఉండవలెనూ అన్నాడు శాస్త్రకారుడు. ఈ విషయంలో మనవాళ్లు ప్రబంధస్త్రీల కింటే ఎక్కువ అర్హతనే సంపాదించినారు. వాళ్లు అలగటానికీ, భర్త పైని కోపించడానికీ ఏదో చిన్నదైన కారణం అంటూ ఒకటి ఉండాలె. ఎంత చిన్న విషయానికి అలిగితే అంత ప్రేమగలది అవుతుంది భార్య—జమదగ్ని శర్మ. మన వాళ్ళకు అదీ అక్కర లేదు. ఏ కారణమూ అక్కర లేకుండానే ముక్కూ మూతీ ముడుచుకొని అలిగి కూర్చో గలరు.

నాలుగోది ప్రౌఢస్త్రీ మాత్రమే ప్రణయ కలహం పట్టటానికి అర్హతను కలిగి యున్నది అన్నాడు.

ప్రౌఢ అంటే ఎవ్వరూ, ఏ లక్షణములు గలది ప్రౌఢ? అన్న విషయానికి వచ్చేశాము.

సంపూర్ణమైన యౌవనము గలదై విశాలములైన నేత్రములూ, వంకర తిరిగి యున్న కనుబొమ్మలూ, సన్నని నడుము, పెద్దవైన పిరుదులు, మందమైన నడక కలిగిన స్త్రీ ప్రౌఢ. ఇందులో ఏవి తక్కువ మనవాళ్ళకు!

పోతే మళ్ళీ ఈ ప్రౌఢనాయికలలో ధీర, అధీర, ధీరా ధీర అనే భేదాలున్నవి. వీరందరికీ ధీరత్వము సామాన్యలక్షణము ఏవిషయ మున ధీరత్వమూ అంటే మానవిషయమున, మానము అంటే కోపము. అంటే ధీర అయినా, అధీర అయినా, ధీరా ధీర అయినా, ఎవరైనా సరే. భర్త కోపించే విషయములో ఒకటే!

వీరందరూ భర్తను ఎత్తి పొడుపుమాటలతో పరిహసించి కన్నీటితో పరుషవాక్యములాడి కోపమును ప్రవర్శిస్తారు.

ఇంతకూ ఏమంటాడంటే శాస్త్రకారుడు, భర్తపై కోపం చూపడము తెలిసి వుండాలె అంటాడు. అంతేగా! మన ఇల్లాళ్ళకు ఆ విషయం ప్రబంధ స్త్రీలకంటే ఎక్కువగానే తెలుసునయ్యా, ప్రణయ కలహం జరుపటానికి మా వాళ్ళకు అర్హత లేదని నీవు ఎట్లా అనగలవు అని అంటాను నేను.

ప్రబంధ నాయికల కంటే వీళ్ళకు ఈ విషయం ఎక్కువగా తెలుసు నని ఎందుకు అన్నానో చెపుతాను. భర్త అపరాధం చేసినపుడు నాయిక అలిగి కన్నీరు కార్చవలెనూ అన్నాడు శాస్త్రకారుడు. మన వాళ్లు, భర్త ఏ అపరాధమూ చెయ్యకపోయినా అలుగనూ గలరూ, ఏడ్వనూ గలరు. రెండో సంగతి, భర్త మరొక స్త్రీతో సాంగత్యము చేశాడని తెలిస్తేనే ప్రబంధనాయిక ఏడ్చేది; మరెందుకూ ఏడ్చేది కాదు. మన వాళ్లు దేనికి బడితే దానికే ఏడుస్తారు! మా కాంతం మట్టుకు మా కాంతం, ఏడ్వడానికి కారణాలు పది పదిహేను కార ణాలుదాకా పెంచింది.

మొగుణ్ణి ఎత్తి పొడుపుమాటలు అనగలిగి ఉంటే గాని ప్రణయ కలహం జరపడానికి పూర్తి అర్హత రాదు. ఈ విషయంలో కూడా మన వాళ్ళు ఏమీ తక్కువ తినలేదు.

రాత్రి పరకాంతతో కాలం గడిపి వచ్చిన భర్తతో ఒక నాయిక. "ఏమయ్యా! నీ మొగాన చెమట పోసింది. తోటలో విహరించి అలసిపోయినావా?" అని మృదువుగా సోత్ప్రాసముగా తన కోపాన్ని ప్రకటితం చేసిందట.

మనవాళ్ళయితే. అల్లాగ మెత్త మెత్తగా మాట్లాడరు. తల వాచేటట్లు చీవాట్లు వేస్తారు. అరగంటసేపైన సాధించక మానరు. "ఇల్లు కనపడ్డదండీ! ఇంటిదగ్గర పెళ్ళాం ఉన్న సంగతి తమకు జ్ఞాపకం వచ్చిందీ! నేను ఏ నుయ్యో గొయ్యో చూచుకొన్నదాకా మీరింతే" అంటుంది. అంతటితో ఊరుకుంటే అదృష్టవంతులమే. ఇంకా ఘాటు అయిన మాటలు అంటుంది. కూడు పెట్టదు! పక్క వెయ్యదు! నానా హింసా పెడుతుంది!

కాబట్టి నేను చెప్పదల్చుకొనిన విషయము ఏమిటీ అంటే. మొగుణ్ణి ఏడ్పించేవిషయంలో మనవాళ్ళకే ఎక్కువ అర్హత ఉన్నది అని.

ఇంతవరకూ నేను చెప్పిన విషయము ఏమిటీ అంటే - మనవాళ్ళు ప్రబంధనాయికలకు ఏ విషయములోనూ తీసి పోరని. ఆ కారణంగా వీళ్ళకు ప్రణయకలహం పట్టటానికి అన్ని అర్హతలూ ఉన్నవీ అని!

## 5

ఎల్లాంటిఅర్హతలు గల స్త్రీ ప్రణయకలహం పట్టవచ్చునో ఇంత వరకు చెప్పినాను. ఇక అది పట్టేపద్ధతి చెపుతాను.

భార్యా భర్తలు రేపు ప్రణయకలహం పడదామని ఒకరోజు ముందు గానే అనుకోవాలి. కాస్త మంచిరోజు చూచుకొంటే. మరీ మంచిది. దానికి ప్రణయకలహం జరుపుదామనుకొంటే ఆ రోజు నిద్రలేచి నప్పటి నుండి ప్రయత్నాలు ఆరంభించవలె.

మొదటి సంగతి. ఆ రోజున మాంచి ఉత్సాహంగా ఉండాలె. ఏ విచారమూ పెట్టుకోకూడదు. ఆ రోజున కాస్త ఖర్చు ఉంటుంది. కాబట్టి చేతిలో పదిరూపాయలన్నా లేనిది ప్రణయకలహానికి ముహూర్తం పెట్టుకోవద్దు.

జమీందారుకైతే ఏ రోజు అయినా పరవాలేదు. భూస్వాములు సంవత్సరాది పండుగ రోజున ఈ వ్రతం ఏర్పాటుచేసుకొంటే మంచిది. బీదవాళ్ళు ఎప్పుడైనాసరే. ఎటొచ్చీ మనబోటిగాళ్ళు మాత్రం జీతంవచ్చిన రోజుననే ఈ కార్యక్రమము ఏర్పాటుచేసుకోవాలె. దీనినే మాధ్యమిక సిద్ధాంతం అన్నారు బౌద్ధులు.

ఆ రోజు మంచి హుషారుగా ఉండాలని చెప్పినాను. భార్యా భర్తలు ఇద్దరూ కూడా అభ్యంజనస్నానము చేసి మంచి విలువైనవీ, అందమైనవీ అయిన వస్త్రములను ధరించవలెను. మృష్టాన్నభోజనము చేసి ఎండవేళప్పుడు కాసేపు నిద్రపోవడము మంచిది. ఎందుకంటే రాత్రి ఆ ప్రణయకలహం పూర్తిఅయ్యేసరికి ఎంతఅవుతుందో సరిగ్గా చెప్పడం కష్టంగదా !

ఒక గంట అటూ కావచ్చు, ఇటూ కావచ్చు. కాని సాధారణంగా ప్రణయ కలహాలు పదీ పదకొండు మధ్య అంతం అవుతూఉంటవి. నిద్రపోయి లేచిన తరువాత నృత్యగానాది వినోద కార్యక్రమము నందు కొంతకాలం గడుపవలయునని శాస్త్రకారుడు విధించినాడు. మనము నృత్య గానమును ఎక్కడ ఏర్పాటు చేసికోగలము. మధ్య తరగతి కుటుంబీకులము అని నిరుత్సాహము పొంది అసలు ఈ గొడవ లోకే దిగకూడదు అనుకొనేవాళ్ళూ ఉన్నారు. అది వట్టి తెలివి తక్కువ పని. దానికో ఉపాయము ఉన్నది. ఆ రోజుసాయంత్రం భార్యా భర్తలు సినిమాకు వెళ్ళితేసరి నృత్యగాన వినోద కాలక్షేపం పుష్కలంగా జరుగుతుంది. వెళ్ళేముందు అలా పార్కుమీదుగా వెళ్ళామా వనవిహారంకూడా కలిపివస్తుంది.

ఆ తరువాత మళ్ళీ మధుర పదార్థాలతో భోజనం చెయ్యాలె.

ప్రొద్దుగూకులూకూడా భార్యాభర్తలు నవ్వుతూ పేలుతూ ఉండడము అవసరము. ఒకరి నొకరు పలుమారు చూచుకొనడమూ. ఒకరిని చూచి ఒకరు నవ్వుకొనడమూ. రాసుకు రాసుకు తిరగడమూ. భ్రూభంగనేత్రచాలనాదులచే తమకు కలిగిన మనోవికారములను ప్రదర్శిస్తూ ఉండడమూ ఇవి చేయదగినపనులు.

భర్తను ఎవరైనా స్నేహితులు ''ఏమోయ్ చాలా కులాసాగా ఉన్నావు. ఏమిటీ సంగతి?'' అని అడిగితే. ఆయన "ఇవ్వాళ రాత్రికి మా ఆవిడ ప్రణయకలహం పడుతుందయ్యా'' అని చెప్పుకోవాలి.

ఇక నాయిక సంగతి. ఆవిడ ఒళ్ళు తెలియని సంతోషంతో ఉంటుంది. చెలికత్తెలు ఎవరైనా వచ్చి. "ఏమమ్మా ఏమిటి సంగతి?" అని అడిగితే. "ఇవ్వాళ రాత్రికి ప్రణయ కలహం పడతానే!" అని ముసి ముసి నవ్వుతూ చెప్పవలె.

చెలికత్తెలు నలుగురూ చేరి ఆ అమ్మాయిని ఆ రోజు సాయంత్రం అలంకరిస్తారు. సంపెంగనూనె పూసి తలదువ్వి. మిక్కిలి రమణీయమైనపద్ధతిని కేశరచన చేస్తారు. ఆమె కేశబంధాన్ని రకరకములైనవీ పరిమళ భరతములైనవీ అయిన పుష్పములతో అలంకరిస్తారు. ఆమె కొత్తచీర కట్టుకొని ఈ విధంగా కామక్రీడకు సంసిద్ధురాలు అవుతుంది.

రాత్రి తొమ్మిదీ తొమ్మిదిన్నర ప్రాంతాల భార్యా భర్తలు ఇద్దరూ పడకగదిలో చేరినతరువాత ఈ క్రీడ ప్రారంభం చెయ్యాలె.

చెప్పడము మరచపోయినాను. ఇంతకు పూర్వమే. శయ్యాగృహాలంకరణ. శయ్యారచన ఇవన్నీ శాస్త్ర పకారం జరుగవలసి ఉన్నది. చేసిపెట్టేవాళ్ళు లేకపోతే స్వయంగానైనా చేసుకోవాలి.

ఆ తరువాత నాయకుడు నాయికతో సరస సల్లాపాలు ప్రారంభించి తాంబూల చర్వణ సమయములోనో. మరో ఉచిత సమయములోనో ఏదో కొంటెమాట అని ఆమెకు కోపం తెప్పించడమే ప్రణయ కలహం ప్రారంభము చెయ్యడము అంటే.

నాయికకు కోపము తెప్పించడమూ, ఆమె అలగడమూ, నాయకుడు ఆమెను బతిమిలాడడమూ, ఆమె శాంతించడమూ ఇవీ ప్రణయ కలహంలోని ప్రధాన ఘట్టాలు.

ఈ సంగతి విని నా స్నేహితుడు ఒకాయన నిరసనగా నవ్వి, "నన్ను తగలెయ్య, ఇదేనటయ్యా ప్రణయ కలహము అంటే. నేను ఏమిటో అనుకొన్నాను। ఇది అయితే మా యింట్లో రోజూ జరిగే విషయ మేనే।" అన్నాడు.

"నీవు ఎల్లాగ కోపం తెప్పిస్తున్నావయ్యా!" అన్నాను. "కోపం తెప్పించాలని ప్రయత్నము కూడానా। నా తలకాయ కోపానికేం. ఎందుకైనా వస్తుంది" అన్నాడు.

ఇక్కడే చాలా మంది పొరపాటు పడుతున్నది. భార్య, "నేను పండుగకు మా పుట్టింటికి వెడతానండి" అంటుంది. భర్త "వద్దు. వెళ్ళడానికి వీలు లేదు" అంటాడు అనుకోండి. ఆ ఫలంగా ఆమెకు కోపం వచ్చేస్తుంది. దాని తరువాత ఏదో కార్యక్రమము జరుగు తుంది అనుకోండి. అది ప్రణయ కలహము అవుతుందా। చస్తే కాదు. కావడానికి వీల్లేదు.

ప్రణయ కలహములో కోపం ఒక నిర్దిష్టకారణమువల్ల రావాలె. అల్లాంటి కారణమువల్ల కోపం వస్తేనే అది ప్రణయ కలహము అవుతుంది.

అయితే ఎటువంటి కారణము వలన ప్రణయ కలహం ప్రారంభం అవుతుంది అనే ప్రశ్న వస్తుంది. రావలసిన ప్రశ్నే అది.

అసలు ఈ కోపం మూడు రకాలు, గురు కోపము, మధ్యమ కోపము, లఘు కోపము అని.

పరస్త్రీసంగమ ప్రశంస వలన వచ్చేది గురు కోపము. అది చాలా పెద్ద కోపము అనిన్నీ, ఎంతో శ్రమపడితే గాని ఆ కోపం పోదని, శాస్త్రకారుడే చెప్పినాడు. పరస్త్రీ సంగమ ప్రశంస తీసుకువచ్చి, భార్యకు కోపం తెప్పించడము మనకు అంత క్షేమం కాదు.

ఇంకొక విషయము కూడా మనము ముందుగానే ఆలోచించుకోవ దము మంచిది. ఏదో విధంగా గురు కోపము తెప్పిస్తాము అను కోండి. దాని తరువాత ఆమెను శాంతింపజేయడము మన తరమా। శాస్త్రప్రకారం గురు కోపవశయైన యువతి తన కాళ్ళమీద ప్రియుడు పడగానే నవ్వి ఊరుకోవాలె. అల్లాగ మన వాళ్లు ప్రవర్తిస్తారని నమ్మకం ఏమిటి। అందులో ఇంకొక స్త్రీతో సంబంధం పెట్టు కున్నాను అని నీ నోటితో నీవే అన్న తరువాత ఆమె ఏం జెప్పినా నమ్మదు. ఎంత బతిమిలాడినా వినదు। నానా గోల చేస్తుంది. ఆమె చేసే హంగామాకు ఎవరు బాధ్యులు: శాస్త్రకారుణ్ణి "ఏమయ్యా, నా భార్య నీవు చెప్పినట్లు నడుచుకోలేదు. కాళ్ళమీద పడ్డా ఆమె కోపాన్ని విడువలేదు'' అంటే, ఆయనమటుకు ఏమి చేయగలడు?

మాటవరుసకు ఒక విషయం తీసికొందాము. ''ప్రణయ కలహ సందర్భంలో స్త్రీ ప్రియుని మీద అలిగినపుడు నీలోత్పలముతో ప్రియుణ్ణి తాడనము చేయవలెను'' అని ఉన్నది. నీలోత్పలము ఆ సమయానికి అందికలో లేకపోతే, ఆ పెద్దకోపంతో ఆమె ఏమి తీసు కొని కొట్టినా కొట్టగలదు గదా।

నీలోత్పలము ఎక్కడనుంచి వస్తుంది ఆ రాత్రివేళ అనవచ్చు. నిజమే. నీలోత్పలము కాకపోతే పోనీ తోటకూర కాడతో కొట్టినా మా బాగే కాని, ఆమె ఆ గురు కోపంలో ఏ పుస్తకమో, తాళం చెవులగుత్తో, నీలోఫలమో (పేపరు వెయిటు) తీసికొని నెత్తిమీద కొడితే ఆ తరువాత ఏమనుకొంటే ఏమి లాభం। కాబట్టి నా సలహా ఏమిటీ అంటే ప్రణయకోపం పట్టించాలని ఎంత ఉబలాటంగా ఉన్నా అల్లాగ పెద్దపెట్టున కోపం వచ్చేలాగున మాత్రం చేయవద్దు అని.

ప్రణయ కలహం నడపటానికి రెండవ మార్గము మధ్యమ కోపం తెప్పించడము. ఇది ఎల్లాగో, ఏ మాట అని తెప్పించవలెనో శాస్త్ర కారుడే స్పష్టంగా చెప్పినాడు. ఏమిటి అది అంటే నాయకుడు గోత్రస్ఖలనం చెయ్యవలెనట।

ఈ గోత్రస్థలనం ఏమిటి? ఈ మాట మనము ఎప్పుడు వినలేదే అని పిస్తుంది. అది కామశాస్త్రంలో ఉపయోగించే ఒక పదము. ప్రియురాలి సమక్షంలో ఆమె సవతి పేరు ఉచ్చరించుటే గోత్రస్థలనం అంటే!

ఇది మన కేమీ సాధ్యమైన విషయం గాలేదు. నాయకుడికి బహు భార్యలు ఉంటే, నాయికకు సవతులు ఏర్పడుతారు. మనలో చాల మందిమి ఏదో ఒక భార్యతోనే దేవులాడుతున్నాము గాని సాహసించి ఇద్దరినీ ముగ్గురినీ చేసకొనడము లేదు గదా!

ఈ గోత్రస్థలన విధానం రాజులకూ, జమీందారులకూ సాధ్యము అవుతుంది. ఎందు చేతనూ అంటే వాళ్ళకు ఒక్కొక్కళ్ళకు ఎంతో మంది భార్యలు ఉంటారు. పేరూ పెటాకులూ లేని అనంగ అనంగ ఒక రాజు అని అంటారే వాడికి కూడా ఏడుగురు భార్యలాయె! కాస్త ప్రతిష్ఠ గలవారికి ఎనిమిది మంది. అఫ్‌జుల్ ఖానుకు మూడు వందల మంది భార్యలు: మన దేవుళ్ళలో శివ కేశవులకు ఇద్దరిద్దరు; ఏడుకొండలవాడికి కూడా ఇద్దరు! ఇల్లాగే కాస్త ఉన్న ఆసాములు ఇద్దరినో ముగ్గురినో చేసికొని పోషించగలడు. అటువంటి వాళ్లు ఒక పెళ్ళాంతో ప్రణయ కలహం ఆడుతున్నప్పుడు రెండో భార్య పేరు చెప్పడము సాధ్యము అవుతుంది గాని, ఒక్కగాని ఒక్క భార్యతో ఎల్లాగో ఒరగబెట్టుకొని సంసారం గడుపుకొస్తున్న మనబోటివాళ్ళకు ఈ విధంగా స్వీయకు కోపం తెప్పించడము సాధ్యమైనపని కాగనే అనాలి!

ఇక మనము లఘు కోపము తెప్పించి సరదా తీర్చుకోవలసిందే గాని ఇంకో మార్గము లేదు.

ఈ లఘు కోపము ఎల్లాగ వస్తుందీ అని! అన్యస్త్రీ సందర్శనాదుల వలన పుట్టినది లఘు కోపము అన్నాడు.

పరాయి స్త్రీని చూస్తే చాలు ఆవిడకు కోపం వస్తుంది. అయితే ఇక్కడ ఒక శంక. మనము రాత్రి తొమ్మిది గంటల వేళ ప్రణయ

కలహం జరుపుచున్నాము గదా. ఆ వేళప్పుడు పరస్త్రీ ఎలా కనపడు తుంది అని! కిటికీలో నుంచి చూస్తే ఎవరైనా ఒకరు వీధి వెంట పోతున్నవాళ్లు కనపడనూ వచ్చు. కనపడకపోనూ వచ్చు.

వెధపరి చివరకు లఘు కోపం తెప్పించి ఈ సరదా తీర్చుకొందా మన్నా వీల్లేక వచ్చింది కదా! దీని కంతా కారణం మనము ధనవంతు లము కాకపోవడమే. ధనిక వర్గాన్ని ద్వేషించడానికి ఇదొక కారణము అనవచ్చు.

మనమే కనుక ఏ జమీందారు బిడ్డలమో అయి ఉంటే ఈ తిప్పలు లేకపోయేవి కదా! నిక్షేపంలాగ ఇద్దరినో ముగ్గురినో....కట్టుకొని అధమం మధ్యమ కోపం అయినా తెప్పించి దర్జాగా, ప్రణయ కలహం ఆడేవాళ్ళం గదా! ఈ విషయం తల్చుకుంటే దుఃఖం కూడా వస్తుంది. వెధపరి లఘు కోపంతో మనము సరిపెట్టుకోవలసి వచ్చిందే అని!

ఇంతకూ పరస్త్రీ సందర్శనం ఎట్లా జరుగుతుందీ అని ప్రశ్న వచ్చింది. ఇట్లా అంటే శాస్త్రమర్యాదకు భిన్నం కాకుండా ఉంటుంది. ఏమనీ అంటే "మన వెంకటేశ్వర్లు భార్యను ఎరుగుదువుగా? అని ప్రారంభించు 'ఎరుగుదును' అంటుంది ఆవిడ. "ఆ పిల్ల చాలా చక్కనిది సుమా!" అను. దాంతో ఆమెకు కోపం పుట్టుకొస్తుంది. నీవు అన్యస్త్రీ సందర్శనం చేసినావగానే ఆమెకు కోపం. ఇంకేం సరిపోయింది.

సాధారణంగా ఆమెకు అల్లాంటప్పుడు కోపం వస్తుంది. ఒక వేళ రాక "నిజమేనండి! దాని కేం అది చక్కని చుక్క!" అని నీతో ఏకీభవించిందా దబ్బావన్న మాటే! ఇక ప్రణయ కలహం నడవదు. ఆమె అల్లాగ అనదు. ఒక వేళ అంటే ఏమి చెయ్యవలెనో చెపుతాను. ఆ పిల్లను కాస్త వర్ణించాలె ఇట్లాగు.

ఆ పిల్ల స్ఫటికపు బొమ్మలాగుంటుంది సుమా!

దాని ముఖము చంద్రబింబం.

దాని నాసిక మన్మథ తూణీరము.

కంఠము శంఖము.

కరములు పల్లవములు,

ఇల్లాగ వర్ణించుకుంటూ వెళ్ళాలె. ఒక్కొక్క వాక్యము అని ఆవిడ ముఖాన్ని పరీక్షగా చూడాలె. మొదట్లో ఆమె బింకంగా ఉంది ఏ వికారమూ కనపర్చకపోయినా ఈ వర్ణన అధికమైన కొద్దీ, ఆమె కోపము త్రాచుపామువలె క్రమంగా పడగవిప్పి బుసలుకొట్టక మానదు. "ఆమె నేత్రములు మన్మథ బాణములు. దంతములు కుంద కోరకములు."

ఈ మాటలు అనేటప్పటకి ఆమె ముఖం ముడుచుకుపోతుంది.

"ఆమె అధరము మంకెన పువ్వులాగ ఉన్నది." పెదవులు బిగుసుకుపోతవి.

"ఆమె నవ్వుతుంటే వెన్నెలలు కురిసినట్లు ఉంటుంది—ఆమె చూస్తుంటే అమృతపానం చేసినట్లుంటుంది." భగభగ మండుతూ ఉంటుంది మీ ఆవిడకు. ఆ మంటలు కళ్ళలో కనపడుతవి.

అంతటితో ఆపివేయటం మంచిది. "చాలు. ఇక మీ కవిత్వం కట్టి పెట్టండి" అని అంటుంది. మనకు కావలసినంత కోపము ఆమెలో ప్రజ్వరిల్లించని గ్రహించాలె ఆ తరువాత ఇంకే విషయమైనా ఎత్తడము నీకే ప్రమాదం.

ఎందుకూ అనవసరమైన మాటలు. మనకు కావలసిందల్లా ఆమెకు తగుమాత్రం కోపం రావడము. అది జరిగింది. ఆ తరువాత శాస్త్ర నిబంధనను అనుసరించి ప్రణయ కలహం క్రమంగా జరుపుకుపోవచ్చు.

ఇప్పటికి ప్రణయ కలహ విధానంలో ఒక్క మెట్టు ఎక్కినటు. ముందు జరుగవలసింది చాలా ఉన్నది.

నాయికకు కోపం వచ్చిన తరువాత ఆమె తన కోపాన్ని అనేక విధాలుగా ప్రకటితం చేయాలె. ఈ కోప ప్రకటన అనేక రకాలుగా నడుస్తుంది.

మొదదిటిది మౌనము. అంటే నాయికకు కోపంవచ్చి మౌనం వహిస్తుంది. పిలిస్తే పలుకదు. ఆమె పేరు జానకి అయితే నాయకుడు అనేకసార్లు ఆమెను జానకీ, జానకీ అని విసుగులేకుండా పిలిచినా ఆమె మాటాడదు.

ఈ మౌనస్వరూపం కూడా కొద్దిగా వివరించవలసి ఉన్నది. పెదవులు బిగించుకుని పోవాలె. మూతి ముడుచుకు పోతుంది. ముక్కు ముందుకు వస్తుంది. ఇది మౌనప్రకరణలో ప్రథమ దశ.

కాంతుడు మళ్ళీ ప్రౌఢనాయికను ముద్దుగా పేరుపెట్టి పిలుస్తాడు. అప్పటికీ ఆమె పలుక కూడదు. కనుబొమలు ముడిపెట్టి నాయకుని వంక కొఱ కొఱా చూడడముతో ద్వితీయ దశలోకి వస్తాము.

ఈ ద్వితీయ దశలో నాయిక తన చెవిలో అలంకారంగా పెట్టుకొన్న పూలగుత్తి ఏదైనా ఉంటే దానిని తీసి విసిరి నేలపై కొట్టవలెను.

నేలపై కొట్టవలెనా, ప్రియునిపై విసరవలెనా అన్న విషయంలో అభిప్రాయ భేదాలున్నవి. నేలపైనే విసిరి వేయాలని వాత్స్యాయనుని మతం. అయితే శృంగారామృతలహరిలో ఆ పూలగుత్తితో నాయకుణ్ణే తాడనం చేయాలనీ, ఇంకో విధంగా జరిగినట్లయితే ఆ ప్రణయ కలహం అశాస్త్రీయమైపోతుందనీ స్పష్టంగా చెప్పారు.

ఆ స్థితిలో ప్రణయ కలహం పట్టిన నాయిక ఎట్లా ఉండవలె అన్న విషయమును గూర్చి శాస్త్రంలో నాలుగైదు శ్లోకాలు ఉన్నవి. అందులోని విషయం క్లుప్తంగా ఇక్కడ చెపుతున్నాను.

"అట్లు కోపవశయై యున్న గాంత భర్తను చూస్తూ కూడా చూడని దానివలెను, అతని మాటలు వింటూ గూడా వినని దానివలెనూ నటించ వలెను." ఇది సూత్రార్థము.

ఇంతటితో మౌన ప్రకరణములో ద్వితీయదశ పూర్తియై ఆమె రెండు కళ్లూ కూడా అశ్రుపూర్ణములు కావడముతో తృతీయదశ ప్రవేశిస్తుంది. ఈ తృతీయదశే చాలా పట్టు అయిన దశ. అప్పుడు నాయకుడు ఆమె చుబుకమును మెల్లగా స్పృశించగా ఆమె సన్నని గొంతుకతో ఏడ్వ వలెను అని సూత్రము.

ఆ ఏడ్పు కూడా మన వాళ్ళ ఏడ్పువలె కాక కాకలీ ధ్వనిలో సుమనో హరంగా ఉండవలెను. ఈ ఏడ్పు ఎట్లా ఏడ్వాలె అని కొంత ఆలో చన జరిగింది. చివరకు మూడు విధాలైన ఏడ్పులు తేలినవి.

నాయిక మనోహరమైన స్వరంలో గొంతెత్తి ఏడ్వాలని ఒకరు అంటారు. ఈ రకం ఏడ్పు సంగీతంలాగ ఉంటుంది. ఈ పద్ధతిలో కొంత ఎక్కువసేపు ఏడ్చినా మరేమీ ఫరవాలేదు. ద్రౌపది, సీత ఈ విధంగా ఏడ్చారు. పురాణనాయికల ఏడ్పు ఇది.

నాయిక చక్కగా అలంకరించుకొని, మంచంపైన కూర్చుని ఏ మాత్రమూ ఆయాస పడకుండా ఊరికే సునాయాసంగా కళ్ళవెంట నీరు కార్చవలయునని మరొకరి మతం. చీదడము మొదలైన వెకిలి చేష్టలు ఏమీ ఉండక, ఆమె అల్లాగ శిలాప్రతిమలాగ కూర్చుని కళ్ళ వెంట ముత్యాలలాంటి నీటిబిందువులు రాలుస్తూ ఉంటే, చూడడానికి ముచ్చటగా ఉంటుంది. వరూధిని మొదలైన ప్రబంధనాయికలు ఈ విధంగా ఏడ్చారు.

చాపమీదనో, పరుపుమీదనో బొక్క బోర్లా పడుకొని ఏడ్చి ఏడ్చి దిండు అంతా తడవడము మూడో పద్ధతి. మామూలుగా మన వాళ్లు ఈ రకంగా ఏడుస్తారు. కాంతం ఈ పద్ధతినే ఏడ్చేది. ఎట్లా ఏడ్చినా మొత్తం మీద కొంత మృదువుగానూ, సుఖంగానూ ఏడిస్తే అప్పటికి ఆ ప్రకరణం శాస్త్రీయంగా నడిచినట్లు భావించవచ్చు.

దాని తరువాత ప్రణయ కలహం నిర్వేద ప్రకరణలోకి ప్రవేశిస్తుంది. నాయకుడు తన ప్రియురాలుకు మంచి పుష్పదామము ఒకటి ఇయ్య బోనికి ప్రయత్నిస్తాడు. "ఓ ప్రేయసీ! ఈ పుష్పగుచ్ఛమును గొనుము. ఇది నీకై తెచ్చితిని. నాపై కినుక ఏల?" అనవలెను.

నాయిక వంచిన తల ఎత్తకుండానే "నా ముఖానికి తోడు పూలు కూడానా! పూలు పెట్టుకునే యోగ్యత ఉంటే ఇంకా అనుకోవలసిం దేముంది!" అని ఎత్తిపొడుపు మాటలతో ప్రియుని సాధిస్తుంది.

ఈ మాటలు నోటితో అనకూడదనియు. ఈ మాటల యందున్న అర్ధమునే స్ఫురింపజేసే చూపులు చూడవలయు ననియూ, నాయిక పెదవి విప్పి ఒక్కమాట కూడా మాట్లాడకూడదనియూ, ముకుళించుక పోయిన కనులను వికసింప జేయరాదనియూ శృంగారామృతలహరిలో చెప్పబడి యున్నది. ఇది నిర్వేద ప్రకరణము కాబట్టి ఇందులో నాయిక ఏమీ మాట్లాడకుండా ఉండడమే ఉచితము అని తోస్తుంది.

ఈ క్రియ అన్నియు శయ్యపై పవళించిన స్థితిలో చేయవలయునా, రత్నకంబళముపై కూర్చున్న స్థితిలో జరుగబడవలెనా అనేది మళ్ళీ వివాదగ్రస్తమైన విషయంగా ఉన్నది.

విషయము చాలా ప్రాముఖ్యము గలది కాబట్టి ఈ విధంగా అడుగడుగు నకూ అభిప్రాయభేదాలు ఏర్పడుతూ వచ్చినవి.

పడుకొని ప్రియునివైపు మొగము త్రిప్పి ఉంచుటయే ఉచితమనియూ, అప్పుడే శరీరగత సౌంధర్యము ప్రదర్శితము అగుననియూ వాత్స్యా యనుడు అంటాడు.

వామనుడు వాత్స్యాయనుని మతాన్ని అంగీకరిస్తూ అప్పటి నాయిక స్థితిని గూర్చి మరి కొన్ని క్రొత్త విషయాలు చెప్పినాడు. ఏమనీ అంటే "నాయిక కబరీచ్యుత పుష్పచయము శయ్యపై అంతటా చిందర వందరగా పడియుండవలయునూ అని!"

క్షేమేంద్రుడు. అల్లాగ పుష్పాలు శయ్యపైన ఉండకూడదనీ. అవి కొప్పునుండి విడిపోయి పడిపోక అల్లాగ జారుతూ ఉండాలనీ. కాంత మన్మథపూజ చేసి వివశురాలై ధ్యాన నిమగ్నయైనగతి పడుకొని ఉండవలయునని కూడా చెప్పినాడు.

ఈ మత భేదాలను మనము ఏమీ పాటించ నక్కరలేదు. ఎల్లా ఉన్నా ప్రణయ కలహం జరుగటానికి అభ్యంతరము ఏమీ ఉండదు.

పరుపుపైన వేసిన దుప్పటి కూడా అంతా సమంగా కప్పబడియుండక ఒక మూలకు తన్నివేయబడినదై ఉండవలయుననీ. దిండ్లు కూడా నాలుగు దిక్కులా చిందరవందరగా పడి ఉండాలనీ విధించినాడు క్షేమేంద్రుడు.

వాత్స్యాయనుడు చెప్పినట్లు ప్రియుని చూస్తూ ఉండటానికి అనువైన రీతినే పడుకొని ఉండటము చాలా ఉచితముగా ఉన్నది. కొంత పెడ ముఖమై పవళించి ఉంటే. భర్తకు తన దీనావస్థా. తాను పడుతూ ఉన్న శ్రమా. అంతా చూడటానికి వీలుండదు. ఆయన చూడకపోతే ఎందుకు వచ్చిన శ్రమ ఇదంతా। వృథా।

కాబట్టి ప్రణయకోపం పట్టిన వనిత తన వదనమూ. అంగసౌష్ఠవమూ ప్రియునికి కనుపించే రీతినే పడుకొని తన అశ్రుపూరిత నయనాలను భర్తకు ప్రదర్శిస్తూ. తనను చూడని సమయంలో భర్తపైపు దొంగచూపులు చూస్తూ అతని మనో వికారములను కనిపెడుతూ ఉండవలయునని వాత్స్యాయనుని సిద్ధాంతము. ఇదే బాగుంది.

అప్పుడు నాయకుడు తన ప్రియురాలు ప్రణయ కలహం పట్టిందని గ్రహించినవాడై. ఏవేవో అనునయ వాక్యాలు పలుకాలనీ. ఆమె కేశబంధమును అలంకరించుటకు ప్రయత్నము చేయవలయుననీ. ఆమె అతని చేయిని గట్టిగా విదిలించివేసి. అప్పుడు పెడమొగమై పడుకోవలయుననీ చెప్పినాడు. అప్పటికి నిర్వేద ప్రకరణము పూర్తి అవుతుంది.

ఆటు తరువాత వచ్చేది ఆ వేదన ఘట్టము. ఈ ఘట్టములో ప్రణయ కలహం పట్టిన స్త్రీ విరహవేదనను ప్రదర్శించవలె. ఇది ఎట్లాగా నడుస్తుందో చూడండి.

నాయకుడు ప్రియాంగనను సమీపించి ఆమె వివిధాంగములను అనగా ముఖ్యంగా సౌందర్యసీమలను అన్నింటినీ కరపల్లవములచేత పరామర్శిస్తే, కోపముచే వివశురాలైన ప్రేయసి ఆతని చేయి విదిలించుట, అంగములను కుంచింపజేయుట, తన్నుకొనుట, దుప్పటిని ఒంటి నిండా కప్పుకొనుట, మొదలైన పనులు చేయవలయునట; నాయకుడు విసుగులేకుండా ఆమెను ప్రీతివచనములతో అనునయింప ప్రయత్నము చేస్తూ ఉండవలెను.

తరువాత ఆమె శిరోజాలపై చేయి వేస్తాడు. ఆమె తీసి వేస్తుంది. ఆ చెయ్యి వక్షోజాలపై పడుతుంది. ఆమె మరింత బలంగా నెట్టివేసి ముడుచుకుపోతుంది. తరువాత ఆ ప్రియుని హస్తము ఆమెగారి యొక్క మృదువైన పాదపద్మములపై పడుతుంది. ఆమె మెల్లగా ఆ హస్తమును త్రోసివేస్తుంది.

ఆ తరువాత అనుకోకుండానే ఆమె లేచి, మెడలోని హారాలను, హేమ భూషణాదులను తీసి విసిరి కొంచెం దూరంగా పారేస్తుంది.

ప్రబంధ నాయికలు అయితే ముత్యాల హారాలు, బంగారపు గొలుసులు మొదలైన వానిని తీసి పారేస్తారు, పారవేయడమే శాస్త్ర సమ్మతము. అయితే మన ఆడవాళ్ల ఈ విషయంలో మటుకు శాస్త్రానికి బెత్తెడు అటూ, బెత్తెడు ఇటూ నడచినా ప్రణయ కలహం అశాస్త్రీయము కాదూ అని చెపుతున్నాను.

ముత్యాలహారాలు లేకపోయినా, ఆ ఉన్నవానినే పారవేస్తే తెచ్చుకోవడము కష్టం.

ఎందుచేతనూ అంటే, వాళ్ళంతా రాజుల భార్యలు. వాళ్ల గొలుసులు అవీ ముక్కలు ముక్కలుగా చేసినా వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు. మన వాళ్లు ఈ విధంగా ప్రణయ కలహం వట్టి మాటిమాటికి గొలు

సులు అవీ ముక్కలు చేస్తుంటే. మళ్ళీ చేయించుకోవడము కష్టము. దేశకాల పాత్రలనుబట్టి శాస్త్రనిబంధనలను కాస్త సడలిస్తూ ఉండ వలయును గదా।

చిట్ట చివరిమాట. ఈ రకంగా విరహవేదనను ప్రదర్శించి ప్రియుని అనేక విధాలుగా బాధించవలయును అని ఉన్నది.

ఈ ఘట్టంలో నాయిక నానాహంగామా చేయడానికి వీలు ఉన్నది. ప్రబంధ నాయికలు ఏమి చేస్తున్నారో చూడండి.

ఒక నాయిక ఆ సందర్భంలో ప్రియుని కొఱకొఱా చూసిందట। అతణ్ణి నమలి మ్రింగుదామన్న కోపం వచ్చేసింది ఆమెకు। కోపం వచ్చినా అంత ఎత్తున రావటము మంచిది కాదు. ఇదంతా క్రీడ గదా? ఆ సంగతి మరచిపోతే ఎట్లా?

వేరొక నాయిక అట్టి సమయమున తన చెవియందున్న స్ఫుటిత మనోహర పక్ష్మ కేసరమగు నీలోత్పలంతో నాయకుణ్ణి కొట్టిందట. నీలోత్పలము సమయానికి దొరక్కపోతే కొప్పులో ఉన్న పూల చెండు తీసి ప్రియునిపైకి విసరవచ్చును.

ఈ ఘట్టం మట్టుకు సక్రమంగా సతుస్తుందని నాకు ఏ మాత్రమూ నమ్మకం లేదు. ఎందుచేతనూ అంటే అది మహా పట్టు అయిన ఘట్టము. నాయిక కోపగ్రసిత అయి ఉంటుంది. ఆ కోపంతో ఆమె ఏమి తీసుకొని కొట్టినా కొట్టవచ్చు.

అందుకని ఆమెకు అందికలో తాళంచెవులగుత్తులు, రూళ్ళకర్రలు మొదలైన వస్తువులు లేకుండా ముందుగానే జాగ్రత్తపడటము మంచిది.

మా కాంతం ఒక సారి ఏమీ దొరక్కపోయేసరికి దిండు తీసుకొని కొట్టింది.

దేనితో కొట్టినా వచ్చే పెద్ద ప్రమాదం ఏమీ లేదు. కాని ప్రణయ కలహం తగలడి పోతుంది. మన ఇంట్లో యేదైనా పండుగ వస్తే

దేవతారాధనకు పూజాద్రవ్యాలను ఎలాగైతే ముందుగా తెచ్చి పెట్టు కొంటామో అల్లాగే ప్రణయ కలహం జరుపడానికి కావలసిన ద్రవ్యాలు. నీలోత్పలాలు అటువంటివి ముందుగానే తెచ్చి శయ్యా సమీపంలో అట్టిపెట్టుకోవాలె.

ప్రబంధనాయికలు ఒక నీలోత్పలంతోనే కొట్టేవాళ్లు. ఇంక దేని తోనూ కొట్టేవాళ్లు కాదని అనుకోడం పొరబాటు.

ఏ వస్తువుతో కొట్టవచ్చునో శాస్త్రకారుడు స్పష్టంగా చెప్పలేదు. చెప్పకపోయేటప్పటికి ఏది దొరికితే అది తీసుకొని కొట్టడము సాగించారు.

ఒక్క చిన్న విషయములో పొరపాటు వచ్చేసరికి ఎంత ప్రమాదం సంభవించిందో చూడండి: కామసూత్రాల కర్త ఏమి, శృంగారా మృతలహరీ కర్త ఏమి, మరొకరు ఏమి ఈ విషయములో జాగ్రత్త పడి ప్రతి చిన్న విషయము వ్రాసినారు. ఈ ఒక్క విషయములో మటుకు ఎందు చేతనో స్పష్టంగా దీనితో కొట్టవలెను. మరి దేని తోనూ కొట్టకూడదు అని వ్రాయలేదు.

అందుకనే నాయికలకు ఎక్కడలేని స్వేచ్ఛ వచ్చి దేనితో బడితే దానితో కొడుతున్నారు. తామరపూలతోటి, కాడలతోటి, వట్టివేళ్ళ వినసకట్టలతోటి ఒక చేమిటి. ఆ సమయానికి ఏది అందికలో ఉంటే దానితో తాడనం చేస్తున్నారు.

ఒక నాయిక ఏమీ దొరక్కపోతే నల్లత్రాచువలె పిరుదులదాకా వ్రేలాడుతూ ఉన్న తన జడతో మోదిందట. మా తాడయ, అని నాయకుడు గోలపెట్టినాడట: అది కొంతవరకు బాగానేఉన్నది.

కాని ఇప్పటి నాగరిక స్త్రీలు వటీరావువంటివాళ్లు ఏం జేస్తున్నారూ అంటే సన్నని తాడుతో గాని, మెలివేసిన పైట చెంగుతో గాని, సవ రం వాడులాగ పేని దాంతోగాని ఈ ప్రక్రియ చేస్తున్నారట:

ఈ విధంగా ప్రేయసి ఈ తాడన ప్రక్రియ జరుపుతూ ఉన్నప్పుడు నాయకుడు చెయ్యి అడ్డము పెట్టుకోకుండా చిరునవ్వుతో ఊరుకో వలెను.

కూరుకొని ఆమెను అనేక విధాలుగా బుజ్జగించాలె. చెక్కిళ్ల తాక డమూ, గడ్డం పట్టుకొనడమూ, ముంగురులను సవరించడమూ, కపోలములను మృదువుగా స్పృశించడమూ మొదలైన పనులు చేస్తూ ఉండాలె.

ఇది ముఖ్యంగా విరహవేదనకు సంబంధించిన ప్రకరణము అని గుర్తుంచుకోవలెనంటే పది మన్మథావస్థలను దాటాలె.

నాయిక ఉపలాలిత అవుతూనే క్రమంగా ఈ పది అవస్థలనూ పొంది, తన అనుభూతిని ఉచితమైన రీతిని బాహ్యేంద్రియాల మూలంగా ప్రకటితం చేయాలె.

ముందు నాయకుణ్ణి చూడవలె. దాని తరువాత ఎట్లాగా అని ఆలోచిస్తుంది. * దాని పేరు సంకల్పావస్థ. దాని తరువాత స్మృతి, అరతి, లజ్జా, త్యాగము, గమనము, ఉన్మాదము అనే స్థితులు ఆమె వరుసగా దాటి మూర్ఛ అనే స్థితికి రావలసి ఉంటుంది.

ప్రియురాలు మూర్ఛ అనే స్థితికి వచ్చిందో, ఇంకా వెనకాలే ఉన్నదో ఎట్లా తెలుస్తుందీ అని సందేహము కలుగవచ్చు. అది కనుక్కోవడము అంత కష్టమైన పనికాదు.

ప్రణయ కలహం పట్టిన నాయిక మూర్ఛ అనే స్థితికి వచ్చిన తరువాత పిలిస్తే పలుకదు అంగములను అట్టిట్టు కదల్పదు. కను దమ్ముల దెఱువదు. "రోజుచు కదు వలవంతల జిక్కి వాల పాన్పున సోలున్—". అని ఉన్నది. ఈ గుర్తులనుబట్టి ఆమె మూర్ఛలోకి వచ్చినదని నాయకుడు గ్రహించాలె।

అపుడు ఆమెను నాయకుడు ధైర్యంగా సమీపించి, ముద్దు పెట్టుకొనుటకు వంగి తన ముఖమును ఆమె ముఖమునకు సమీపంలోకి తీసికొని పోతాడు.

---

* చెయ్యి అడ్డం పెట్టుకొన్నా, ముసి ముసి నవ్వులు నవ్వుతూ ఉంటే ఆ దోషం పోతుందని పండితుడు జమదగ్ని శర్మ అన్నాడు.

• సన్నిధానం వారు.

ఆమెగా ఇంకా కోపం పోలేదాయె। ఆ పలుకక పోవడమూ, మాట్లా డక పోవడమూ అదంతా ఉధృతంగా ఉన్న కోపము వలననే। ఉధృతమైన కోపము ఉన్న స్థితినే మూర్ఛ అన్నారు. అది మామూలు మూర్ఛపోవడము కాదు.

ఎప్పుడైతే నాయకుడువంగి తనకు సమీపం అవుతాడో అప్పుడు నాయిక తాను యింకా కోపంగానే ఉందినట్లు తెలియజేయడానికి, అతని చెంపపై మృదువుగా కొట్టవలె. అంటే అంత తేలికగా కాకుండా, అంత కఠినంగానూ కాకుండా ఓమోస్తరు దెబ్బ ప్రియుని చెంపపై తగిలించాలె. * దానితో ఈ ప్రకరణం పూర్తి అవుతుంది. ఈ మృదువైన పల్లవములవంటి కోమలమైన హస్తముతో కొట్టబడిన నాయకునిస్థితి వర్ణిస్తూ పది శ్లోకాలదాకా వ్రాసినాడు శాస్త్రకారుడు. నాయకుడు రసమూర్తియై అవ్యక్తమైన ఆనందంలో ఉండిపోతాడు. అతని తనువు పూచిన కాకరతీగె అవుతుంది. అది యొకవిధమైన ఆనందమయమైన తన్మయత్వస్థితి.
అతడొక తెలిసీ తెలియని స్థితిలో ఉంటాడు. అంటే తనచుట్టూ ఎవరు ఉన్నారో, ఏమి జరుగుతున్నదో తెలియదు. • ఆ తెలియక పోవుటలోనే తెలియుటయు కలదు. ఆ తెలిసినదల్లా ఒక ఆనం దానుభూతి.
ఇటి తన్మయత్వస్థితిలో నాయకుడు కొంతసేపు ఉండి తెప్పరిల్లి ధైర్య మునుచిక్కబట్టి మెల్లగా ప్రియురాలును సమీపించి, "కాంతా। ఎందుకింత కోపము। నా అపరాధమును క్షమింపుము" అంటూ ఆమె కాళ్ళకు మ్రొక్కవలెను.

కాళ్ళమీద పడ్డ ప్రియుణ్ణి, కుపితమైయున్న కాంత ఎడమ కాలుతో తన్నవలెను. ఇది జరుగవలసిన పని.

ప్రియురాలు కాళ్ళమీద పడడానికి నాయకుడు ఏమాత్రం సంకోచింప రాదు. కృష్ణుడు సత్య కాళ్ళపై పడ్డాడు. దశరథుడు కైకేయి

---

* మాకాంతం చెంపమీద కొట్టకుండా చెవులు మెలవేస్తూ ఉండేది.
• విశ్వనాథవారు, శ్రీమతి వసుంధర అన్నారు.

కాళ్ళపై పడ్డాడు. చివరకు కాంతంకూడా ఈ కామక్రీడ జరిపించి. ఆ యా నాయికలు తమ తమ ప్రియులను ఎడమకాలితో తన్నారు. నాయిక ఎంత కోపంలో ఉన్నా తాను తన ప్రియుణ్ణి ఏ కాలుతో తన్నుతున్నదీ గుర్తుంచుకోవాలె. ఒక కాలు తన్నాలని అనుకొని మరొక కాలుతో తన్నిందా ప్రణయ కలహం అంతా పాడై పోతుంది. అప్పటికి ప్రణయ కలహం మాంచి పట్టులోకి వస్తుంది.

నాయిక ప్రియుణ్ణి ఈ విదంగా తన్నుట ఉచితవ్యాపారమేననీ, కామ శాస్త్ర సమ్మతమనీ, వాత్స్యాయన మహర్షి ప్రణీతంబైన కామసూత్రాలలో వ్రాసి ఉన్నది. పారిజాతాపహరణంలో ఈ భాగము చూడదంటే కావలిస్తే.

జయమంగళుడు వ్రాసిన వ్యాఖ్యానములో కూడా ''క్రోధప శాత్తస్య శిరశి పాదతాడన మపి నదోషాయ సౌభాగ్య చిహ్నం భవతి నాగరక వృద్ధాః'' - అని ఉన్నది.

నాయిక గురుమానముచేత అల్లాగచేయడము అలంకారిక సమ్మతము. పూర్వపు రాజులంతా తమతమ దేవేరుల పాదపద్మములకు నమస్కరించినట్లు వాల్మీకి వర్ణించాడు. దశరథుడు కౌసల్యకుకూడా మ్రొక్కినట్లు అయోధ్యాకాండలో ఉన్నది. ఇల్లాగే దుష్యంతుడు శకుంతలకు ప్రణమిల్లినట్లు కాళిదాసు వర్ణించినాడు. విష్ణుమూర్తి భార్యను హృదయంలోనే పెట్టుకొన్నాడు కదా! శివుడు సరే సరి గంగను నెత్తిమీద ఎక్కించుకొన్నాడు. ఆధునిక కావ్యాలలో సౌందర నందంలో * నందుడు సుందరికాళ్ళపై పడ్డట్టు కవులు వర్ణించారు.

ప్రియుడు కాళ్ళపై పడడముతోటే నాయిక నవ్వి, అతనిని కౌగిలించుకోవాలె అనీ, అంతటితో ప్రణయకలహం పూర్తి అవుతుందనీ శాస్త్రకారుడు వ్రాసిఉన్నట్లయితే చాలా బాగుండేది.

ఇక్కడ శాస్త్రకారుడు కాస్త చాదస్తంలోకి పోయినాడు అని తోచింది. ఎందుకంటే ప్రణయ కలహం అంతటితో సమాప్తి కాకూడదనీ, ఇంకా కొంతకార్యక్రమము ఉందనీ శాస్త్రకారుడు సూత్రాలు వ్రాసినాడు.

---

* శ్రీ శ్రీ, కాటూరి, పింగళి కవులు.

నాయకుడు, ప్రియురాలు కాళ్ళపై పడి క్షమించమని కోరి, వెంటనే లేచి నిలుపబడాలన్నాడు. ఆమె ప్రియుణ్ణి చేతులతో లేవనెత్తి హృదయానికి హత్తుకొనవలయును అని వ్రాసి ఉన్నట్లయితే ఈ ప్రణయ కలహం నడక బహు మనోజ్ఞంగా ఉండేది. అట్లా అనక ప్రియుడు తానంతట తానే లేచి నిలుచుండవలయును అని అనడముతో వ్యవహారం అంతా మళ్ళీ మొదటికే వచ్చేసింది!

గాని అందులో ఎల్లాగ చెప్పబడి ఉన్నదో అల్లాగే జరుగవలెననీ, మనము ఏమీ మార్పులు చేయకూడదనీ అనేవాళ్ళలో నే నొకణ్ణి, శాస్త్రములయందు ప్రమాణబుద్ధి గలవాళ్లు ఎవరైనా ఇట్లాగే అంటారు. సరే, ఈ వ్యాఖ్యానాలు వదిలివేసి అసలువిషయానికి వస్తాను. ప్రియుడు లేచి నిలువబడగానే, ఆ అమ్మాయికూడా లేచి నిలువబడి భర్తను నిశితంగా చూడవలెను అన్నాడు.

ఈ చూడడము అనీ పెట్టుకోక విశ్వనాథ సత్యనారాయణగారు అరుంధతికి, ధర్మారావుకు వచ్చిన ప్రణయ కలహాన్ని ఈ పట్టులో తాకున తుంచేసి సమాప్తి అయ్యేలాగున చేసినారు.

ధర్మారావు "అరుంధతిని ఎత్తుకొని గాఢముగా హృదయమునకు హత్తుకొనెను" అన్నాడు. ఆమె నవ్వించదట. అంతటితో ఆ ప్రణయ కలహం సమాప్తి నొందింది.

ఆయన చేశాడు గదా అని మనముకూడా ప్రణయకలహం ఆ విధంగా పర్యవసించునట్లు చేయకూడదు. ఆయన కవి, ప్రతిసృష్టి చేయగలడు. మన కది ఆదర్శముకాదు.

అయితే ఏమి చెయ్యాలె? శాస్త్రంలో చెప్పినట్లు నోరుమూసుకొని చెయ్యాలిసిందే!

భార్య కాళ్ళపై బడ్డ తరువాత భర్త వెంటనే లేచి నిలువబడవల యును అన్న విషయంతో క్రిందటి ప్రకరణము ఆపివేశాము.

ప్రియురాలు కూడా లేచి నిలువబడ వలయును అని ఇంకో వాక్యం కూడా ఉన్నది. ఆమెకూడా లేచి నిలువబడవలయును అన్న వాక్యాన్ని బట్టి అప్పటిదాకా ఆమె పడుకొనే ఉన్నదనేకదా ఊహ్యము. అంతకు ముందు చెంపదెబ్బ కొట్టినపుడు కూడా ఆమె పడుకునే ఉన్నది. ఆమె లేచి కూర్చున్నట్లు ఎక్కడా చెప్పలేదు.

అయితే పడుకొని ఉన్న స్త్రీ కాళ్ళపై ప్రియుడు ఎట్లా పడ్డాడు? అది అంత వీలైన స్థితి కాదే: అని బోలెడు సందేహాలు వస్తవి.

ఆమె శయనించి ఉన్న స్థితిలోనే ఆమె పాదములపై పడాలె. ఎట్లాగా అని అడగకూడదు. పడాలె అంతే. రెండు విధాలుగా ఈ ప్రక్రియ జరుపవచ్చు. నాయకుడు మంచంప్రక్కన నిలువబడి, తన శిరస్సును మాత్రం ఆమె పాదములకు అనించడము ఒక పద్ధతి. రెండోది తల ఆమె పాదపద్మములపై పెట్టి కాళ్లమాత్రము నాయిక శిరస్సుపైపునకు చాపి, ఆమెప్రక్కన పడుకోవడం రెండో పద్ధతి. ఈ రెండు పద్ధతులు కాక ఇంకోపద్ధతి ఊహించడానికే వీలులేదు.

ఈ రెండింటిలో శాస్త్రకారుడు ఊహించినది రెండవ పద్ధతియే అని మనము నిశ్చయించుకోవచ్చు. ఎందుచేతనూ అంటే మొదటివిధంగా నాయకుడు నిలువబడి తలమాత్రము ఆమె పాదములకు తాకునట్లు చేసినట్లు అయితే అతడు లేచి నిలువబడవలయును—అ వాక్యము వ్రాయవలసిన అవసరం ఏమి వస్తుంది? * కాబట్టి ఈ ప్రక్రియ నేను

* Stand on అన్నప్పుడు స్టాండు అంటానికి వీల్లేదని భమిడిపాటి అన్నగారి సిద్ధాంతము.

సూచించినరీతిగా ఆమె సరసను పడుకొని చేయవలసిందే అని తేలి పోయింది.

అల్లాగ ఆమె ప్రక్కను శయనించగానే అతనికి ఒక సుఖమైన అను భూతి కలిగి మళ్లీ లేవాలని బుద్ధి పుట్టదు. అందుకనే నాయకుడు లేచి నిలుపబడవలయునని శాస్త్రకారుడు విధించినాడు. నాయిక కూడా లేచి నిలుపబడి అతనిని కోపంగాచూచి, ద్వారబంధమువైపునకు నడచి గడప అవతల చతికిలబడవలెను అని వ్రాసినాడు. ఈ ప్రకరణను ద్వారగమన ప్రకరణ అన్నాడు శాస్త్రకారుడు.

అప్పుడు నాయకుడు ఆమెను శాంతపరచి లోనికి తీసికొని రమ్మని దూతికను నియోగించాలె. ఈ దూత్యమువలననే భార్యా భర్తలకు సమాధానం కుదరవలెనుగాని మరోవిధంగా కుదరకూడదు.

ఈ దూతికను పంపడము నిజంగా లేనిపోని బెడదే। కాని ఏమి చేస్తాము। తప్పదు।

ఈ దూత్యము నడుపవలసింది ఎవరూ అని మళ్ళా ప్రశ్న! నటి, దాసి, పొరుగింటి ఆవిడ, బాలసన్యాసి, తాంబూలిక, గాంధిక స్త్రీ, చాకిత మొదలైనవారు, ఈ పనికి పనికి వస్తారని శాస్త్రప్రవచనము. ఆ దూతిక నాయికదగ్గరకు వెళ్లి "అమ్మా। ఏదో పొరపాటే అయి పోయింది. అయ్యగారు తమ పాదాలమీద పడ్డాకూడా ఇంకా మీరు శాంతించకపోవడము బాగుండలేదు, ఇక రండి. అయ్యగారితో సంతోషంగా మాట్లాడండి" అని ఏదో ఆ ధోరణిలో కొన్నిమాటలు అనాలె.

అయితే ఇక్కడ ఓ చిన్న ఇబ్బందిని మనము గుర్తించవలసి ఉన్నది. ఆ అర్ధరాత్రివేళ మనకు దూతిక ఎక్కడనుంచి వస్తుందీ అని। "నా

భార్య ప్రణయకలహం పట్టింది, అమ్మమ్మ మీరొచ్చి దూత్యం నడుప వలసిం" దని ఎవరిని బతిమిలాడితే ఎవరొస్తారు ఆ వేళప్పుడూ!

చాకలిది ఈ దూత్యానికి పనికివస్తుంది కాబట్టి, దాన్ని ఆ వేళకు వచ్చి సిద్ధంగా ఉండమని ముందుగానే చెప్పిఉంచాలె.

ఈ దూత్యమువలన నాయిక మెత్తపడి సుముఖయై, శయ్యామందిరం లోకి వచ్చి అద్దానికి ఎదురుగా నిలువబడి, ముంగురులు, పమిట సవరించుకొని, ఆ తరువాత జరుగవలసిన కార్యక్రమానికి సిద్ధం కావాలె. కోపంలో ఉన్న స్త్రీ తెల్లచీర గట్టవలయునని శాస్త్రము. ఇంతవరకు ఆమె ధౌతవస్త్రమునే ధరించి ఉంటుంది. ఇప్పుడు ఆమె పక్కగది లోనికో, తెరచాటునకో వెళ్లి మంచి ఆకుపచ్చ జరీచీర కట్టుకొని, సకలాభరణములను ధరించి, ముసిముసి నవ్వులు నవ్వుతూ శయ్యాగారమును మళ్లీ ప్రవేశిస్తుంది.

ఇంతటితో ప్రణయకలహం పూర్తి అయినట్లే కాని, కొందఱు అలంకారికులు ఇంకా మరి రెండు విషయములుకూడా చెప్పినారు.

శ్రమపడి ప్రణయకలహాన్ని శాస్త్రీయంగా ఇక్కడదాకా లాక్కొచ్చి, ఇక ఒకటి రెండు ప్రక్రియలలో మనము లోభించడము భావ్యము కాదు. అవికూడా జరుపుటయే ఉత్తమం?

# 8

ఈ • సంభోగ శృంగారక్రీడ ఏవిధంగా పర్యవసించవలెను అనే విషయంలోకి వచ్చాము.

భార్యా భర్తలు ఇద్దరు నిలువుటద్దానికి ఎదురుగా నిలువబడి ఒకరి నొకరు చూచుకొని, నవ్వుకొని తదుపరి ఆలింగనము చేసుకొంటే,

• నేను ఏనివి విప్రలంభ శృంగారమూ అంటే జమదగ్నిశర్మ, కాదు, ఇది సంభోగ శృంగారము అన్నాడు. సరే అని ఒప్పుకున్నాను.

ఈ కలహం క్రమపద్ధతిని నడిచి సమాప్తి నొందినట్లే అని శాస్త్రకారుడు అన్నాడు.

ఇక్కడ ఓ చిన్న ఇబ్బంది వచ్చింది. అంతవరకు ఎంతో కోపాన్ని పట్టి, ఇంత గ్రంథం నడిపిన మనిషి, ఈ స్థితిలో చటుక్కున మెత్త పడి, భర్త పరిష్వంగంలోకి జారి ఊరుకుంటుందా అని?

ఊరుకొంటే ఏ ఇబ్బందీ లేదు. ఊరుకోక ఇంకా బెట్టుచేస్తే అప్పుడు ఏమిచేయాలా అన్నది ప్రశ్నగా:

శాస్త్రమన్నప్పుడు అన్ని విషయాలు చక్కగా చర్చించి సాధక బాధకాలు అన్నీ గుర్తించి అన్నిటికీ అన్నీ చెప్పాలిగాని, ఇంతవరకు ప్రేయసీ, ప్రియులను క్రమమార్గాన నడిపించుకొనివచ్చి అమాంతం ఈ స్థితిలో వాళ్ళను వదిలేసి మీ తిప్పలు మీరు పడండని అనడము న్యాయమూకాదు. శాస్త్రవేత్త చేయవలసిన పని కాదు. అందుకని ఒకవేళ ప్రేయసి మూర్ఖతతో ఆలింగనప్రక్రియకు అంగీకరించక పోతే ఏమి చెయ్యాలో చెపుతాను.

ముందుగానే ఆమెను కౌగిలించుకొనుటకు ప్రయత్నము చేయకూడదు. ఆమె ఉన్న ప్రదేశంలో ఏదో పనిమీద అటూ ఇటూ పోతూ ఉన్నట్లు నటించి, తన దేహమును ఆమెకు తగులునట్లు చేయాలె. ఆమెకు ఏదో ఒక రకమైన గగుర్పాటు కలుగుతుంది. ఈ పనికి స్పృష్టకము అని పేరు.

ఈ స్పృష్టకక్రియ జరిగినతరువాత విద్ధకము అని పిలువబడే ప్రక్రియ జరుపవలెను. నాయకుడు వెనుకగా వెళ్ళి నాయికను సమీపించి 'వద్దు వద్దు' అంటూఉన్నా వినిపించుకోకుండా ఆమెను బలంగా కౌగిలించుకోవాలె. దానితరువాత లతావేష్టికాలింగనము, వృక్షాధిరూఢకాలింగనము, క్షీరజల కాలింగనము అనే కౌగిలింతలన్నీ వరుసగా క్రమము తప్పకుండా జరిపి, చివరకు అంతకుపూర్వమే రచింపబడి యున్న రమణీయమైన శయ్యపై విశ్రాంతి తీసుకొనుటకై ప్రియు

రాలిని శయనింపజేసి ఆమె దిండుపై తనతల పెట్టుకొంటానికి కాస్త చోటు ఇయ్యవలసిందిగా ప్రియుడు ప్రేయసిని కోరడముతో ఈ ప్రణయకలహం సమాప్తి అవుతుంది.

ఇంతవరకు వ్రాసి పుస్తకం పూర్తిఅయింది అనుకొని మరొకసారి శాస్త్రగ్రంథాలు తిరగవేయబూనేసరికి కొంప మునిగిపోయేటంతటి ప్రమాదం జరిగిందని గుర్తించాను.

ఏమిటంటే ఆది ప్రియురాలును ముందు చుంబనముచేసి ఆ తరువాత ఆలింగనము చేయాలట! ముందే ఆలింగన జరిగిందో ప్రణయ కలహం ధ్వంసం అయిపోయినట్లే! కాబట్టి ప్రణయకలహం జరిపే వారు ఈ విషయం కాస్త జ్ఞాపకం ఉంచుకొనవలయును.

ఈ కథ అంతా నేను చదువగా విన్న కుట్టివాడు ముద్దుపెట్టుకో మన్నారుకదా ఎక్కడ ముద్దు పెట్టుకోవాలో ఆ సంగతికూడా చెప్పండి బాబూ అన్నాడు.

ఆదేమీ కష్టమైన విషయమూ కాదు. శాస్త్రకారుని ధర్మమా అని ఈ విషయంలో అన్ని వివరాలూ వ్రాయబడి ఉన్నవి. నుదురు ముంగు రులు, కపోలములు, కండ్లు, మెడ, వక్షము, హస్తములు, పాద ములు ఇవన్నీ చుంబనక్రియకు అనువైన సీమలే. మొత్తంమీద పద కొండు స్థానాలలో చుంబనక్రియ జరుపవచ్చునని, ప్రధానంగా అధ రోష్ఠము చుంబనక్రియకు ఉచిత స్థానమని, వాత్స్యాయన మహర్షి పేర్కొని యున్నాడు.

ఆలింగన విషయంలో మనకు కలిగిన సందేహమే ఇక్కడా కలుగు తుంది. కోపం వట్టి అప్పుడప్పుడే కాస్త శాంతిస్తూ వున్న స్త్రీని చటుక్కున ముద్దు పెట్టుకోవడం సాధ్యమా అని! శాస్త్రకారునికి కూడా ఈ సందేహమే కలిగి దానికి సమాధానం కూడా చెప్పినాడు.

ప్రేయసిని పరుపుపైన పడుకోబెట్టిన తరువాతగదా. ఈ ఆలింగన మైన, చుంబనమైన జరుగవలసినది. ప్రణయకలహం నడుపుటవలన

నా యిక చాలా అలసిపోయి పడుకోవడముతోనే నిద్రపోతుందనీ. ఆ సమయంలో చప్పుడు చేయకుండా ఆమెపై వంగి ముద్దుపెట్టుకోవ డమువలన వచ్చిన ప్రమాదం ఏమీలేదని, సువర్ణనాభుడు హామీ యిచ్చి యున్నాడు. ఆమె మంచి నిద్రలో ఉన్నప్పుడు పెట్టుకొన్న ముద్దుకు ప్రాంతిబోధిత మని పేరు.

ఆమె చప్పుడు నిద్రలేచి. ఏ మంటుందో వ్యవహారం మళ్లీ మొదటి కొస్తుందే అని భయపడేవాళ్లు దీపపు వెలుగులో గోడపైబడ్డ ఆమె నీడను ముద్దుపెట్టుకొని, ఆతరువాత స్పృష్టక్రియ జరుపవలెను అని సువర్ణనాభుడే వ్రాశాడు. దీనికి ఛాయాచుంబన మని పేరు.

ప్రణయ కలహం అంటే ఇంత గ్రంథం జరుపవలసి ఉన్నది. ఈ విషయం జ్ఞాపకంఉంచుకొని దిగండి. ఎవరైనా ఈ వ్యవహారంలోకి దిగ దల్చుకొంటే।

రచయిత :
మునిమాణిక్యం
నరసింహారావు

# దాంపత్యోపనిషత్తు

(ఇల్లు ఇల్లాలు ; ఇంటావిడతో పోట్లాట;
ప్రణయకలహం)

హాస్య రచయితలలో అగ్ర గణ్యుడుగా, శృంగార కల్పకంగా ప్రసిద్ధి గడించిన మునిమాణిక్యం వారు తమ చిరతరాను భవాన్ని శాస్త్ర రూపంగా నిబంధించిన గ్రంథ రాజం. మంజులములైన మధుర వాక్కులలో దాంపత్య జీవిత రమ్య చిత్రణ. వినోద ప్రధానమైన దైనా, విజ్ఞాన ప్రదమైన రచన.

యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాదు

